# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 16 సంచిక : 9 హైదరాబాద్ 206 సెప్టెంబర్ 2018 పేజీలు : 68 రు. 25

* కేరళలో వరద బీభత్సం
* నుల్కతోంగ్ ఎన్‌కౌంటర్
* రాపూరు దళితుల పోరాటం
* విద్యుత్ కార్మికుల సమ్మె
* కాళేశ్వరం వివాదం ఎందుకు?
* రాఫెల్ ఒప్పందం - భారీ కుంభకోణం
* ఇమ్రాన్ ఖాన్ అడుగులు ఎటువైపు?

# వీక్షణం విడిప్రతి కొనుగోలు కోసం

## మీ సమీపంలోని ఈ కింది న్యూస్‌స్టాల్‌లో వీక్షణం విడిప్రతి కొనుక్కోవచ్చు

| | | |
|---|---|---|
| రైజింగ్ సన్ న్యూస్ ఏజెన్సీ (సోల్ డిస్ట్రిబ్యూటర్) | ఆబిడ్స్, హైదరాబాద్ | 96666 80857 |
| నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ | హైదరాబాద్ | 90004 13413 |
| సహచర బుక్‌మార్క్ | బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ | 98483 48173 |
| బాల రాజేశ్వర బుక్ డిపో | నల్లకుంట బస్ స్టాప్ | 9705055738 |
| వెంకటేశ్వర బుక్ స్టాల్, స్టేషనరీ | నల్లకుంట, శంకర్‌మఠ్ | 040-66131071 |
| ఫస్ట్ లక్కీ పాన్ షాప్ | విద్యానగర్ సిగ్నల్స్ | 9848672831 |
| సుధాకర్ బుక్ స్టాల్ | సన్‌మాన్ హోటల్ పక్కన, తార్నాక | 9949337605 |
| వెంకటేశ్వర బుక్ స్టాల్ | రామ్‌నగర్ గుండు | 9502964995 |
| భవాని బుక్ స్టాల్ | శివం రోడ్ | 9849836996 |
| శ్రీభవాని బుక్ స్టాల్ | శివం రోడ్ (ఇండియన్ బ్యాంక్ దగ్గర) | 9640712555 |
| ఓరియన్ బుక్ స్టాల్ | అంబర్‌పేట్ (శ్రీరమణ టాకీస్ దగ్గర) | 7702535137 |
| అరవింద్ బుక్ స్టాల్ | రామంతాపూర్ (టివి స్టూడియో ఎదురుగా) | 8977995537 |
| రెడ్డి బుక్‌స్టాల్ | అశోక్‌నగర్, హైదరాబాద్ | |
| నేషనల్ బుక్‌హౌస్ | అబిడ్స్, హైదరాబాద్ | 9394495189 |
| దుర్గా భవన్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9030656640 |
| డైమాండ్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9885127491 |
| రాజు రామ్‌దాస్ బుక్‌స్టాల్ | మెహిదీపట్నం, హైదరాబాద్ | 7799244409 |
| రిలెబుల్ బుక్ సెంటర్ | నానల్‌గూడ, హైదరాబాద్ | 040-23512447 |
| ఇస్పెక్ట్రం బుక్‌హౌస్ | లంగర్‌హౌజ్, హైదరాబాద్ | 98486 68354 |
| శ్రీలక్ష్మి బుక్‌స్టాల్ | హైదర్‌గూడ, హైదరాబాద్ | 98855 81249 |
| లక్ష్మణ్ | చిక్కడపల్లి, హైదరాబాద్ | 93910 12051 |
| మల్లిఖార్జున్ బుక్‌స్టాల్ | దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ | 90594 40756 |
| సుధీర్ బుక్‌స్టాల్ | తార్నాక, హైదరాబాద్ | 95426 04166 |
| లడ్డు బుక్‌స్టాల్ | పంజగుట్ట, హైదరాబాద్ | 99492 15135 |
| వినోద్ బుక్‌స్టాల్ | సరూర్‌నగర్, హైదరాబాద్ | 95536 03603 |
| రాజ్ బుక్స్ స్టేషనరీ | ఓల్డ్ బస్‌స్టాండ్ దగ్గర, మెదక్ రోడ్, సిద్దిపేట్ | 87905 60097 |
| బాల్‌రెడ్డి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మహబూబ్‌నగర్ | 98660 18829 |
| శ్రీ స్వయం రాజరాజేశ్వర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుస్నాబాద్ | 90592 85948 |
| భాస్కర్ పాన్ షాప్ & జనరల్ స్టోర్ | కోహెడ | 95021 82545 |
| భండారి కిష్టయ్య బుక్‌స్టాల్ | ఫైర్‌స్టేషన్ దగ్గర, గోదావరిఖని | 98497 93836 |
| గణేష్ బుక్‌స్టాల్ | కళాభారతి ఎదురుగా, కరీంనగర్ | 97019 99007 |
| మహాలక్ష్మి బుక్‌స్టాల్ | సిటీ బస్‌స్టాండ్, హన్మకొండ చౌరస్తా, వరంగల్ | 99893 30297 |
| వినయ్ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మంచిర్యాల | 94407 57503 |
| పాండు బుక్ స్టాల్, కూల్ డ్రింక్స్ | ఆర్‌టిసి కాంప్లెక్స్, మిర్యాలగూడ | 98857 38144 |
| శరత్ బుక్ స్టాల్ | షాప్ నం. 3, ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుజూరాబాద్ | 98662 73720 |
| సత్యసాయి బుక్‌స్టాల్ | ఖమ్మం | |
| మహాకవి శ్రీశ్రీ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, పార్వతీపురం | 73825 60366 |
| మణి బుక్‌స్టాల్ | సండేమార్కెట్, నెల్లూరు | 73862 23538 |
| సురేష్ బుక్ స్టాల్ | శివాలయం వీథి, ప్రొద్దటూరు | 81210 02112 |
| పద్మావతి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, అనంతపూర్ | 73965 09767 |
| అనేక బుక్‌స్టాల్ | ఏలూరు రోడ్డు, విజయవాడ | 92472 53884 |
| మైత్రి బుక్‌హౌస్ | మజీద్ వీథి, అరండల్‌పేట, విజయవాడ | 98486 31604 |
| రాజేశ్ బుక్ సర్వీస్ | ఆర్‌టిసి బస్‌స్టేషన్ కాంప్లెక్స్, విశాఖపట్నం | 99483 19842 |
| వి. భాస్కర్ న్యూస్‌పేపర్ ఏజెన్సీ | డాబా గార్డెన్, విశాఖపట్నం | 99482 90318 |
| రాఘవేంద్ర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, ఒంగోల్ | 90595 23091 |

206 ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సెప్టెంబర్ 2018
సంపుటి : 16
సంచిక : 9







'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌పై 'VEEKSHANAM' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

***వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2018 ఆగస్టు నెలలో వచ్చిన విరాళాలు - అహ్మద్ ఎస్. - సూర్యపేట - రు. 15,000; శ్రేయోభిలాషులు, హైదరాబాద్ - రు. 5000; మిత్రులకు కృతజ్ఞతలు - సం.***

**వీ**క్షణం పత్రికను నేను 2008 నుండి చదువుతున్నాను. నిజమైన ప్రజాపక్ష, రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణ అనే అంశాల ప్రాతిపధికగా నడిపిస్తున్నందుకు ధన్యవాదాలు. ఈ వ్యవస్థ స్వభావాన్ని మూలాల నుండి అర్థం చేసుకోవడానికి తోడ్పడే ఎన్నో విశ్లేషణలతో కూడిన వ్యాసాలు, సమకాలీన అంశాలపై వస్తున్న వ్యాసాలు ఎంతో ఆలోచనా శక్తిని, చైతన్యాన్ని అందిస్తున్నాయి. ఇవి సమాజాన్ని మేల్కొలిపేవిగా ఉంటున్నాయి. ముఖ్యంగా సంపాదకీయం ప్రతీ పత్రికలో అద్భుతంగా ఉంటుంది. పోరాడే ప్రజల పక్షాన, అణిచివేతకు, హత్యలకు గురవుతున్న అట్టడుగు వర్గాలకు అండగా నిలుస్తున్న క్రమం ఎంతో ధైర్యానిస్తున్నాయి. కానీ జూలై 2018 మాస పత్రికలోని మధ్యపేజీలో జాకెట్ యాడ్ రూపంలో తెలంగాణ రాష్ట్ర 4వ అవతరణ దినోత్సవ ప్రకటనకు స్థానం కల్పించడం నన్ను ఎంతగానో బాధించింది. టి.ఆర్.ఎస్. ప్రభుత్వం సంక్షేమ పథకాల ప్రచార ఆర్భాటం– ఏకరువు పెడుతూ కె.సి.ఆర్. నాలుగు సంవత్సరాల కాలంలో చేసిన మేలేమిటో మూడున్నర కోట్ల ప్రజలకు తెలియనిది కాదు. మన వీక్షణం పత్రికను కాపాడుకొనేందుకు ఎందరో పాఠకులు సిద్ధంగా ఉన్నారు, ఉంటారు. మీ కృషి ఎల్లకాలం ఫలిస్తుంది. ధైర్యంగా ముందడుగు వెయ్యండి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ప్రకటనలు ఇక ముందు వీక్షణం పత్రికలో స్థానం కల్పించరని ఆశిస్తున్నా.

**– ఆర్. అశోక్‌కుమార్**
భద్రాద్రి కొత్తగూడెం

**వీ**క్షణం గత సంచికలో అచ్చయిన 'కౌలు రైతుల మీద పాలకుల కుతర్కాలు' అట్లాగే 'ముఖ్యమంత్రి–కౌలు రైతులు' వ్యాసాలు తెలంగాణ ప్రభుత్వం అమలు చేస్తున్న 'రైతు బంధు పథకం' విధానాన్ని విశ్లేషిస్తూ రాశారు. అసలు రైతు అర్థాన్నే మార్చి వ్యవసాయం చేయకుండా వందల ఎకరాలు కలిగిన భూ యజమానులకు (సెజ్‌లు, రియలెస్టేట్‌లు, ఫాంహౌస్‌లు, కంపెనీలు పేర ఉన్న భూమికి)కూడా ప్రభుత్వం ఈ పథకాన్ని వర్తింపజేస్తున్న తీరును చాలా వివరంగా తెలిపారు. పాఠకులకు, రచయితలకు, అచ్చువేసి చేర్చిన వీక్షణం పత్రికకు కృతజ్ఞతలు. ఈ పథకం సాగుచేస్తున్న చిన్న, సన్నకారు రైతులు, కౌలు రైతులు అప్పులపాలు కాకుండా వారికి ఆర్థికంగా ఉపయోగపడాలి. కాని ప్రభుత్వం అసలు కౌలురైతులే లేరంటోంది. ఈ పథకానికి ఒక పరిమితంటూ లేదు. వందల ఎకరాలు కలిగిన భూ యజమానులకు సాగుకు పెట్టుబడి సహాయం పేరుతో లక్షలాది రూపాయలు అందిస్తుంది. పట్టణాల్లో, దేశ, విదేశాల్లో విలాసవంతమైన జీవితం గడుపుతున్న వందల ఎకరాల భూ యజమానులు ఈ డబ్బుల కోసం కార్లల్లో గ్రామాలకు వెళ్లి కాలుకింద పెట్టకుండా, స్థానిక ప్రజల ముఖం కూడా చూడకుండ లక్షల రూపాయల చెక్కులను తీసుకెళుతున్నారు.

భూమి లేని దళిత కుటుంబాలకు మూడు ఎకరాల భూమి ఇస్తానన్న ప్రభుత్వ వాగ్దానం అమలు చేయలేదు. కాని ఇదే సందర్భంలో కార్పొరేట్ కంపెనీలకు వేల ఎకరాలు ఇదే ప్రభుత్వం కేటాయించింది. రైతులు పండించిన పంటకు గిట్టుబాటు ధర అడుగుతే వారిపై పోలీసుల చేత కేసులు పెట్టించి నడిరోడ్డుపై బేడీలు వేసి ఈడ్చుకెల్లి జైళ్లో పెట్టింది. తీరా ఎన్నికలు దగ్గెరపడుతున్న సందర్భంలో ప్రభుత్వం ఎకరాకు పెట్టుబడి సహాయం కింద సంవత్సరానికి రు. 8,000 ఇస్తోంది. ప్రభుత్వం వ్యవసాయరంగాన్ని పారిశ్రామిక రంగంతో అనుసందానించడంలో విఫలమై, వ్యవసాయ రంగానికి అవసరమైన విత్తనాలు, ఎరువులు, పురుగు మందులు మాత్రం ప్రైవేట్ రంగానికి అప్పగించింది. ప్రాజెక్టుల కింద నష్టపోతున్న రైతాంగానికి అదే ప్రాజెక్టు కింద ఉన్న భూమిలో కొంత భాగాన్ని నష్టపోతున్న రైతులకు ఇప్పించడానికి ప్రభుత్వం ముందుకు రావడంలేదు. అభివృద్ధి పేరుతో తెస్తున్న ప్రాజెక్టుల కింద సెంటు భూమిలేని నిర్వాసిత ప్రజలకు కూడా ఎటువంటి నష్టపరిహారాన్ని అందజేయడం లేదు. ఉత్పత్తిలో భాగమవుతూ సొంత భూమిలేని కౌలు రైతులకు, కూలీలకు ప్రయోజనాన్ని చేకూర్చే ఎటువంటి ప్రణాళిక ప్రభుత్వం వద్ద లేదు. బిజెపి చెప్పిన 'దున్నగలిగే వానిదే భూమి' విషయాన్ని ఒక రకంగా టిఆర్ఎస్ ప్రభుత్వం అమలుచేస్తోంది. దీన్ని బట్టి అట్టడుగు ప్రజల మౌలిక సమస్యలకు ప్రభుత్వం వద్ద ఎలాంటి పరాష్కారం లేదు. ఏమైన చేస్తేగీస్తే ఓట్లకోసం తప్పస్తే వారి జీవన విధానంలో మార్పులు మాత్రం తెచ్చేవి కావని అర్థమవుతుంది.

**– వై. రవీందర్**
నిజామాబాద్

**వీ**క్షణం గత ఆగస్టు సంచికలో వచ్చిన సంపాదకీయం అసంపూర్తిగా ఉంది. ప్రధాన మంత్రి నరేంద్ర మోడీ సంఘపరివార్ కార్యకర్త మాత్రమే కాదు, ఆర్ఎస్ఎస్ ఎజెండా పాలనలో అమలు చేస్తున్నారు. గో సంరక్షణ పేరుతో దేశ వ్యాపితంగా దాడులు కొనసాగుతూనే ఉన్నాయి. ఆర్ఎస్ఎస్ కవాతులు, శిక్షణా శిబిరాలు కొనసాగుతున్నాయి. ఇవి ఏజెన్సీ ప్రాంతాలకు చేరాయి. సంఘ్ కార్యకర్తలకు అలవాటైన భౌతిక దాడులు కొన్ని ప్రాంతాలలో సాగుతున్నాయి. 2013 ఆగస్టు 20న ప్రముఖ హేతువాది నరేంద్ర దభోల్కర్‌ను, 2015 ఫిబ్రవరి 16న సిపిఐ నేత, రచయిత గోవింద పన్సారేను, 2015 ఆగస్టు 30న కన్నడ విశ్వ విద్యాలయ మాజీ ఉపకులపతి ఎం.ఎం. కల్బుర్గీని, 2017 సెప్టెంబర్ 5న పాత్రికేయురాలు గౌరీ లంకేశ్‌ను హిందుత్వ శక్తులు హత్య చేశాయి. ఇది భావప్రకటనా స్వేచ్ఛపై ఆర్ఎస్ఎస్ తదితర హిందుత్వ శక్తులు జరిపిన హత్యాకాండ. అంతేకాదు గౌరీ లంకేశ్ హత్యపై ఏర్పాటైన 'సిట్' ముందు నిందితుడు పరుశురామ్ వాగ్మోర్ విచారణలో అనేక అంశాలు బయటపెట్టాడు. అభ్యుదయ, హేతువాదులు, హిందూ ధర్మానికి వ్యతిరేకంగా మాట్లాడే మొత్తం 60 మందిని మట్టు బెట్టాలని నిర్ణయించినట్లు వీరు కర్ణాటక, మహారాష్ట్రతో పాటు గోవా, ఉభయ తెలుగు రాష్ట్రాలలో ఉన్నట్లు చెప్పాడు. రిటైర్డ్ ఆర్మీ అధికారి ఇదంతా పర్యవేక్షణ చేస్తున్నట్లు చెప్పాడు. 60 మంది పేర్లు బయట పెట్టాడు. మోడీ నాయకత్వంలోనే ఒక పథకం ప్రకారం ఇవి జరుగుతున్నాయి.

**– తుంపాల శ్రీరామమూర్తి**
గాజువాక, విశాఖపట్నం

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ – ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# తరుముకొస్తున్న ఫాసిజం

ఆగస్ట్ రెండో వారంలో కేరళలో జరిగిన వరద బీభత్సం దశాబ్దాలలో కనీవినీ ఎరగనిది. ఆ వరదల్లో రాష్ట్రం అతలాకుతలమై పోయింది. కనీసం నాలుగు వందల మంది బలి అయిపోయారు. లక్షలాది మంది నిరాశ్రితులయ్యారు. రాష్ట్రంలోని ప్రధాన భాగం రోజుల తరబడి వరద నీటిలో మునిగిపోయింది. ఇది పూర్తిగా ప్రకృతి విధ్వంసం కూడ కాదు. కొండలను తవ్వే, భూమి కోతను అడ్డుకునే అడవులను నరికేసే అభివృద్ధి నమూనాను దశాబ్దాల తరబడి అమలు చేసిన దుష్ఫలితం ఈ బీభత్సం.

కేరళవాసులు ఎదుర్కొన్న ఈ వరద బీభత్సం గురించీ, అందులో మానవకల్పిత సంక్షోభం గురించీ ఈ నెల సంపాదకీయం రాయదలచుకున్నాక, సంపాదకీయం రాసే సమయానికి మరొక పెద్ద వరద, పెనుచీకటి వరద, విద్వేష రాజకీయాల వరద, హింసాపాలన వరద తరుముకొచ్చింది. దేశవ్యాప్తంగా ఫాసిజం మరొక కోర సాచింది. భిన్నస్వరాన్ని, ప్రజాస్వరాన్ని వినబడకుండా చేయాలనే వెయ్యిపడగల హైందవ నాగరాజు ప్రభుత్వం తన ఫాసిస్టు పడగను మరొకసారి విప్పి, దేశవ్యాప్తంగా విషపు గాలులు ఊదింది. ఒక ప్రాంతాన్ని, ఆ ప్రాంత ప్రజానీకాన్ని చుట్టుముట్టి ఇబ్బందుల పాలు చేసిన వరద బీభత్సం కన్న దేశం మొత్తాన్నే కబళించనున్న ఈ వరద గురించి స్పందించవలసిన అవసరం పెరుగుతున్నది.

ఆగస్ట్ 28 ఉదయం దేశవ్యాప్తంగా హైదరాబాద్, ఢిల్లీ, ముంబయి, రాంచీ, గోవా నగరాలలో మహారాష్ట్ర పోలీసుల దాడి మొదలయింది. హైదరాబాద్ లో వరవరరావు, ఆయన కూతుళ్లు అనల, పవన, జర్నలిస్టు క్రాంతి ఇళ్ల మీద, ఢిల్లీలో గౌతమ్ నవ్లాఖా, సుధా భరద్వాజ్ ఇళ్ల మీద, ముంబయిలో అరుణ్ ఫరేరా, సుసాన్ అబ్రహాం - వెర్నన్ గోన్సాల్వెస్ ఇళ్ల మీద, రాంచీలో ఫాదర్ స్టాన్ స్వామి ఇంటి మీద, గోవాలో ఆనంద్ తేల్‌తుంబ్డే ఇంటి మీద ఈ దాడులు జరిగి ఒక్కొక్కరి ఇంట్లో కొన్ని గంటల పాటు సోదాలు జరిగాయి. ఆనంద్ తేల్‌తుంబ్డే సమయానికి ఇంట్లో లేకపోతే, కాపలాదారు నుంచి తాళం చెవి తీసుకుని పోలీసులు ఇంట్లో చొరబడ్డారు. దాడి చేసిన అన్ని ఇళ్లలోను కాగితాలు, పుస్తకాలు చెల్లాచెదురు చేశారు. కంప్యూటర్ల హార్డ్ డిస్కులు, లాప్‌టాప్‌లు, పెన్‌డ్రైవ్‌లు ఎత్తుకుపోయారు. వీరిలో ఐదుగురిని అప్పటికప్పుడే అరెస్టు చేయగా, ఇద్దరి అరెస్టును న్యాయస్థానాలు తాత్కాలికంగా వాయిదా వేశాయి. తెలంగాణలోనైతే రాష్ట్ర పోలీసులు ఈ దాడుల్లో క్రియాశీల పాత్ర నిర్వహించారు.

ఈ దాడులు అరెస్టులు అన్నిటికీ మూలకారణం హాస్యాస్పదమైనది. పాలకుల వంచనా స్వభావానికీ దమననీతికీ నిదర్శనమైనది. హిందూ బ్రాహ్మణ పీష్వా ప్రభువులకూ ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాలకూ జరిగిన యుద్ధంలో, పీష్వాలను ఓడించి, మరణించిన మహర్ల స్మృతి సూచకంగా, ఆ రోజుకు 200 సంవత్సరాలు నిండిన సందర్భంగా మహారాష్ట్రలోని దళిత, బహుజ, ప్రగతిశీల శిబిరాలు 2018 జనవరిలో కోరేగావ్ యాత్ర తలపెట్టాయి. ఆ యాత్ర ప్రారంభంగా 2017 డిసెంబర్ 31న పుణెలో ఎల్గార్ పరిషద్ అనే బహిరంగ సభ జరిగింది. ఆ సభలో ఇద్దరు మాజీ న్యాయమూర్తులు పిబి సావంత్, బిజి కోల్సె, దళిత నాయకులు, విద్యార్థి నాయకులు ప్రసంగించారు. ఈ సభానిర్వహణలో మావోయిస్టు సానుభూతిపరులు, దళితులు ఉన్నారని, ఇది దళిత–మావోయిస్టు ఐక్యతకు చిహ్నమని, దీన్ని ఎలాగైనా ధ్వంసం చేయాలని సంఘ్ పరివార్ శక్తులు అప్పుడే కంకణం కట్టుకున్నాయి. ఆ మర్నాడు ప్రారంభమైన యాత్ర మీద దాడి చేసి బీభత్సం సృష్టించాయి, ముగ్గురు కార్యకర్తలను హత్య చేశాయి, రెండు శతాబ్దాల కిందటి గౌరవనీయ దళిత నాయకుడి సమాధిని ధ్వంసం చేశాయి. ఈ విధ్వంసానికంతా కారణమైన సంఘ్ పరివార్ నాయకుల మీద కేసు పెట్టమని, విచారణ జరపమని మహారాష్ట్ర దళిత ఉద్యమం డిమాండ్ చేస్తుండగా, మహారాష్ట్ర పోలీసులు ఎల్గార్ పరిషద్ సభ మీదనే మావోయిస్టుల అనుబంధ సభ అని కేసు మోపారు. జూన్ 6న నాగపూర్, ముంబయి, ఢిల్లీలలో దాడులు జరిపి ఆ కేసులో నిందితులుగా సురేంద్ర గాడ్లింగ్, షోమా సేన్, సుధీర్ ధావ్లే, మహేష్ రావత్, రోనా విల్సన్‌లను అరెస్టు చేశారు. వీరిలో ఏ ఒక్కరూ పుణె సభకు వెళ్లినవారు కూడ కాదు. వీరిలో రోనా విల్సన్ లాప్‌టాప్‌లో మావోయిస్టుల ఉత్తరాలు దొరికాయని, ఆ ఉత్తరాల్లో నరేంద్రమోడీ హత్యకు కుట్ర జరిపినట్టు ఆధారాలున్నాయని, ఆ కుట్రలో వరవరరావుకు సంబంధం ఉందని అప్పుడే ఆరోపించారు. ఆ ఉత్తరాల్లో ప్రకాశ్ అంబేద్కర్, జిగ్నేష్ మేవాని, ఆనంద్ తేల్‌తుంబ్డేలతో సహా మరెందరి పేర్లో ఉన్నాయని ప్రకటించారు. ఆ ఉత్తరాలు అబద్ధాలనీ, కూట సృష్టి అనీ, పడిపోతున్న తన ప్రతిష్ఠను సానుభూతి ద్వారా తిరిగి పెంచుకునేందుకు మోడీ చేస్తున్న ప్రయత్నమేననీ ఎందరో మేధావులు, న్యాయమూర్తులు, మాజీ పోలీసు అధికారులు, జర్నలిస్టులు అప్పుడే వివరమైన విశ్లేషణలు ప్రకటించారు. ఆ తర్వాత ఆ కేసు విచారణ క్రమంలో మరెందరి పేర్లతోనో ఉత్తరాలు సృష్టిస్తూ, ఫోర్జరీ ఉత్తరాల సృష్టిని హాస్యాస్పదమైన స్థాయికి చేర్చారు. ఇప్పుడు ఆ ఉత్తరాలనే వాడుకుని మళ్లీ ఒకసారి దేశవ్యాప్త దాడులు, అరెస్టులు సాగించారు.

ఈ దుర్మార్గం అమలవుతున్న పద్ధతి చూస్తే ఇది ఇక్కడే ఆగదనీ, ప్రతి భిన్న స్వరాన్నీ మూసివేయడానికి, ప్రజల తరఫున వినిపించే గొంతులన్నిటినీ వినబడకుండా చేయడానికి సంఘ్ పరివార్ ఒక పెద్ద కుట్ర పన్నుతున్నదనీ, ఆ క్రమంలోనే అర్బన్ నక్సల్ (పట్టణ నక్సల్) పేరుతో ఒక బూచి తయారు చేసి, భిన్నాభిప్రాయాలున్న వారందరినీ ఆ పేరుతో అణచివేయదలచుకున్నదనీ స్పష్టమవుతున్నది. ఇది సరిగ్గా 1930లలో జర్మనీలో హిట్లర్ అమలు చేసిన పద్ధతి. తానే తన పార్లమెంటు భవనాన్ని తగులబెట్టించుకుని అది కమ్యూనిస్టులు చేశారని అబద్ధ ప్రచారంతో కమ్యూనిస్టులందరినీ జైలుపాలు చేయడం, యూదులు, సోషలిస్టులు, కార్మిక నాయకులు మొదలైన తన అభిప్రాయాలతో విభేదించేవారందరినీ జైలు పాలు చేయడం, గ్యాస్ చాంబర్లలోకి పంపి చంపించడం హిట్లర్ చేసిన దురాగతాలు. అవే దురాగతాలు అభినవ హిట్లర్ అడాల్ఫ్ మోడీ రూపంలో భారతదేశంలో నాలుగు సంవత్సరాలుగా సాగుతూ ఇక్కడికి వచ్చాయి. ప్రజల్లో చైతన్యం కల్పించడం, ఈ ఫాసిస్టు శక్తులను ఓడించే ప్రజా సమీకరణ జరపడం, బలమైన ఐక్య ప్రతిఘటన నిర్మించడం ఒక్కటే ఇవాళ దేశం ముందున్న కర్తవ్యం. వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# శాసనసభ రద్దు ఎందుకు?

అసలు విషయాల మీద చర్చను పక్కకు తప్పించి, అనవసరమైన విషయాలవైపు దృష్టి మళ్లించే పాలకుల కుటిల నీతికి నిదర్శనంగా ఇవాళ తెలంగాణ మొత్తం ముందస్తు ఎన్నికలు వస్తాయా రావా అనే చర్చలో మునిగి ఉంది. శాసనసభను రద్దు చేయాలనీ, ముందస్తు ఎన్నికలకు వెళ్లాలనీ ఒక ఆలోచన ఉందని ఒక పక్కనా, లేదని మరొక పక్కనా వార్తలు విడుదల చేస్తున్న తెలంగాణాధీశులు వాస్తవంగా ఎన్నికలు ఎప్పుడు వచ్చినా తమకు అధికారం మళ్లీ వస్తుందా అనే భయంలో, ఒకరకమైన డోలాయమాన స్థితిలో ఉన్నారు. ఉద్యమపు గాలిలోనే ప్రభుత్వం స్థాపించే ఆధిక్యత కన్న రెండు స్థానాలు మాత్రమే ఎక్కువ వచ్చినప్పుడు, ఇప్పుడు ప్రజల్లో, విభిన్న వర్గాల్లో తీవ్రమైన అసంతృప్తి నెలకొని ఉన్నవేళ ఆ మాత్రం విజయమైనా వరిస్తుందా అని అనుమానం ఉంది. ప్రతిపక్షాలలో ఏ ఒక్కదానికీ ఆ అసంతృప్తిని వోట్లుగా మలచుకోగల శక్తిలేదనే ఎరుక కలిగిస్తున్న ధైర్యమూ ఉంది. అన్ని పార్టీల నుంచీ ఆకర్షించి చేర్చుకున్న ఆయారాం గయారాంల వల్ల ప్రతి స్థానానికీ తెరాస అభ్యర్థులే ఐదారుగురు ఉండి, టికెట్ దక్కనివాళ్లు కార్యాలయాలు తగులబెట్టి, తిరుగుబాటు అభ్యర్థులుగా పోటీ చేసి విజయావకాశాలను దెబ్బ తీస్తారేమో అనే భయమూ ఉంది. తిరుగుబాటు జెండా ఎగరేసిన ప్రతివాడికీ ఒక తాయిలం చూపించి నోరు మూయించగలనన్న ధీమా ఉంది. ఎన్నికల ప్రణాళికలో ప్రధానమైన వాగ్దానాలేవీ నెరవేర్చకుండా వంచన చేసినందువల్ల ప్రజలు ప్రతికూల తీర్పు ఇస్తారేమో అనే అనుమానమూ ఉంది. సంక్షేమ పథకాల పేరుతో వేల కోట్ల రూపాయలు గుమ్మరించి ప్రజలందరినీ, వోటర్లందరినీ తన ఆకర్షణలోకి తెచ్చుకున్నాననే నమ్మకమూ ఉంది. ఎంతమంది అభిప్రాయ నిర్మాతలను తన బుట్ట కింద కమ్మినప్పటికీ ఇంకా తన పాలన గురించి వినిపిస్తున్న భిన్నస్వరాలు ఏమైనా ప్రభావితం చేస్తాయేమోననే అనుమానమూ ఉంది. పొరుగు రాష్ట్ర కుట్రలు, అభివృద్ధి నిరోధకులు, నీళ్లు వంటి సెంటిమెంట్లతో గట్టెక్కగలనని విశ్వాసమూ ఉంది. అందువల్లనే ఒకవైపు ఎప్పుడు ఎన్నికలు వచ్చినా వంద స్థానాలు, నూట పది స్థానాలు గెలుస్తామని మేకపోతు గాంభీర్యం ప్రదర్శిస్తున్నారు. మరొకవైపు, ఆ ధైర్యమే ఉంటే కనీస ప్రచారం సరిపోతుందనే సాధారణ తర్కాన్ని పక్కనపెట్టి, యాభైరోజుల్లో వంద స్థానాలలో సభలు ఏర్పాటు చేసి తానే ప్రసంగిస్తాననే భారీ వాగ్దానాలు ప్రకటిస్తున్నారు. ఎన్నికలు ఎప్పుడు జరపాలో నిర్ణయం తీసుకునే అధికారం ఎన్నికల సంఘానిది గనుక తీరా శాసనసభ రద్దు చేసిన ఎన్నికలు వెంటనే జరపబోమని అంటారేమో, అప్పుడు అధికారం నామమాత్రమై పోయి, ఓటమి అనుమానాలే నిజమైతే ఎట్లా అనే రంధితోనే ప్రధానమంత్రి దగ్గర ప్రాధేయపడుతున్నారు. అధినాయకుడి మనఃస్థితి ఏమైనా కావచ్చు గాని, అడగవలసిన ప్రశ్న అసలు శాసనసభ రద్దు చేయవలసిన అవసరమేమిటి అని. ఐదు సంవత్సరాల కొరకు ప్రజలు ఇచ్చిన అధికారం, ఇరవై మూడు మంది ఇతర పార్టీల తరఫున గెలిచినవారిని కొని తన దొడ్లో కట్టేసుకుని సాధించిన తిరుగులేని అధికారం వదులుకోవడం ఎందుకు అనేది ప్రశ్న. పద్ధతి ప్రకారం ఎన్నికలు ఎండాకాలంలో రావాలి. ఎండాకాలం ఎన్నికలు అధికారపక్షానికి అంత ఉపయోగకరమైనవి కావు, అప్పటిదాకా ఆగితే అసంతృప్తి మరింత సంఘటితం కావచ్చు అనే సొంత భయాలే తప్ప శాసనసభ రద్దుకు దారితీసే ప్రజాప్రయోజనకర కారణాలేమీ లేవు.

వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# పెచ్చరిల్లుతున్న అగ్రకుల దురహంకారం

మోడీ పాలనలో హిందూ బ్రాహ్మణీయ ఫాసిస్టు శక్తులకు తమను ఎవరూ ఏమీ చేయలేరనీ, ప్రభుత్వం తమకు వత్తాసుగా ఉంటుందనీ దురహంకారంతో ఎటువంటి దూకుడు వచ్చిందో, చంద్రబాబు పాలనలో ఆంధ్రప్రదేశ్ లో కూడ అగ్రవర్ణ పెత్తందారీ వర్గాలకు దళితుల మీద ఎటువంటి అత్యాచారాలు జరిపినా తమను ఎవరూ ఏమీ చేయలేరని, ప్రభుత్వం తమ పక్షమే వహిస్తుందనీ అటువంటి దూకుడే వచ్చింది. గత ఆరు దశాబ్దాల ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ తో పోలిస్తే, ఈ నాలుగు సంవత్సరాల విభక్త ఆంధ్రప్రదేశ్ లో దళితుల మీద దాడుల సంఖ్యా తీవ్రతా విపరీతంగా పెరిగిపోయాయి. ప్రకాశం జిల్లా దేవరాపల్లి, గవినివారిపాలెం, గుంటూరు జిల్లా పెదగొట్టిపాడు, గుడిపాడు, యడవల్లి, విశాఖపట్నం జిల్లా జెర్రిపోతుల పాలెం, పశ్చిమ గోదావరి జిల్లా కుంచనపల్లి, గరగపర్రు, తూర్పు గోదావరి జిల్లా పాత తుంగపాడు, నెల్లూరు జిల్లా దగదర్తి, చెన్నూరు – ఇలా దళితుల మీద అత్యాచారాల, దుర్మార్గాల, పీడనల జాబితా అనంతంగా సాగుతున్నది. చెప్పుకోదగిన ఘటనలే డజన్ల కొద్దీ ఉన్నాయంటే బైటపడని, ఎక్కడికక్కడ గ్రామాల్లోనే మూసిపెట్టబడిన ఘటనలు ఎన్ని ఉన్నాయో లెక్కలేదు. తాజాగా నెల్లూరు జిల్లా రాపూరులో మాల, మాదిగ పల్లెల మీద భయానకమైన పోలీసు దాడి జరిగింది. ఆ ఘటన స్థానికుల మధ్య చిన్న పొరపొచ్చంగా, అంతగా కుల స్వభావం లేని ఘర్షణగా చిత్రిస్తూ అధికారవర్గాలు పోలీసు దాడిపై మసిపూసి మారేడుకాయ చేస్తున్నాయి. ఈ నాలుగు సంవత్సరాల చరిత్రలోనూ కొట్టవచ్చినట్టు కనబడుతున్న స్థితి ఏమంటే హత్య నుంచి అత్యాచారం నుంచి భూమి గుంజుకోవడం నుంచి తిట్లూ దుర్భాషలతో అవమానించడం దాకా దళితుల మీద అత్యాచారాలు చిన్నవైనా పెద్దవైనా ప్రభుత్వ యంత్రాంగం బాధితుల వైపు, చట్టం వైపు, న్యాయం వైపు నిలబడకుండా, అగ్రవర్ణాల వైపు, దాడిచేసిన వారివైపు, కుల, ధన, రాజకీయ అధికారం ఉన్నవారివైపు నిలబడుతున్నది. గతంలో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ లో తెలుగుదేశం పాలన కూడ పాదిరికుప్పంలో దళితుల మీద దాడితో మొదలై కారంచేడు హత్యాకాండ తో ఒక మలుపు తీసుకుంది. ఆ తెలుగుదేశం వారసత్వాన్ని చంద్రబాబు నాయుడు ప్రభుత్వం అక్షరాలా పాటిస్తున్నది, కొనసాగిస్తున్నది. స్వయంగా ముఖ్యమంత్రే దళితులకు, ఇతర పీడిత కులాలకు వ్యతిరేకంగా ఎస్సీ ఎస్టీ అత్యాచారాల నిరోధ చట్టం కింద నేరాలుగా నిర్వచించినటువంటి వ్యాఖ్యలు చేశారు. నాలుగు సంవత్సరాలుగా రాష్ట్రంలో జరిగిన ఏ ఒక్క అత్యాచారం మీద చర్య తీసుకునేలా యంత్రాంగాన్ని ఆదేశించలేదు. అందువల్ల దళితులను చిన్నచూపు చూసేవారికి, వివక్ష ప్రదర్శించేవారికి, అత్యాచారాలు చేసేవారికి స్వయంగా ప్రభుత్వమే ఆమోదముద్ర వేసిన అభిప్రాయం కలిగింది. ఈ నాలుగు సంవత్సరాలలో మూడు సంవత్సరాల పాటు చంద్రబాబు నాయుడు ప్రభుత్వం భారతీయ జనతా పార్టీ నాయకత్వంలోని ఎన్‌డిఎ లో భాగస్వామిగా ఉంది గనుక సంఘ పరివార భావజాల వ్యాప్తిలో ఆ మేరకు భాగం పంచుకున్నట్టే. దళితుల మీద అత్యాచారాలకు మరో కారణమైన సామ్రాజ్యవాద, కార్పొరేట్ భూదాహం కూడ దళితుల భూముల మీద, దళితుల మీద దాడికి మరొక కారణమవుతున్నది. ఈ విశాల ఆవరణ గురించి దళితులలో, ఇతర ప్రజారాశులలో చైతన్యం కలిగించి దళితులపై అత్యాచారాలకు వ్యతిరేకంగా సంఘటిత ఉద్యమాన్ని నిర్మించడం ఇవాళ ప్రగతిశీలవాదుల కర్తవ్యం. వీ

# వెనిజులా ఎన్నికల ప్రహసనం

- అర్విణి రాజేంద్రబాబు

మే నెలలో జరిగిన వెనిజులా ఎన్నికల్లో రాబోయే ఆరు సంవత్సరాల కాలానికి అధ్యక్షునిగా నికోలాస్ మదూరో తిరిగి ఎన్నికయ్యాడు. వెనిజులా దేశం పేరు చెబితే ప్రపంచ రాజకీయాల పట్ల ఆసక్తి ఉన్నవారికి వెంటనే గుర్తుకువచ్చే పేరు హ్యూగో ఛావేజ్. గొప్ప ప్రజాభిమానం కలిగి 15 సంవత్సరాలు వెనిజులా అధ్యక్షునిగా కొనసాగిన ఛావేజ్ 2013లో క్యాన్సర్ వ్యాధితో మరణించాడు. ఛావేజ్ వారసునిగా 2013లోనే అధ్యక్షునిగా ఎన్నికయిన మదూరో, తన ప్రత్యర్థులను నానా ఇక్కట్లపాలు చేశాడు. దేశం ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి సరైన మార్గం చూపడంలో విఫలమయ్యాడు. లాటిన్ అమెరికా దేశాలలో ఒకటైన వెనిజులాలో పేదరికం తాండవిస్తున్నది. భారీగా ఉన్న విదేశీ అప్పు, ప్రభుత్వంలో పెచ్చరిల్లిన అవినీతి, పొట్ట చేతపట్టుకొని విదేశాలకు లక్షల సంఖ్యలో ప్రతి ఏటా ప్రజలు వలసపోతున్నారు.

సమస్యల వలయంలో కొట్టుమిట్టాడుతున్న వెనిజులాలో ఎన్నికలు గందరగోళ పరిస్థితుల మధ్య నిర్వహించబడ్డాయి. ప్రధాన ప్రతిపక్షాలు ఎన్నికల బహిష్కరణకు పిలుపునిచ్చాయి. ఎన్నికలలో అక్రమాలు జరిగాయనీ, భారీ ఎత్తున రిగ్గింగ్ జరిగిందనీ, డబ్బులతో ఓటర్లను కొన్నారనీ ఆరోపణలు వెల్లువెత్తాయి. దేశంలో ఆహార పదార్థాల కొరత తీవ్రంగా ఉండి, చాలా మంది ప్రజలు పోలింగ్ బూత్‌ల వైపు కన్నెత్తి కూడా చూడలేదు. రిజిస్టర్ అయిన ఓటర్లలో 46.1 శాతం మంది ఓటింగ్‌లో పాల్గొన్నారని, అందులో 67.7 శాతం అంటే 5.8 మిలియన్ ఓట్లు మదూరోకు వచ్చాయని, ఆయన సమీప ప్రత్యర్థి ఫాల్కన్‌కు 21.2 శాతం అంటే 1.8 మిలియన్ ఓట్లు పోలయ్యాయని వెనిజులా జాతీయ ఎలక్టోరల్ కౌన్సిల్ ప్రకటించింది. అయితే, ప్రతిపక్షాలు ఈ అంకెలతో విభేదించాయి. 30 శాతం ఓటర్ల కంటే ఎక్కువ ఓటింగ్‌లో పాల్గొనలేదని వాదించాయి.

14 లాటిన్ అమెరికా, కెనడా దేశాలు వెనిజులా ఎన్నికలను, అధ్యక్షునిగా మదూరోను గుర్తించ నిరాకరించాయి. అమెరికా ప్రభుత్వం మదూరోపై కారాలు మిరియాలు నూరుతోంది. ఆ దేశాన్ని ఆర్థికంగా ఇబ్బందుల పాలు చేసేందుకు ట్రంప్ పలు చర్యలు చేపట్టాడు. అయితే, తన ఎన్నిక అమెరికా సామ్రాజ్యవాదానికి చెంపపెట్టు లాంటిదని తిరిగి ఎన్నికైన మదూరో వ్యాఖ్యానించాడు. 'విప్లవం విజయం సాధించిందని' ప్రకటించాడు. వెనిజులాకు కావల్సింది వ్యవస్థను సమూలంగా మార్చే విప్లవ రాజకీయాలు కాని అవినీతి కంపులో కూరుకు పోయిన కుహానా ఎన్నికలతో వచ్చే అధికారం కాదు. పెట్రోల్ నిల్వలు కలిగిన వెనిజులా దేశం ఆర్థికంగా బలపడే అవకాశాలు చాలా ఉన్నాయి. కావల్సినది ప్రజా సంక్షేమమే లక్ష్యంగా, దార్శనికత కలిగిన నాయకత్వమే! వీ





❖ **నీళ్లలోని చేప –** కవిత్వం – బాలసుధాకర్ మౌళి – చంపావతి ప్రచురణలు – 188 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు: బాలసుధాకర్ మౌళి, ఎస్‌బిఐ దగ్గర, బోయ వీధి, నెల్లిమర్ల, విజయనగరం జిల్లా – 535217; సెల్: 9676493680, 9505646046



❖ **గోవు పవిత్రత –** ఓ కట్టు కథ – డి.ఎన్. ఝా – ప్రజాశక్తి బుక్‌హౌస్ – 206 పేజీలు, 1/8 డెమీ, రు. 150



❖ **మార్కెట్ విషవలయంలో మన గ్రామసీమలు –** వర్గ, సామాజిక విశ్లేషణ – సుందరయ్య విజ్ఞాన కేంద్రం, ఎ.పి. రైతు సంఘం, ఎ.పి. వ్యవసాయ కార్మిక సంఘం– కూర్పు: శోధన – ప్రజాశక్తి బుక్‌హౌస్ – 383 పేజీలు, 1/8 డెమీ, రు. 250



❖ **మహోన్నతుడు మార్క్స్ –** కె. ఆనందాచారి – ప్రజాశక్తి బుక్‌హౌస్ – 56 పేజీలు, 1/8 డెమీ, రు. 40



❖ **పాటూరు రామయ్య –** ఉద్యమం-జీవితం – ప్రజాశక్తి బుక్‌హౌస్ – 208 పేజీలు, 1/8 డెమీ, రు. 150



❖ **ఆధునిక ప్రపంచ చరిత్ర విప్లవ యుగం (1789-1848) –** ఎరిక్ హాబ్స్‌బామ్ – అనువాదం: కె. కేశవరెడ్డి, ప్రజాశక్తి బుక్‌హౌస్ – 280 పేజీలు, 1/8 డెమీ, రు. 200



❖ **విముక్తికి బాటలు వేసిన విప్లవం –** కూర్పు: కె. ఉషారాణి – ప్రజాశక్తి బుక్‌హౌస్ – 104 పేజీలు, 1/8 డెమీ, రు. 75



❖ **రెడ్ అక్టోబర్ –** తెలుగు సేత: కె. –ఎస్. ధనంజయరావు ప్రజాశక్తి బుక్‌హౌస్ – 224 పేజీలు, 1/8 డెమీ, రు. 150

పై ఏడు పుస్తక ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, 27-1-64, కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ – 520002; ఫోన్: 0866-2577533



❖ **తెలుగునాట దళిత రాజకీయాలు –** గుండిమెడ సాంబయ్య, తెలుగు: ఆశాలత – హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ – 188 పేజీలు, 1/8 డెమీ, రు. 150



❖ **కలల రైలు –** కాల్సన్ వైట్‌హెడ్, తెలుగు: శాంతసుందరి – హైదరాబాద్ బుక్‌ట్రస్ట్- 290 పేజీలు, 1/8 డెమీ, రు. 250

పై రెండు పుస్తక ప్రతులకు: హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, ప్లాట్ నెం. 85, బాలాజీ నగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500 006. ఫోన్: 23521849; www.hyderabadbooktrust.blogspot.com



❖ **గంగాళం –** కవిత – పప్పుల రాజిరెడ్డి – మంజీర రచయితల సంఘం–58 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు: పప్పుల రాజిరెడ్డి, ఇ.నెం. 4-129/2, రాఘవేంద్రనగర్, స్ట్రీట్ నెం. 5, సిద్దిపేట–502 103; సెల్: 9652215043



❖ **సమకాలీన కన్నడ దళిత కథలు –** రంగనాథ రామచంద్రరావు – నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 140 పేజీలు, 1/8 డెమీ, రు. 100



❖ **పరిమళా సోమేశ్వర్ కథలు –** నవచేతన పబ్లిషింగ్ హౌస్ – 460 పేజీలు, 1/8 డెమీ, రు. 280

పై రెండు పుస్తక ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జిఎస్ఐ పోస్ట్, బండ్లగూడ (నాగోల్), హైదరాబాద్–68; ఫోన్: 24224453 / 54 ఈమెయిల్:navachethanaph@gmail.com



❖ **అక్రమ సంతానం –** శరణకుమార్ లింబాళె, తెలుగు: రంగనాథ రామచంద్రారావు – జనసాహితి ప్రచురణలు – 128 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: బి. అరుణ, జనసాహితి, 30-7-6, అనపర్తివారి వీధి, అన్నదాన సమాజం రోడ్, దుర్గాగ్రహారం, విజయవాడ– 520 002; సెల్: 9440705955



❖ **భారత విప్లవ నాయకులలో ఒకరు, కామ్రేడ్ అరవింద్‌కు అరుణారుణ జోహార్లు! –** దిక్సూచి ప్రచురణలు – 20 పేజీలు, 1/8 డెమీ, ప్రతులకు: దిక్సూచి ప్రచురణలు, జింకిభద్ర, శ్రీకాకుళం



❖ **సృష్టిలో తీయనిది –** డా. అమృతలత – 104 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: డా. అమృతలత, విజయ హైస్కూల్, ముబారక్‌నగర్, నిజామాబాద్ – 503 003, తెలంగాణ. ఫోన్: 08462-237887, సెల్: 9848868068

# కేరళను ముంచెత్తిన వరద

*కేరళ వరద బీభత్సం ప్రస్తుతం కొనసాగుతున్న అభివృద్ధి నమూనా ఫలితమేనని, ఇప్పటికైనా ఈ హెచ్చరికను గ్రహించాలని అంటున్నారు* **అరుంధతీ రాయ్**

మనం ఎల్లప్పుడూ ఎదురుచూసే వర్షాకాలం, మనం ప్రేమిస్తున్నట్టు నటించే నదులు ఈ సంవత్సరం కేరళలో మనతో ఎదురు మాట్లాడు తున్నాయి. నిజమే, నావరకు నాకు, వర్షమంటే నా కలంలో సిరా. నది అంటే, అందులోనూ మీనాచిల్ అంటే, అది నా కథకు చోదకశక్తి. అవే నన్ను రచయితగా తీర్చిదిద్దాయి. ఇవాళ వాటి ఉగ్రస్వరూపం ఊహాతీతంగా ఉంది. విధ్వంసపు స్థాయి, ప్రజల ఇక్కట్ల స్థాయి వివరాలు ఇంకా బైటపడుతూనే ఉన్నాయి.

సైన్యం, నౌకాదళం, వివిధ ప్రభుత్వ సంస్థలు, స్థానిక సమాజాలు, మత్స్యకారుల అసాధారన సమూహం, జర్నలిస్టులు, వేలాది మంది సాధారణ ప్రజలు ఇతరులను రక్షించడానికి తమ ప్రాణాలను కూల ప్రమాదంలో పెట్టుకుని ఆదర్శప్రాయమైన సాహసాన్నీ, సౌభ్రాతృత్వాన్నీ ప్రదర్శించారు. సహాయమూ ఆర్థిక సహాయమూ వెల్లువెత్తుతున్నాయి. ఇంకా ఎక్కువ సహాయమూ, ఇంకా ఎక్కువ నిధులూ అవసరం ఉన్నాయి.

అయితే, ఈ నీరు వెనక్కి తీసినకొద్దీ ప్లాస్టిక్, చెత్త మహాసముద్రాలు బైటపడి మనం ఒక కటిక వాస్తవాన్ని ఎదుర్కోవలసి వస్తుంది. ఈ ఉత్పాతాన్ని కేవలం ఒక ప్రకృతి బీభత్సంగా మాత్రమే పరిగణించి, అందులో మనుషుల పాత్ర ఏమీ లేనట్టు భావించడం నిజాయితీలేనితనమే అవుతుంది.

భూగోళ ఉష్ణోగ్రతల పెరుగుదల, వాతావరణ మార్పుల యుగంలో మొట్టమొదట మూల్యం చెల్లించవలసినవి కొండలూ, సముద్రతీర ప్రాంతాలూ అని మనకిప్పటికే తెలుసు. ఇకముందు వాతావరణ ఉత్పాతాల తీవ్రత, అవి సంభవించే సమయాలూ పెరుగుతాయే గాని తగ్గవు. కాలిఫోర్నియా కార్చిచ్చులతో మండిపోతున్నది. కేరళ నీటిలో మునిగిపోతున్నది.

మన ప్రియతమ మాతృభూమి కేరళ ఇటు కొండలకూ అటు సముద్రానికీ మధ్య ఇరికిన చిన్న భూభాగం. మనకంటె ప్రమాదం అంచుల్లో ఉండేవారు మరెవరూ ఉండరు.

మితిమీరిన దురాశతో, గనుల కోసమూ, అక్రమ విహారకేంద్రాల, సంపన్నుల గృహాల అభివృద్ధి కోసమూ అటవీ భూములలో చెట్లను దిగ్భ్రాంతికరమైన స్థాయిలో కొట్టివేయడం, చట్టవ్యతిరేక నిర్మాణాలు సహజ ప్రవాహాల మార్గాలను అడ్డుకున్నాయి. సహజ నీటి నిలువ వ్యవస్థలను ధ్వంసం చేసివేశాయి.

కొట్టవచ్చినట్టుగా ఆనకట్టల నిర్వహణలలో అక్రమాలు జరిగాయి. ఇవన్నీ కలిసి ఇవాళ జరుగుతున్న పరిణామాలలో ప్రధాన పాత్ర వహించాయి.

ఇటువంటి వరద వస్తుందని కేంద్ర జల సంఘం ఎందుకు ఊహించలేక పోయింది? వరదలను అడ్డుకోవడానికని నిర్మించిన ఆనకట్టలు సంక్షోభ సమయంలో రిజర్వాయర్ల నుంచి పెద్ద ఎత్తున నీటిని ఎలా విడుదల చేసి, విధ్వంసాన్ని అనేకరెట్లు ఎలా పెంచాయి?

ఇవాళ ముఖ్యమంత్రి విపత్తు సహాయ నిధికి పెద్ద ఎత్తున నిధులు అందుతున్నాయి. వాటిలో చాల భాగం సాధారణ ప్రజానీకం తమ కష్టఫలితం నుంచి అందిస్తున్నవి. అతి ఎక్కువగా సహాయం అవసరమైన సుదూర ప్రాంతాల ప్రజలకు సహాయా, పునరావాస కార్యక్రమాలను సమన్వయం చేసే సామర్థ్యం ప్రభుత్వానికి మాత్రమే ఉంటుందనే సరైన విశ్వాసంతోనే వారు తమ సహాయాన్ని ప్రభుత్వానికి పంపుతున్నారు. అయితే, మొట్టమొదట గతంలో అనేక హెచ్చరికలను ఖాతరు చేయని యంత్రాంగమే ఈ నిధుల మీద అజమాయిషీ వహిస్తున్నాయనే విషయం మాలో కొందరికి ఆందోళన కలిగిస్తున్నది.

ఉదాహరణకు, అవినీతిపరులైన రాజకీయ నాయకులు, దురాశాపరులైన వ్యాపారవేత్తలు, పారిశ్రామికవేత్తలు పురికొల్పుతున్న అధుపులేని అభివృద్ధి కార్యక్రమాన్ని అడ్డుకోవడానికి ప్రభుత్వం తీవ్రమైన చర్యలు తీసుకోకపోతే ఇటువంటి పరిణామాలు సంభవిస్తాయని మాధవ్ గాడ్గిల్ కమిటీ నివేదిక హెచ్చరించింది.

ఇటువంటి ఉత్పాతాలు మనుషులలోని మంచినీ చెడునూ కూడ వెలికి తెస్తాయి. దాని వల్ల మనుషులు ఏకం కావచ్చు. లేదా ఘర్షణలు పెరగవచ్చు. ఇటువంటి విపత్తు ఏర్పడడానికి కొంతవరకు బాధ్యులైన వాళ్లకే ప్రతిఫలం దక్కవచ్చు.

సునామి, న్యూ ఆర్లియన్స్‌లో కత్రినా తుపాను వంటి సందర్భాలలో, అత్యంత బలహీనులైన ప్రజల భూములనూ ఇళ్లనూ ఆక్రమించడానికి నిర్దాక్షిణ్యమైన వ్యాపారవేత్తలు ఎలా ముందుకు వచ్చారో మనం చూశాం. ఇక్కడ, విచారకరంగా భారతదేశంలో కూడ ప్రేమా సానుభూతీ మాత్రమే కనబడవలసిన సమయంలో సమూహాల మధ్య విషాన్నీ, విద్వేషాన్నీ వ్యాపింపజేయడానికి అనేక శక్తులు ఎలా ఎంత పెద్ద ఎత్తున పని చేస్తున్నాయో మనం చూస్తూనే ఉన్నాం.

అదృష్టవశాత్తూ, కేరళ ప్రజలు ఇటువంటి విషప్రచారాలకు ఎన్నడూ లొంగిపోలేదు. ఇప్పుడు విచారమూ కష్టమూ నిండిన ఈ సమయంలో కూడ లొంగిపోక పోవచ్చు.

రానున్న రోజుల్లో, వారాల్లో ప్రజలు విధ్వంసమైపోయిన తమ జీవితాలను పునర్నిర్మించుకోవడానికి ప్రయత్నిస్తుండగా, కేరళ ప్రభుత్వం అత్యంత నిరాదృత సమూహాల, ప్రత్యేకంగా దళితుల, అడవుల్లో నివసించే

ఆదివాసుల, పట్ల ప్రత్యేకశ్రద్ధ కనబరుస్తుందని ఆశిస్తున్నాం, నమ్ముతున్నాం. ఈ వర్గాల ప్రజలకు సహాయ పునరావాస సౌకర్యాల వరుసలో తమకు తాము ముందుకు తోసుకుని రాగల శక్తిగానీ, సాధనాలు గానీ లేవు.

గతాన్ని గురించి వగచినంతమాత్రాన సరిపోదు. పునర్నిర్మాణం, పునరావాసం అంటే పాత పద్ధతిలో యథాతథంగా జీవించడానికి తరలిపోవడమని కాదు. మనమే సృష్టించిన పర్యావరణ అసమతుల్యతను సరిదిద్దడానికి తగిన చర్యలు తీసుకోవలసి ఉంటుంది. ఆ పని చేయకపోతే దైవభూమిగా చెప్పుకునే ఈ నేల మానవ ఆవాసానికి యోగ్యం కాకుండా పోతుంది. ఎంత తీవ్రమైన ఆగ్రహం ప్రదర్శించినా 2018 వరదలు మనకు ఈ సుతిమెత్తని హెచ్చరికను ఇస్తున్నాయి.

*(ప్రముఖ మలయాళ పత్రికా సంస్థ మలయాళ మనోరమకు చెందిన మనోరమ ఆన్‌లైన్ ఇంగ్లిష్‌కు రాసిన కాలమ్)* వీ

# కేరళ వరదలు పాక్షికంగా మానవ కల్పితమే

**- మాధవ్ గాడ్గిల్**

దశాబ్దాలుగా కనీవినీ ఎరగని స్థాయిలో వరదలు కేరళను ముంచెత్తాయి. మూడు వందల మందికి పైగా మరణించారు, లక్షలాది మంది నిరాశ్రయులయ్యారు. ఒకపక్క సహాయ పునరావాస చర్యలు సాగుతుండగా, ఈ ఉత్పాతానికి రాష్ట్ర ప్రభుత్వం, స్థానిక అధికారులు పాక్షికంగా బాధ్యత వహించవలసి ఉంటుందని గతంలో పశ్చిమ కనుమల పరిరక్షణ గురించి శాస్త్రీయ అధ్యయనం చేసి నివేదిక సమర్పించిన ఒక శాస్త్రవేత్త అన్నారు.

కేంద్ర పర్యావరణ, అటవీ మంత్రిత్వ శాఖ 2010లో ఏర్పాటు చేసిన పశ్చిమ కనుమల పర్యావరణ అధ్యయన బృందానికి నేతృత్వం వహించిన మాధవ్ గాడ్గిల్ పర్యావరణ చట్టాలను సక్రమంగా పాటించి ఉంటే ఈ ఉత్పాతం ఇంత పెద్ద స్థాయిలో జరిగి ఉండేది కాదని అన్నారు. ఈ సమస్యలో కనీసం ఒక భాగమైనా మానవ కల్పితమేనని ఆయన అన్నారు.

నిజమే. అతి తీవ్రమైన వర్షపాతం వల్లనే ఈ ఉత్పాతం సంభవించింది. కాని రాష్ట్రంలో గత కొన్ని సంవత్సరాలుగా జరిగిన అభివృద్ధి ఇటువంటి ఉత్పాతాలతో వ్యవహరించగల శక్తి సామర్థ్యాలను హరించింది. తద్వారా ప్రజల ఇక్కట్ల స్థాయి పెచ్చు మీరడానికి కారణమయిందని అని ఆయన అన్నారు.

గాడ్గిల్ బృందం 2011లో సమర్పించిన నివేదికలో అప్పటికే పర్యావరణ పరంగా సున్నితంగా ఉన్న పశ్చిమ కనుమలలో తీసుకోవలసిన చర్యలను సిఫారసు చేశారు. పశ్చిమ కనుమలను సున్నితమైన పర్యావరణ ప్రాంతంగా ప్రకటించాలని ఆ నివేదిక సూచించింది. కనుమల లోపల వాటి సున్నితత్వ స్థాయిని బట్టి మూడు రకాల ప్రాంతాలున్నాయని నివేదిక నిర్ధారించింది.

ఈ ప్రాంతంలో పారిశ్రామిక కార్యకలాపాలను, గనుల తవ్వకాన్ని నిషేధించాలని, స్థానిక సముదాయాలతో సంప్రదించి అభివృద్ధి కార్యక్రమాల మీద నియంత్రణ అమలు జరపాలని కూడ నివేదిక సూచించింది.

పశ్చిమ కనుమల్లో భాగమైన ఆరు రాష్ట్రాల ప్రభుత్వాలు కూడ ఆ నివేదికను వ్యతిరేకించాయి. అందువల్ల గాడ్గిల్ కమిటీ నివేదికను పరిశీలించడానికి పర్యావరణ మంత్రిత్వ శాఖ కె. కస్తూరిరంగన్ నేతృత్వంలో మరొక బృందాన్ని నియమించింది. కొత్త బృందం గాడ్గిల్ నివేదిక సిఫారసులన్నిటినీ సడలిస్తూ, సరళీకరిస్తూ 2013లో మరొక నివేదిక తయారు చేసింది. మొత్తం పశ్చిమ కనుమల్లో మూడో వంతు భాగం మాత్రమే పర్యావరణ పరంగా సున్నితమైనదని కొత్త నివేదిక చెప్పింది.

గత సంవత్సరమే పశ్చిమ కనుమల్లోని కేవలం 57,000 చకిమీ భూభాగాన్ని మాత్రమే సున్నితమైన ప్రాంతంగా పర్యావరణ మంత్రిత్వశాఖ ప్రకటించింది. తత్ఫలితంగా ఆ ప్రాంతంలో మాత్రమే గనుల తవ్వకాల మీద, భారీ నిర్మాణాల మీద, థర్మల్ విద్యుత్ పథకాల మీద, విపరీతంగా కాలుష్యం వదిలే పరిశ్రమల మీద నిషేధం అమలులోకి వచ్చింది.

నిమా నివేదికను అంగీకరించలేదా, మా సిఫారసులను విస్మరించారా అనేది సమస్య కాదు. ప్రభుత్వం గనుక కనీసం చట్టాన్ని పాటించి ఉంటే, చట్టబద్ధ పాలన అమలయి ఉంటే, ఇంత పెద్ద స్థాయి ఉత్పాతాన్ని నిరోధించడం సాధ్యమై ఉండేది అన్నారు గాడ్గిల్. రాష్ట్ర ప్రభుత్వాలు స్వార్థప్రయోజన శక్తులతో కుమ్మక్కయి పర్యావరణ చట్టాలను ప్రతిఘటిస్తున్నాయని ఆయన అన్నారు. సుపరిపాలన ఉండాలని కోరుకునే చట్టాన్ని పాటించే సమాజమేదైనా తమ నివేదికను ఆమోదించి ఉండేదని ఆయన అన్నారు.

కేరళలో విపరీతంగా పెరిగిపోతున్న రాతి గనుల కార్యకలాపాలను ఆయన ఉదాహరణగా చూపారు. ని2013లో, మా నివేదిక సమర్పించిన తర్వాత, రాతి గనులకు, కొండలు తవ్వడానికి వ్యతిరేకంగా కేరళలో ఎన్నో ప్రజా ప్రదర్శనలు జరిగాయి. కాని ఆ కార్యకలాపాలు ఎటువంటి అడ్డూ ఆపూ లేకుండా పెరుగుతూ పోయాయి. కొన్ని సంవత్సరాలలోనే కొండల తవ్వకం దాని చిట్టచివరి హద్దు మీరింది. ఇటువంటి చర్యల వల్లనే వరదల విధ్వంసం ఇంత పెద్ద ఎత్తున ఉంది అని ఆయన అన్నారు. రాష్ట్ర వ్యాప్తంగా చట్టవ్యతిరేక నిర్మాణ కార్యకలాపాలు, రియల్ ఎస్టేట్ పెరుగుదల ఎటువంటి నియంత్రణ లేకుండా జరిగాయని, ప్రస్తుత విధ్వంసం ఆ మానవ కల్పిత కార్యక్రమాల పర్యవసానమే తప్ప, సహజ ప్రకృతి వైపరీత్యం కాదని ఆయన అన్నారు. వీ

# నుల్కతోంగ్ హత్యాకాండపై వాస్తవ నివేదిక

***సుక్మా జిల్లాలో పదిహేను మంది ఆదివాసులను చంపిన ఆగస్ట్ 6 హత్యాకాండ జరిగిన రెండో రోజున బాధిత కుటుంబాలను కలిసి ఆగస్ట్ 8న ఫేస్ బుక్‌లో ప్రత్యక్ష సాక్షి కథనం వివరించారు లింగారాం కొడోపి***

నుల్కతోంగ్ ఎన్‌కౌంటర్ అని పోలీసులు చెపుతున్న హత్యాకాండ గురించి సమాచార సంస్థల ఆధారంగా నిన్న నా ఫేస్‌బుక్ మీద రాశాను. ఇప్పుడు హతుల, బాధితుల కుటుంబ సభ్యులను కలిసి సేకరించిన వాస్తవ సమాచారం రాస్తున్నాను.

ఆగస్ట్ 9 న ప్రపంచవ్యాప్తంగా ఆదివాసి దినోత్సవం జరుపుతారు. ప్రపంచమంతటా వ్యాపించిన నా ఆదివాసి మిత్రులారా, మీరు మీ పేరు మీద ఏర్పడిన దినోత్సవం జరుపుకుంటున్న వేళ, లోకమంతా కూడ మూలవాసుల మనుగడే ప్రమాదంలో పడి ఉంది. భారతదేశం ప్రపంచమంతటిలోకీ పెద్ద ప్రజాస్వామ్యం అని అంటారు. ఆ భారతదేశం లో ఒక రాష్ట్రం చత్తీస్‌గడ్. ఆ రాష్ట్రంలో బస్తర్ అనే ప్రాంతంలో మూలవాసులు లేదా ఆదివాసులు, మాడియాలు, మురియాలు, గోండులు, అడవిలో తమ జీవనం కొనసాగిస్తుంటారు. ఈ మూలవాసులను భారత ప్రభుత్వం, దాని పోలీసు శాఖ నక్సలైట్లు అని ముద్రవేసి ప్రతిరోజూ చంపుతున్నాయి. నిన్న ఉదయం సుక్మా జిల్లా మెహతా పంచాయత్ లోని నాలుగు గ్రామాల ఆదివాసులు పదిహేను మందిని అలా చంపివేశారు. 1. నుల్కతోగు గ్రామం నుంచి ఏడుగురు ఆదివాసులు, వాస్తవానికి చిన్నారి పిల్లలు ఈ హతుల్లో ఉన్నారు. 1) హిడ్మా ముచాకి (లఖ్మా) 2) దేవా ముచాకి (హుర్రా) 3) ముకా ముచాకి (ముకా) 4) మడ్కం హుంగా (హుంగా) 5) మడ్కం టింకు (లఖ్మా). 6) సోదీ ప్రభు (భీమా) 7) మడ్కం ఆయతా (సుక్కా). ఈ పిల్లలందరి వయసు దాదాపు 14 నుంచి 17 మధ్య ఉంటుందని కుటుంబ సభ్యులు చెపుతున్నారు.

2. గోంపాడు గ్రామం నుంచి 1) మడ్కం హుంగా (హుంగా), 2) కడ్తి హడ్మా (దేవా), 3) సోయం సీతా (రామా), 4) మడ్కం హుంగా (సుక్కా), 5) వంజాం గంగా (హుంగా), 6) కవాసీ బామీ (హడ్మా)

3. కింద్రంపాడ్ గ్రామం నుంచి 1) మడావి హుంగా (హింగా)

4. వేల్పొచ్చా గ్రామం నుంచి 1) వంజామ్ హుంగా (నందా) కూడ ఈ హత్యాకాండలో మరణించారు.

నుల్కతోగ్ గ్రామం నుంచి మడ్కం బుధరీ (రామా) అనే స్త్రీ కాలికి తుపాకి తూటా తగిలి గాయపడింది.

వేల్పొచ్చా గ్రామానికి చెందిన వంజామ్ హుంగాను ఇంటినుంచి పట్టుకువెళ్లి కాల్చి చంపి, నగదు బహుమతి ఉన్న నక్సలైటుగా చెపుతున్నారు. అతనితోపాటే మరొక ముగ్గురు యువకులను కూడ పట్టుకుపోయారు. పోలీసులు చాల మంది గ్రామస్తులను పరుగెత్తించి వెంటబడి కాల్పులు జరిపారు. అలా పరుగెత్తినవారిలో గర్భిణి మహిళలు కూడ ఉన్నారు.

ఈ విషయాలన్నీ సామాజిక కార్యకర్తలు సోనీ సోరీ, రాందేవ్ బఘేల్, నేను బాధిత కుటుంబ సభ్యులను కలిసి మాట్లాడినప్పుడు బైటపడ్డాయి. బాధితుల కుటుంబ సభ్యులు తమ గోడును సోనీ సోరీ ముందు వెళ్లబోసుకున్నారు. నాలుగు గ్రామాల గ్రామస్తుల కథనం ప్రకారం ఈ హత్యాకాండలో మరణించినవారందరూ గ్రామస్తులే, ఎటువంటి ఎన్‌కౌంటర్, ఎదురుకాల్పులు జరగలేదు. ఆ సమయంలో గ్రామంలో నక్సలైట్లు కూడ ఎవరూ లేరు. మీలో ఎవరైనా వాస్తవమేమిటో తెలుసుకో దలచుకుంటే మెహతా పంచాయత్‌లోని గోంపాడ్ గ్రామానికి వెళ్లి, అక్కడ ఈ నాలుగు గ్రామాల గ్రామస్తులను కలిసి మాట్లాడాలని నా విజ్ఞప్తి.

ఈ గోంపాడ్ గ్రామ సమీపంలోని మెహతా గ్రామ పంచాయత్ లోనే 2016 జూన్ 14న పోలీసులు మడ్కం హిడ్మె (కోసా కూతురు) అనే మహిళ మీద అత్యాచారం చేసి చంపేసి నక్సలైట్ అని ప్రకటించారు. ఆ ఘటనను నిరసిస్తూ సామాజిక కార్యకర్త సోనీ సోరీ నాయకత్వంలో ఆమ్ ఆద్మీ పార్టీ ఆగస్ట్ 9 నుంచి 15 వరకు ఆగస్ట్ క్రాంతి పేరుతో జాతీయ పతాకంతో గోంపాడ్ గ్రామం వరకూ పాదయాత్ర జరిపింది. గోంపాడ్ గ్రామంలో ఆగస్ట్ 15న జాతీయ జెండాను ఆవిష్కరించడం జరిగింది. ఈ గ్రామవాసులు ఇవాళ్టికీ మడ్కం హిడ్మెకు న్యాయం జరగాలని వేచి చూస్తున్నారు. ఈ కేసు బిలాస్‌పూర్ హైకోర్టులో విచారణ లో ఉంది. న్యాయమూర్తి తీర్పు ఎప్పుడు ఇస్తారో తెలియకుండా ఉంది. మళ్లీ ఇప్పుడు ఇదే గ్రామంలో ఏడుగురు గ్రామస్తులను పోలీసులు చంపివేశారు. భారతదేశంలో ప్రజాస్వామ్యం, రాజ్యాంగం, చట్టం ఆదివాసుల రక్షణ కొరకు పని చేస్తున్నాయనే విశ్వాసాన్ని ఈ గ్రామస్తుల్లో ఎలా కలిగించగలం?

ఇవాళ ఈ ఆదివాసుల మృతదేహాలను శవపరీక్ష పేరుతో డాక్టర్లు కోళ్లనూ మేకలనూ కోసినట్టు కోస్తారు. ఆతర్వాత ఆ మృతదేహాలను పాలిథిన్ సంచులలో కట్టి గ్రామస్తులకు అందజేస్తారు. గ్రామస్తులు నిన్నటి నుంచీ ఇక్కడికి వచ్చి కొంట రోడ్ల మీద పడిగాపులు పడుతున్నారు. ఇవాళ కూడ ఈ మృతదేహాలను తీసుకోవడానికి వేచి చూస్తున్నారు. వారికి మృతదేహాలు ఎప్పుడు అందజేస్తారో తెలియదు. నిన్న పదిహేను మంది ఆదివాసులను చంపిన తర్వాత ఆ మృతదేహాలను పాలిథిన్ సంచులలో పెట్టి ఆసుపత్రికి తీసుకువచ్చారు. సుక్మా పోలీసు అధికారులు పదిహేనుమంది నక్సలైట్లను చంపి మహత్కార్యం పని చేశారని ఇవాళ చిన్నా పెద్దా పత్రికలన్నిటిలోనూ ప్రశంసలు కురుస్తున్నాయి. సుక్మా జిల్లా పోలీసు సూపరింటెండెంట్ అభిషేక్ మీనాను, నక్సల్ వ్యతిరేక చర్యల ఎడిజె డి ఎం అవస్థీని, ఇతర పోలీసు అధికారులను గౌరవ ముఖ్యమంత్రి డా. రమణ్ సింగ్ ప్రశంసించారు. కొన్ని రోజుల తర్వాత ఈ పోలీసు

# వనరుల కోసం ఆదివాసీల హత్యాకాండ

***కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అడవులలో ఉన్న ఖనిజ వనరులను తవ్వుకోవడానికే మావోయిస్టుల నెపంతో ఆదివాసులను బూటకపు ఎన్‌కౌంటర్‌లలో హత్యలు, అత్యాచారాలు చేస్తున్నాయని అంటున్నారు ఎన్‌.నారాయణ రావు***

**2018** ఆగస్టు 6న సుక్మా జిల్లాలోని నుల్కతోంగ్ గ్రామ శివార్లలో ఎన్‌కౌంటర్ జరిగినట్లుగా 15 మంది మావోయిస్టులు చనిపోయినట్లుగా సుక్మా ఎస్‌పి అభిషేక్ మీనాతో సహా ఛత్తీస్‌గడ్ ముఖ్యమంత్రి రమణ్‌సింగ్, చివరికి దేశ ప్రధాని మోడీ కూడా ఎన్‌కౌంటరే అని పోలీసుల ధైర్య సాహసాలను కొనియాడాడు. కాని ఇది ఎన్‌కౌంటర్ కాదు. 2012లో చత్తీస్‌గడ్‌లోని బీజాపూర్ జిల్లా బాసగూడలో 17 మంది ఆదివాసులను హత్య చేసి ఎన్‌కౌంటర్‌గా ఆనాటి హోంమినిస్టర్ చిదంబరం ప్రకటన చేసినట్టుగా ఈ నుల్కతోంగ్ ఆదివాసుల హత్యాకాండను కూడా ఎన్‌కౌంటర్‌గా రమణ్‌సింగ్, మోడీ ప్రభుత్వాలు ప్రకటించాయి. కాని ఇవి అడవిలోని సహజ సంపద కోసం బహుళజాతి కంపెనీలతో కలిసి భారత ప్రభుత్వం సాగిస్తున్న ఆదివాసి జాతిహననంలో భాగంగానే జరుగుతున్నాయి. ఈ హత్యాకాండలో ఆరుగురు చిన్నారులు కూడా ఉన్నారు.

హత్యాకాండ నేపథ్యం 2005 నుంచి ఒక వైపు సల్వాజుడుం దాడులు కొనసాగుతుండగానే 2009లో ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను ప్రారంభించి ఆదివాసుల అడవి ప్రాంతమంతా అర్ధసైనిక బలగాలతో ప్రభుత్వం నింపేసింది. గత 9 ఏళ్లుగా ఆదివాసుల ప్రాంతాలన్నీ వారి నెత్తురుతో తడిసి ముద్దవుతున్నది. రాజ్యాంగం కల్పించిన ప్రాథమిక హక్కులు వారి విషయంలో అమలుకు నోచుకోవడం లేదు. గత ఏడాది కాలంగా ఆదివాసి గ్రామాల్లో ఆదివాసుల ఇండ్లల్లోనే పోలీసులు మాకాం చేయడంతో ఆదివాసి యువత గ్రామాలను విడిచి పారిపోతున్నారు. అదే క్రమం ఈ నుల్కతోంగ్ ఎన్‌కౌంటర్‌లో జరిగింది.

ఆగస్టు మొదటి వారంలో వందలాది పోలీసు బలగాలు గోంపాడు గ్రామంలోకి చొరబడ్డాయి. ఆగస్టు 3,4 తేదీలలో గోంపాడు గ్రామంలోని ప్రతి ఇంటిలో పోలీసు బలగాలు తిష్టవేసాయి. దానితో గ్రామంలోని

---

అధికారులకు జాతీయ పురస్కారాలు కూడ దక్కవచ్చు. కాని చనిపోయిన వారు నక్సలైట్లు కారనీ, ముక్కుపచ్చలారని ఆదివాసి యువతీ యువకులని డా. రమణ్ సింగ్‌కు బహుశా తెలియకపోవచ్చు.

మొత్తం భారతదేశంలోనే జాతీయవాదం ప్రమాదంలో ఉందంటున్నారు. జాతీయవాదం అంటే ఏమిటి? జాతీయవాదంలో ఆదివాసులు భాగం కారా? భారతీయ జనతా పార్టీ మొత్తం దేశంలో జాతీయవాదాన్ని రద్దు చేసి, ఆర్‌ఎస్‌ఎస్ చెప్పే గూండా సామ్రాజ్యాన్ని స్థాపించదలచుకుంది. లౌకిక, జాతీయవాదాలను రద్దు చేయడంలో దేశంలోని బుద్ధిజీవులందరూ భారతీయ జనతా పార్టీకి సహకరించ దలచారా? లేక మార్పుకోసం ఈ ప్రభుత్వాన్నే మార్చదలచారా?

ఆగస్ట్ 9న దేశవ్యాప్తంగానూ, ప్రపంచంలోనూ ఆదివాసి దినోత్సవం జరుపుకుంటున్నప్పుడు సుక్మాజిల్లా గోంపాడ్, కింద్రంపాడ్, నుల్కతోగ్, వెల్పొచ్చ గ్రామాల ఆదివాసులు మరణించిన పదిహేను మంది ఆదివాసి యువతీ యువకుల సంస్మరణలో ఉంటారు. ఈ గ్రామాలు, నక్సలైట్ల పేరు మీద చంపబడిన ఆదివాసులు మీ సముదాయంలో భాగం కారా? ఈ గ్రామాలు మీ గ్రామాలు కావా? మీరందరూ ఆదివాసి దినోత్సవాన్ని ఎవరితో కలిసి జరుపుకుంటున్నారు? ఏ ప్రభుత్వమైతే నక్సలైట్ల పేరుతో మీ సమాజాన్ని, మీ సముదాయాన్ని, మీ ఆదివాసులను చంపివేస్తున్నదో ఆ ప్రభుత్వంతో కలిసి మీరు ఆదివాసి దినోత్సవం జరుపుకుంటునారు. ఇవాళ భారతదేశంలో ఎనిమిది, తొమ్మిది కోట్ల మంది ఆదివాసులు, మూలవాసులు ఉన్నారు. చత్తీస్‌గడ్ రాష్ట్రంలో ఆదివాసి దినోత్సవాన్ని ప్రభుత్వ ఆధ్వర్యంలో రాయపూర్‌లో జరుపుతున్నారు. రాష్ట్ర మంత్రి కేదార్ కశ్యప్, ఆదివాసి సంస్థ మానవాభివృద్ధి మండలి ఉపాధ్యక్షులు, నందకుమార్ సాయ్, జాతీయ ఆదివాసి అభివృద్ధి సంస్థ అధ్యక్షులు, మరెందరో ఆదివాసి నాయకులు ఈ ఉత్సవాలలో పాల్గొంటున్నారు. వీరిలో కిందరు భారతీయ జనతా పార్టీ నేతలుగా ఆదివాసులలో దళారీలుగా వ్యవహరిస్తున్నారు. ఇక్కడ ఆదివాసులకు ఏం జరుగుతున్నదో ఈ నాయకులందరికీ తెలుసు కాని వారు పెదవి విప్పరు. ప్రభుత్వానికి వంత పాడడమే వారికి తెలుసు. కొందరు ఆదివాసి నేతలు భారతీయ జనతా పార్టీ, ఆర్‌ఎస్‌ఎస్‌లకు బానిసలుగా మారిపోయారు. ఎనిమిది కోట్ల ఆదివాసులలో కొద్దిమంది అయినా సుశిక్షితులైన ఆదివాసి యువకులు ముందుకు వచ్చి, ఆదివాసి సమాజ రక్షణకు పూనుకుంటేనే ఆదివాసి సమాజం మీద జరుగుతున్న అన్యాయాలను అరికట్టడం సాధ్యమవుతుంది.

లేదా, ఎనిమిది కోట్ల మంది భారత ఆదివాసుల నరాల్లో రక్తం ప్రవహించడం లేదని, భాజపా ప్రభుత్వం, ఆర్‌ఎస్‌ఎస్ ఆ రక్తాన్ని నీటిలా మార్చేసిందని నేను అనుకోవాలా? అత్యాచారాలకు వ్యతిరేకంగా పోరాడడానికి భారత ఆదివాసులలో ఎంత శక్తి ఉందో చూపుదాం. మానవ జీవిత సార్థకత తమ మీద జరిగే అత్యాచారాలకు వ్యతిరేకంగా పోరాడడంలోనే ఉంది.

*(రచయిత మురియా ఆదివాసి సమాజం నుంచి వికసించిన తొలి పత్రికా రచయిత. ఢిల్లీలో ప్రతిష్ఠాత్మకమైన సంస్థ ఇంటర్నేషనల్ మీడియా ఇన్ స్టిట్యూట్ ఆఫ్ ఇండియా లో జర్నలిజం చదువుకుని బస్తర్ నుంచి వార్తలు పంపడం ప్రారంభించారు. చత్తీస్ గడ్ ప్రభుత్వ అక్రమ కేసులకు, నిర్బంధానికి లోనయ్యారు. ఆయన తన ఫేస్‌బుక్ మీద హిందీలో రాసిన వ్యాసానికి అనువాదం)*

వీ

యువత నుల్కతోంగ్ గ్రామానికి పారిపోయారు. ఆగస్టు 5న తిరిగి గ్రామానికి వచ్చేసరికి ఇంకా పోలీసులు ఉన్న విషయం తెలుసుకొని మళ్లీ నుల్కతోంగ్ గ్రామానికి వెళ్లిపోయారు. అక్కడి వారి వ్యవసాయ పనుల్లో సహాయ పడుతూనే రాత్రి ఊరి అవతల గ్రామస్థులు నిర్మించుకున్న గుడిసెల్లో నిద్రించారు. ఆగస్టు 6న ఉదయం వీరు నిద్ర లేచేసరికల్లా తుపాకులు ఎక్కుపెట్టిన పోలీసులను చూసేసరికి భయంతో పారిపోయే ప్రయత్నం చేశారు. 30 మందితో ఉన్నవాళ్లు 15 మంది అక్కడిక్కడే పోలీసు కాల్పుల్లో చనిపోయారు. కొద్దిమంది గాయాలతో పారిపోయారు. వారిలో గోంపాడు గ్రామానికి చెందిన కడితి సుక్కా ఉన్నాడు. కడితి సుక్కా నుంచి నిజనిర్ధారణ కమిటీ ఘటన వివరాలు సేకరించింది.

ఎన్‌కౌంటర్ జరిగిందని పోలీసులు; కాదు, పోలీసులే ఏకపక్షంగా జరిపిన కాల్పులు అని అక్కడి గ్రామస్థులు చెబుతున్న ఆ ఘటనాస్థలం నుల్కతోంగ్ గ్రామానికి 2 కి.మీ. దూరంలో ఉంది. ఆ ప్రదేశాన్ని గ్రామస్థులు కెటాం/లడి అని పిలుస్తారు. వ్యవసాయ కాలంలో తాత్కాలికంగా ఉండేందుకు చిన్నపందిరి లాంటిది వేసుకుంటారు. దాన్ని విశ్రాంతి కోసం, వ్యవసాయ పనులకు ఉపయోగడే విధంగా వినియోగించుకుంటారు.

ప్రజాస్వామిక హక్కుల సంఘాల సమన్వయ సంస్థ (సిడిఆర్ఒ) ఆధ్వర్యంలో 16 మందితో కూడిన ప్రతినిధుల బృందం, ఆదివాసుల హక్కుల కార్యకర్త సోనిసోరితో పాటు ఐదుగురు మీడియా ప్రతినిధులతో ఆగస్టు 18, 19, 20న నిజనిర్ధారణ నిర్వహించింది. ఈ నిజనిర్ధారణలో భాగంగా గోంపాడు, నుల్కతోంగ్ గ్రామాలను సందర్శించడం, బాధిత కుటుంబాలను కలిసి వివరాలను సేకరించింది.

ఎన్‌కౌంటర్ జరిగిన ప్రదేశం చాలా భయంకరంగా హింసాత్మకంగా చిందర వందరగా అయిపోయింది. పందిరిపై నీడగా ఉండాల్సిన తాటి ఆకులను ఎవరో బలంవంతంగా లాగివేసి, నేల పైన కుప్పగా పడవేసినట్టు ఉన్నాయి. ఆ పందిరికి నిలబెట్టిన కర్రమొద్దులు (గుంజలు) వాడకుండా వదిలి వేయబడిన ప్రదేశంలో నిలబెట్టినట్లుగా మిగిలిపోయాయి. కొన్ని బట్టలు, ఒక జత స్లిప్పర్స్ ఆ ప్రదేశాన్ని మూసివేయదానికి నిటబెట్టిన 'దడి' పై వేలాడుతున్నాయి. కొద్దిదూరంలో పగిలిన గాజులు, ఏకపక్ష కాల్పులకు సాక్ష్యంగా చెట్లపై తూటాల గుర్తులు కన్పిస్తున్నాయి. దాదాపు 30 మంది – 26 మంది పురుషులు, నలుగురు అమ్మాయిలు పోలీసుల నుంచి తప్పించుకునే క్రమంలో ఈ ప్రదేశంలో ఉండిపోయారు. 30 మందిలో 15 మంది చనిపోగా, నలుగురిని పోలీసులు కస్టడీలోకి తీసుకున్నారు. అందులో ఒకరు ఆడమనిషి మిగిలినవాళ్లు మగవాళ్లు. అందరూ ఆ రోజు తప్పించుకొని ప్రాణాలు నిలబెట్టుకున్నారు.

భద్రతా దళాలు గ్రామాన్ని చుట్టుముట్టి వెళ్లిపోతుంటాయి. కాని వాళ్లు గ్రామాల్లోకి వచ్చినపుడు పురుషులు సమీపంలోని అడవిలోకో, పక్క గ్రామాలలోకో వెళ్లి దాక్కోవలసి వస్తుంది. అరెస్టుల నుండి తప్పించు కొనేందుకు తమ పిల్లల్ని, ఆడవాళ్లని, ముసలివాళ్లని అందరిని వదిలేసి వెళతారు. భద్రతా దళాలు ఊర్లోకి వస్తే తప్పకుండా ఇద్దరినో ముగ్గురినో తమ వెంట తీసుకెళతారు. ప్రతి గ్రామంలోనూ ఇదే పరిస్థితి.

ఆగస్టు మొదటివారంలో గోంపాడు సమీప కొండల్లో భద్రతాదళాలు క్యాంప్ వేసుకుని ఉన్నట్లు గ్రామస్తులకు తెలిసింది. భద్రతా దళాలు గ్రామాల్లోని ఇండ్లలోకి ఆహారం కోసం రావడంతో మగవాళ్లు తమ వ్యవసాయ పనులను వదిలేసి సమీప అడవుల్లోకి పారిపోయారు.

ఇటీవల కాలంలో సల్వాజుడుంను మళ్లీ పునరుద్ధరించిన స్థితిలో ఎస్‌పిఒల రూపంలో, సాయుధ దళాల రూపంలో దళాల్లోకి స్థానిక గోండీ భాష మాట్లాడే యువకుల్ని ఎక్కువగా చేర్చుకోవడంతో వారు తరచుగా గ్రామంలోకి వచ్చి వారికి కావలసిన బియ్యం, కోళ్లను ఎత్తుకెళ్లిపోతున్నారు. స్థానిక సల్వాజుడుం మూకలు రావడంతో వారి అరాచకాల పట్ల అవగాహన ఉన్న ఆదివాసి ప్రజలు పారిపోవడంలో భాగంగానే నుల్కతోంగ్ గ్రామంలో దాక్కున్నారు.

2011లో సుప్రీంకోర్టు సల్వాజుడం రద్దుచేసినట్లుగా ప్రకటించి నప్పటికీ ఆ బలగాలన్నీ మరొక రూపంలో, పేర్లతో సాయుధ దళాల్లోకి చేర్చుకోబడ్డాయి. వాటిని నిరోధించే శక్తి రాజ్యాంగ శక్తులకు లేకుండా పోవడం, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలకు పట్టనట్టుగా వ్యవహరించడం మళ్లీ ఆదివాసులపై సల్వాజుడుం అరాచక దాడులు కొనసాగుతన్నట్టుగా 2016 మడకం హిడ్మే హత్య నుంచి ఆదివాసులు భావిస్తూ వస్తున్నారు.

వర్షాలు మొదలు కావడంతో ఈ సమయం వారికి అత్యంత కీలకమైనది. కాని ప్రతి మూడు రోజుల కొకసారి భద్రతా దళాలు పెద్ద సంఖ్యలో గ్రామాల్లోకి రావడం వలన వారందరూ వ్యవసాయ పనులను వదిలేసి దాక్కోవలసిన పరిస్థితికి నెట్టివేయబడ్డారు. రెండు రోజులుగా బయట ఉండి తిరిగి ఆగస్టు 4న వచ్చారు. కాని మళ్లీ ఆగస్టు 5నే తిరిగి పోవాల్సి వచ్చింది.

గోంపాడ్‌కి 4 కి.మీ దూరంలో ఉన్న గ్రామం నుంచి ప్రజలు నుల్కతోంగ్‌కి ఆగస్టు 5న పొద్దునే పారిపోయారు. ఆ రాత్రి బంధువుల ఇండ్లల్లో భోజనం చేసి పోలీసుల నుండి ప్రాణాలు కాపాడుకునేందుకే కెటా/లడికి చేరుకున్నారు. కాని కొందరు పోలీసు తూటాలకు బలికావలసి వచ్చింది. రిక్రూట్‌మెంట్ గురించి నక్సల్స్ నాయకులు గ్రామస్థులతో సమావేశమవుతున్నారనే ఇంటలీజెన్స్ ఏజెన్సీ సమాచారం మేరకు 160 మంది గల డిస్ట్రిక్ రిజర్వ్ గార్డ్–డిఆర్‌జి, స్పెషల్ టాస్క్‌ఫోర్స్–ఎస్‌టిఎఫ్ బృందాలను జులై 31నే ఆ ప్రాంతానికి పంపించామని సుక్మా జిల్లా పోలీస్ సూపరింటెండ్ అభిషేక్ మీనా స్థానిక పత్రికా విలేకరులకు వివరించారు. అయితే కొన్ని ఆలస్యాల కారణం వల్ల ఆ సమావేశాలకు చేరుకోలేకపోయాయన్నారు. దానివల్ల వెళ్లిన భద్రతాదళాలు తిరిగి బేస్ క్యాంప్‌కి వచ్చేశాయి.

ఆగస్టు 4న మళ్లీ వెళ్లాయి. ఆగస్టు 6న భద్రతా దళాలు గాలింపు చేస్తుండగా నుల్కతోంగ్ గ్రామ సమీపంలో నక్సలైట్లు ఎదురుపడ్డారు. నక్సలైట్లు అక్కడే ఉన్నారని ఇంటలీజెన్స్ బోగట్టా కూడా మాకెంతో ఉపయోగిపడింది. 15 మంది ఎన్‌కౌంటర్‌లో చనిపోగా నలుగురిని అరెస్టు చేశాం. మిగిలినవారు తప్పించుకుపోయారు. బుద్రి తప్ప ఇంకెవ్వరు మహిళలు అక్కడ లేరు అని ఎస్‌పి చెప్పారు. దేవా, అందా, లక్మా, బుద్రిలను కస్టడీలోకి తీసుకున్నారు. దేవాని జైలుకు పంపించగా బుద్రి మాత్రం తుంటి ఎముక విరిగిపోవడంతో సుక్మాజిల్లా ఆసుపత్రిలో చికిత్స తీసుకుంటున్నది. అందా, లక్మాలను వారి 'స్టేట్‌మెంట్స్'ని రికార్డు చేసుకొని, వారు నక్సలైట్లు కాదని విడుదల చేశామని ఎస్.పి. మీనా తెలియచేశారు. ఎన్‌కౌంటర్‌లో భద్రతా దళాలు, మిలీషియా సభ్యులు

పరస్పరం కాల్పులు జరుపుకొన్నారని ఎస్.పి. చెబుతున్నారు. కాని ఒక్క పోలీస్‌కి గాయమైనట్లు నమోదు కాలేదు. ఎవ్వరూ పెద్ద లీడర్లు ఈ ఎన్‌కౌంటర్‌లో చిక్కలేదు కాబట్టి పోలీసులు మొదట ప్రకటించినట్లు ఇది అంతపెద్ద ఆపరేషన్ కాదని ఎస్.పి. అన్నారు.

**గోంపాడు గ్రామం**

ఆగస్టు 6న నుల్కతోంగ్ గ్రామంలో ఎన్‌కౌంటర్ హత్యాకాండలో గోంపాడు గ్రామానికి చెందిన ఆరుగురు ఆదివాసులు ఉన్నారు. సోయం సీత, సోయం చంద్ర, కడితి ఐత, మాడ్వి నంద, కడితి హడమ, మాడ్వి దేవలు హత్యకు గురైన వారిలో ఉన్నారు. ఇందులో కడితి ఐత 12 సంవత్సరాల బాలుడు కుంటలో చదువుకుంటున్నాడు. పోలీసులు గ్రామానికి రావడంతో తండ్రి కడితి సుక్కతో కలిసి నుల్కతోంగ్ పారిపోయారు. ఈ పోలీసుల కాల్పుల్లో కడితి సుక్క గాయాలతో బయటపడ్డాడు. ఇదే గ్రామానికి చెందిన మడ్కం హిడ్మేను 2016లో పోలీసులు గ్రామం నుంచి తీసుకెళ్లి అత్యాచారం చేసి చంపేశారు. 2007లో సల్వాజుడుం కాలంలో 11 మందిని సల్వాజుడుం వాళ్లు చంపేశారు. ఈ ఎన్‌కౌంటర్‌లో చనిపోయిన వాళ్లందరు భార్యా చిన్న చిన్న పిల్లలతో గ్రామంలో నివసిస్తున్న వారే. అందరికి ఆధార్, రేషన్ కార్డులు ఉన్నాయి. కేవలం భయంతో పారిపోయినందుకు పోలీసులు కాల్చి చంపేశారు.

**నుల్కతోంగ్ గ్రామం**

నుల్కతోంగ్ గ్రామం గోంపాడు గ్రామానికి నాలుగు 4 కిలోమీటర్ల దూరంలో ఉంటుంది. ఆగస్టు 19న సాయంత్రం 6 గంటలకు నిజనిర్ధారణ బృందం గ్రామానికి చేరుకునే సరికి గ్రామమంతా నిర్మానుష్యంగా ఉంది. ఉన్న కొద్ది మంది ఆడవాళ్లు కూడా భయం భయంగా ఉన్నారు. ఆగస్టు 18 ఉదయం నుంచి పోలీసులు గ్రామంలో మకాం వేసి కోళ్లు, మేకలను కోసుకొని తిన్నారని, ఇళ్లలోని నిత్యవసర వస్తువులను దోచుకెళ్లారని మాకు తెలియజేశారు.

19 సాయంత్రం 5 గంటలకు గ్రామం విడిచి పోలీసు బలగాలు వెళ్లిపోయాయి. మరీ ముఖ్యంగా ఈ ఎన్‌కౌంటర్ నేపథ్యంలో పౌరహక్కుల సంఘం సుప్రీంకోర్టులో పిల్ వేయడం వలన విచారణ కమిటీ తప్పకుండ గ్రామానికి వస్తుంది. కాబట్టి ఆ కమిటీకి సహకరించకుండా ఉండడం కోసం 'ఈ గ్రామంలో పెద్ద ఎన్‌కౌంటర్ జరుగబోతోంది, సుమారు 50 మంది వరకు చనిపోవచ్చు. కాబట్టి గ్రామాన్ని విడిచి పక్క గ్రామమైన దుర్మకు వెళ్లవలసిందిగా బెదిరించారు'. అట్లా రెండు రోజులుగా గ్రామం నిర్మానుష్యం అయిపోయింది.

మరణించిన వారిలో నుల్కతోంగ్ గ్రామానికి చెందిన వారు - సోడిప్రభు, మడ్కం టిక్కు, తాతి హుంగ, ముచాకి హిడమ, ముచాకి దేవ, ముచాకి మూకలు ఉన్నారు. ఇందులో ఐదుగురు మైనర్లు. అంతేకాకుండా వెల్‌పొచ్చా గ్రామానికి చెందిన వంజం హుంగా, కింద్రేమ గ్రామానికి చెందిన మాడివి హుంగా, ఏటిగట్ట గ్రామానికి చెందిన మాడ్వి బామన్‌లు ఉన్నారు.

మొత్తం 15 మంది ఆదివాసులను హత్య చేసి నక్సలైట్లుగా ప్రకటిస్తున్నారు. పోలీసులు చెబుతున్నట్లు వారు జన మిలీషియా కాదని, గ్రామస్తులేనని చనిపోయిన వారి కుటుంబాల వారు చెబుతున్నారు. వారి వద్ద ఆయుధాలు లేకపోవడమే గాకుండా అందులో నలుగురు చిన్నపిల్లలు కూడా ఉండడం వారి వాదనను బలపరుస్తుంది.

నుల్కతోంగ్ గ్రామానికి చెందిన ముచాకి ముకా తల్లి అయిన ముచాకి సిక్డి తన కొడుకు వయస్సు 14 లేదా 15 సంవత్సరాలు మాత్రమే ఉంటుందని చెప్పింది. తన బిడ్డ చాలా చిన్నవాడని చెప్పడానికి తన చెయ్యి భూమి మీద పెట్టి ఇంతే ఎత్తు ఉంటాడని చెప్పింది. తమ చుట్టూ చేరిన గుంపులో చిన్న పిల్లాడిని చూపిస్తూ సరిగ్గా తన కొడుకు అంతే ఉంటాడని వివరించింది. ఆ పిల్లలందరు దాదాపు ఒకే సంవత్సరం లో పుట్టినట్లు గ్రామస్తులు చెప్పారు.

ముచాకి ముకా తన సోదరులు ముచాకి దేవా, ముచాకి హిడ్మేలతో ఆరోజు అక్కడే ఉన్నాడు. ఆగస్టు 5న ఉదయం వేళ గోంపాడ్‌కి చెందిన మడకం సుక్కా, అతని 14 ఏండ్ల కుమారుడు మడకం ఐతా అతని వెంటే ఉన్నారు. కాల్పులు ప్రారంభం కాగానే అందరూ తలోదిక్కు పారిపోయారు. తన కుమారుడు తన లాగే తప్పించుకోగలడని సుక్కా భావించాడు. ముచాకి దేవా కూడా పారిపోయాడు. మడకం సుక్కాకి మోకాలుకి బుల్లెట్ తగిలి గాయమయినా అడవిలోకి రెండు కిలోమీటర్లు పరిగెత్తాడు.

అక్కడ రెండు రోజులు దాక్కొని తిరిగి గోంపాడ్‌కి చేరుకున్నాడు. అప్పటికే అతనికి తన కొడుకు మరణవార్త తెలిసింది. ఆ పిల్లల వయస్సును నిర్దిష్టంగా నిర్ధారించే సర్టిఫికెట్లు ఏమీ లేక పోయినా కుటుంబ సభ్యుల రేషన్‌కార్డుల్లో ఆ వివరాలు ఉన్నాయి. ముకా తండ్రి పేరు సుక్డి, దేవా తండ్రి పేరు సంటి, హిడ్మా తండ్రి పేరు మాపె వయస్సు 8, 7, 12 సంవత్సరాలు వారి కుటుంబాలకు సంబంధించిన రేషన్‌కార్డులో నమోదు కాబడి ఉన్నాయి. రేషన్ షాప్ యజమానులతో వివరాలు నిర్ధారించుకొన్నాం. పైకార్డులు ఇచ్చిన తేదీ వివరాల ప్రకారం చనిపోయిన ముగ్గురి పిల్లల వయస్సు వరుసగా 8+5=13, 7+5=13, 12+5=17. కాబట్టి దీన్ని బట్టి చనిపోయిన ఆ ముగ్గురు పిల్లలు కచ్చితంగా మైనర్లే.

కాని ఎస్.పి మీనా మాత్రం చనిపోయిన వారిలో ఎవరూ మైనర్లు లేరని వాదిస్తున్నాడు. ఎవరైనా ఇద్దరు 17, 18 ఏండ్ల వయస్సు వారు ఉండొచ్చని చెబుతున్నారు. వారి భద్రతా దళాలు చక్కటి క్రమశిక్షణ కలిగి ఉంటారని, ఇలాంటి విషయాల్లో మరింత జాగ్రత్తగా వ్యవహరిస్తారని అన్నారు.

భద్రతా దళాలు పిల్లల్ని కూడా నక్సలైట్లు అనుకొని కాల్పులు జరిపారా అని ఎస్.పి మీనాని అడగగా.. లేదు ఎన్‌కౌంటర్ జరిగిన తర్వాత శవాలను తీసుకువెళ్లే క్రమంలో పారా మిలటరీ సపోర్టు తీసుకున్నామని చెప్పారు. అంతవరకు ఎన్‌కౌంటర్‌లో పాల్గొన్నది డిఆర్‌జి/ఎస్‌టిఎఫ్ లోకల్ బలగాలని చెప్పారు. సోడి అందా, సోడి లక్మా; ఈ ఇద్దరూ కెటా/లడిలో ఎన్‌కౌంటర్ ముందు రాత్రి ఉన్నారు. పోలీస్ కస్టడీ నుండి 8 రోజుల తర్వాత గ్రామానికి వచ్చారు. వీరే కాల్పులకి ప్రధాన సాక్ష్యం. బుల్లెట్లు తగిలి, అరుస్తూ ఒరిగిపోయిన ప్రభుని నేను చూశాను... అని అందా వివరించాడు.

# కాళేశ్వరం ఎందుకు వివాదం అవుతున్నది?

*అనేక సాంకేతిక, ఆర్థిక, రాజకీయ, నిర్వహణాపర అంశాల వల్ల వివాదాస్పదంగా మారిన, ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా భావిస్తున్న కాళేశ్వరం ఎత్తిపోతల పథకం ఎందువల్ల వివాదాస్పదమయిందో వివరిస్తున్నారు* **ఎన్. వేణుగోపాల్**

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ పాలనలో తెలంగాణలో అవకాశం ఉన్న, అవసరమైన నీటి పారుదల ప్రాజెక్టులు నిర్మించలేదని, నిర్మించ తలపెట్టినవి కూడ విపరీతమైన తాత్సారం చేశారని, నిర్మించినవాటి నుంచి కూడ తెలంగాణకు తక్కువ నీరు అంది, తక్కువ ఆయకట్టు ఏర్పడాలని ఉద్దేశపూర్వక కుట్రలు చేశారని అనేక ఆరోపణలు తెలంగాణ ఉద్యమ క్రమంలో వెల్లువెత్తాయి. రెండు జీవనదుల పరీవాహక ప్రాంతంలో డెబ్బై, ఎనభై శాతం వాటా తెలంగాణలోనే ఉన్నప్పటికీ ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ జలవనరుల వాటాలో తమకు ఇరవై శాతం కూడ దక్కలేదనే వాస్తవమే తెలంగాణ ప్రజలను ప్రత్యేక రాష్ట్రం వైపు నెట్టిన కారణాలలో ప్రధానమైనది. రెండు నదుల జలాలలో తమకు రావలసిన వాటా తమకే అందితే తమ వ్యవసాయం బాగుపడుతుందనీ, ఆర్థికాభివృద్ధి జరుగుతుందనీ తెలంగాణ ప్రజలు ఆకాంక్షించారు. తెలంగాణకు ప్రధానంగా నీరు అందించవలసిన గోదావరి లోతున ఉన్నదని, తెలంగాణ ఎత్తున ఉన్నదని, అందువల్ల గోదావరి మీద ప్రాజెక్టులు కట్టి గురుత్వాకర్షణతో తెలంగాణకు నీరు అందించడం కష్టమని ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ పాలకులు చెపుతూ వచ్చిన సాకు నిజమో కాదో తెలంగాణ

---

లక్మా, అందా ఇద్దరూ కాల్పులు ఆగిపోయిన తర్వాత లొంగిపోతున్నా మంటూ చేతులు పైకెత్తారు. “మేము గ్రామస్తులం.. నక్సలైట్లం కాదు. మా దగ్గర ఆయుధాలు లేవు” అని అరిచారు. మమ్మల్ని వెంటనే ముందుకు రమ్మని పిలిచి, మా చేతులు కట్టివేశారు. చనిపోయిన వాళ్లు ఎవరైనా కాల్పులు జరుపుతారేమోననే భయంతో వారిద్దరు మమ్మల్ని వెళ్లమని ఆదేశించారు. తుపాకీ గురిపెట్టి చనిపోయిన వాళ్ల పేర్లు చెప్పమని అడిగారు. వాళ్లందరూ మా గ్రామస్తులే గనుక వారి పేర్లు చెప్పాం.

రెండు సంవత్సరాల క్రితం పార్టీలో కొంతకాలం పనిచేసిన దేవాని ‘నక్సలైట్లు’ వచ్చి వెళ్లారా అని పోలీసులు గుచ్చి గుచ్చి అడిగారు. దానికి దేవా అలాంటిదేమి లేదు అని చెప్పాడు. అందరు గ్రామస్తులు పోలీసులకు భయపడే ఇక్కడ దాక్కున్నారని దేవా చెప్పాడు.

**నిర్ధారణలు**

ఆదివాసి గ్రామాలపై సాయిధ బలగాలు, సల్వాజుడుం చేస్తున్న దాడులకు భయపడి ఆదివాసి యువత పెద్దవాళ్ల వేరే గ్రామాల్లో తల దాచుకోవడం అనేది సల్వాజుడుం ఉన్నప్పటి నుండి కొనసాగుతున్నది. అందులో భాగంగానే గోంపాడు గ్రామంపై పోలీసుల దాడి మూలంగానే చనిపోయిన వాళ్లందరు ప్రాణ భయంతో పారిపోయిన వాళ్లే. ఇందులో సాయుధ నక్సలైట్లు లేరు. అంతేగాక ఇందులో చాలా మంది చిన్నపిల్లలు ఉన్నారు. కాబట్టి పోలీసు బలగాలు కావాలనే కాల్చి చంపాయి. కాబట్టి ఇది ప్రభుత్వం కొనసాగిస్తున్న ఆదివాసుల హత్యాకాండే.

**ప్రభుత్వాలు ఎందుకు హత్యాకాండను కొనసాగిస్తున్నాయి?**

2009లో ప్రారంభించిన ఆపరేషన్ గ్రీన్‌హంట్ 2011లో ఆపరేషన్ సరండాగా, 2016లో మిషన్-2016గా, 2018లో ఆపరేషన్ సమాధాన్‌గా ఆదివాసుల హత్యాకాండను ప్రభుత్వం కొనసాగిస్తోంది. ఇప్పుడు మరీ ప్రత్యేక పరిస్థితి ఏమిటంటే ఎన్నికలు జరుగబోతున్న కాలం కాబట్టి బహుళ జాతి కంపెనీలు, సామ్రాజ్యవాదులు రాజకీయ పార్టీలకు పెట్టుబడులు పెట్టే స్థితి కాబట్టి ప్రజా ఉద్యమాలను నిరంకుశంగా నియంత్రిస్తామని చూపెట్టడంలో భాగంగానే ఈ నుల్కతోంగ్ హత్యాకాండ జరిగింది.

దీనికి ముందు గత సంవత్సరం నవంబర్ నెలలో గడ్చిరోలిలో గట్టెపల్లి గ్రామానికి చెందిన 8 మంది గ్రామస్థులను అమానువీయంగా చంపేశారు. ఆ ప్రాంతంలో వస్తున్న మైనింగ్ పెట్టుబడులకు అనుకూలం గానే గడ్చిరోలి మారణకాండ జరిగింది.

సామ్రాజ్యవాద సంక్షోభానికి మూడవ ప్రపంచదేశాల వనరులు, సంపదలు, దోచుకెళ్లడమే పరిష్కారంగా సాగుతున్న నేపథ్యంలో వనరుల దోపిడీని వ్యతిరేకిస్తున్న ప్రజా ఉద్యమాలపై ఉక్కుపాదం అంతకంతకు బిగుసుకుంటున్నది. స్వేచ్ఛకోసం అడవిపై హక్కు కోసం పోరాడుతున్నది ఆదివాసిలే. స్వేచ్ఛ వారికే కాదు దేశానికీ కావాల్సిందే. దోపిడీ ఉండకూడదని వనరులను పర్యావరణాన్ని కాపాడుకోవడమే మన విధిగా అనాగరికులుగా, ఆదివాసులుగా ఉంటూనే ఉన్నతమైన లక్ష్యాలతో పోరాడుతున్న ఆదివాసుల ఉద్యమాలను గుర్తించడం, గౌరవించడం, పరిష్కరించడమే నేటి ప్రభుత్వాల విధి.

నుల్కతోంగ్ ఎన్‌కౌంటర్ బూటకం. 15 మంది ఆదివాసులను కాల్చి చంపిన పోలీసులపై 302 హత్యానేరం కేసు నమోదు చేయాలి. ఆదివాసి ప్రాంతాల్లో ఉన్న అర్ధసైనిక బలగాల క్యాంపులను వెంటనే ఎత్తివేయాలి. 2011లో సుప్రీంకోర్టు సల్వాజుడుం రద్దు చేసినప్పటికి ఎస్‌పిఒల పేరుతో జరుగుతున్న దాడులపై రాష్ట్ర ప్రభుత్వాన్ని సుప్రీంకోర్టు నియంత్రించాలి. ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను వెంటనే నిలిపివేయాలి అనే నినాదంతో ప్రజలు, ప్రజాసంఘాలు, ప్రజాస్వామ్యవాదులు ఐక్యమత్యంగా పోరాడాలి.

*(రాష్ట్ర ప్రధానకార్యదర్శి పౌరహక్కుల సంఘం, తెలంగాణ)* వీ

సాధారణ ప్రజానీకానికి తెలియదు గాని కృష్ణా గోదావరులు తమ బీళ్లకు మళ్లాలని, తమ నేల సస్యశ్యామలం కావాలని ఆకాంక్ష మాత్రం ప్రబలంగా ఉండింది.

అందువల్లనే తెలంగాణ ఉద్యమ భూమికలుగా ప్రచారంలోకి వచ్చిన నాలుగు అంశాలలో (నీళ్లు, నిధులు, నియామకాలు, ఆత్మగౌరవం) నీళ్లే ప్రథమ స్థానంలో ఉన్నాయి. ఒకరకంగా తెలంగాణ ప్రజా ఆలోచనలలో నీళ్ల కోసం తపన ఒక భావోద్వేగంగా మారిపోయింది. అంటే నిజంగా నీళ్ల గురించి ఏమైనా చేసినా చేయకపోయినా, నీళ్ల పేరు చెపితే చాలు తెలంగాణ ప్రజలను ఆకర్షించడానికి, తప్పుదారి పట్టించడానికి, మోసగించడానికి కూడ అవకాశం వచ్చిందన్నమాట.

ఈ స్థితిలో ఏర్పడిన తెలంగాణలో ఏ ప్రభుత్వమైనా ఈ నీటి ఆకాంక్షను తీర్చడానికి ప్రయత్నాలు చేయక తప్పదు. ఆ ప్రయత్నాలలో భాగంగానే, తెలంగాణకు అత్యవసరమైన నీరు అందించడానికే కాళేశ్వరం భారీ ప్రాజెక్టును చేపడుతున్నానని తెలంగాణ ప్రభుత్వం వాదిస్తున్నది. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమంలో వ్యక్తీకరణ పొందిన ఈ తెలంగాణ ప్రజల ఆకాంక్ష ఈ రూపంలో నెరవేరుతున్నదనే అభిప్రాయంతో తెలంగాణ ప్రజలలో ఈ పథకం పట్ల ఆశాభావం, ఆదరణ ఉండడం సహజమే. నీటి వినియోగం ఒక భావోద్వేగంగా మారిపోయిన సందర్భంలో వినియోగం గురించి ప్రకటనలు నిజమో అబద్ధమో తేల్చుకోలేని స్థితి, అది నిజమేనా అని ప్రశ్నించినవారి పట్ల వ్యతిరేకత కలిగించే స్థితి, వారిని తెలంగాణ ద్రోహులుగా చిత్రించే స్థితి కూడ సహజమే.

అలా ప్రభుత్వం చేపట్టబోయే జలవనరుల వినియోగ పథకాలకు సానుకూల స్పందన రావడానికే ఎక్కువ అవకాశం ఉన్నప్పటికీ, ప్రభుత్వ ప్రకటన వచ్చిననాటి నుంచీ కూడ కాళేశ్వరం పథకం వివాదంగా మారింది. అధికారపక్షపు పథకాలను తప్పనిసరిగా విమర్శించే ప్రతిపక్షాల విమర్శలను, ఆరోపణలను, వారు లేవనెత్తుతున్న వివాదాలను పట్టించుకోకుండా ఉండవచ్చు.

కాని, కాళేశ్వరం మీద చర్చలలో, వివాదంలో ప్రజాసంఘాల వైపు నుంచి, స్వతంత్ర పరిశోధకుల వైపు నుంచి ఎన్నెన్నో అభ్యంతరాలు, వాదనలు, వివరణలు వినబడుతున్నాయి. ప్రభుత్వమూ ప్రభుత్వ సమర్థకులూ ఎన్ని ప్రతివాదనలు చేసినా, వివరణలు ఇచ్చినా అవి ఆకుకు అందని పోకకు పొందని వివరణలుగానే ఉంటున్నాయి.

నీళ్ల గురించి భావోద్వేగాలను రేకెత్తించడం, గత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలలో ఏమి జరిగింది అని ఎదురువాదనలు చేయడం, ప్రశ్నించినవారిని తెలంగాణ అభివృద్ధి నిరోధకులుగా ముద్రవేయడం మినహా వాస్తవంగా వెలువడుతున్న ప్రశ్నలలో ఏ ఒక్కదానికీ ప్రభుత్వం ఇంతవరకు హేతుబద్ధమైన సమాధానం ఇవ్వలేదు.

మరొకవైపు వేల కోట్ల రూపాయల ప్రజాధనం ఈ వివాదాస్పద పథకం మీద మంచినీళ్లలా ఖర్చయిపోతూ, కాంట్రాక్టర్ల బొక్కసాలకు చేరుతున్నది. బహుశా అందులో ప్రధాన భాగం అధికారపక్షానికి ముడుపులుగా తిరిగివస్తున్నది.

ఈ నేపథ్యంలో కాళేశ్వరం ప్రాజెక్టు అలా వివాదంగా మారడానికి కారణాలేమిటో, ఆ కారణాల నిజానిజాలు ఏమిటో చర్చించడం ఈ వ్యాస ఉద్దేశం.

**కాళేశ్వరం ప్రాజెక్టు ఏమిటి?**

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జలయజ్ఞం అనే కార్యక్రమంలో భాగంగా ప్రాణహిత ఉ చేవెళ్ల ఎత్తిపోతల పథకం అనే భారీ పథకాన్ని 2007లో ప్రకటించి, 2008 ఏప్రిల్ 11న శంకుస్థాపన చేసింది. మొదట 2007 మేలో రు. 17,875 కోట్ల వ్యయంతో తలపెట్టిన ఈ పథకం 2008 డిసెంబర్ నాటికి అదనపు లక్ష్యాలు కలుపుకుని రు. 38,500 కోట్ల ప్రాజెక్టుగా మారింది. మొదట 12.2 లక్షల ఎకరాల ఆయకట్టుకు సాగునీరు అందించే ప్రాజెక్టుగా మొదలై, తర్వాత 16.4 లక్షల ఎకరాల ఆయకట్టుకు మారింది.

ఈ ప్రాజెక్టును నాలుగు సంవత్సరాలలో 2012 నాటికి పూర్తి చేస్తామని అప్పటి ప్రభుత్వం మొదట ప్రకటించింది గాని త్వరలోనే ఈ గడువును ఎనిమిది సంవత్సరాలకు పెంచింది. 2015 జనవరి నాటికి ఈ ప్రాజెక్టు పేరు మీద రు. 7000 కోట్లు ఖర్చయి, కాంట్రాక్టర్లకు దక్కాయి గాని, ప్రధాన ఆనకట్ట ఎత్తు ఎంత ఉండాలనే కీలక నిర్ణయం కూడ జరగలేదు.

సరిగ్గా ఆ సమయానికే తెలంగాణ రాష్ట్రం ఏర్పడి, తెలంగాణ రాష్ట్ర సమితి ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. మొదట దాదాపు రెండు సంవత్సరాలు ఈ పథకాన్ని యథాతథంగా కొనసాగించబోతున్నట్టే ప్రయత్నాలు, కేంద్ర ప్రభుత్వంతో, మహారాష్ట్ర ప్రభుత్వంతో చర్చలు జరిగాయి. అది నిష్ప్రయోజకమైన ప్రాజెక్టు అనుకుంటే ఈ రెండు సంవత్సరాలు ఆ ప్రాజెక్టును జాతీయ ప్రాజెక్టుగా పరిగణించాలని కేంద్ర ప్రభుత్వాన్ని కోరడం, వివాదాల పరిష్కారం కోసం మహారాష్ట్ర ప్రభుత్వంతో చర్చలు జరపడం ఎందుకు జరిగిందో తెలంగాణ రాష్ట్ర సమితి ప్రభుత్వం జవాబు చెప్పవలసే ఉన్నది. కాని, రాష్ట్రంలోని నీటిపారుదల స్థితి మీద శాసనసభలో 2016 మార్చ్ 31న ముఖ్యమంత్రి కె చంద్రశేఖర రావు గూగుల్ మాప్స్ సహాయంతో చేసిన మూడు గంటల ప్రసంగంతో అదంతా మారిపోయింది.

గత ప్రభుత్వాల జలయజ్ఞం నిజానికి ధనయజ్ఞమనీ, తెలంగాణ ప్రజా ప్రయోజనాలకు వ్యతిరేకమనీ, కేవలం కాంట్రాక్టర్ల కోసమే తయారయిందనీ ఆయన ఆ ప్రసంగంలో అన్నారు. తెలంగాణ ప్రాజెక్టులను గత ప్రభుత్వాలు ఉద్దేశపూర్వకంగా అంతర్రాష్ట్ర జలవివాదాలతో ముడిపెట్టాయని అన్నారు. అందువల్ల గత ప్రభుత్వం తయారు చేసిన పథకాలన్నిటినీ రిడిజైన్ (పునర్ రూపకల్పన) చేయవలసిన అవసరం ఉందని మొదటిసారిగా అన్నారు. ఆ తర్వాత ఆ పేరుతో పాత పథకాలన్నిటికీ మార్పులు చేయడం ప్రారంభించారు. కాని గత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏ కాంట్రాక్టర్ల కోసం మాత్రమే పాజెక్టులను తయారుచేసిందని ఆరోపించారో ఆ కాంట్రాక్టర్లలో ఒక్కరిని కూడ మార్చకుండా, రిడిజైన్ చేసిన ప్రాజెక్టులను కూడ వారికే అప్పగించారు. కాకపోతే రిడిజైన్ పేరు మీద ప్రాజెక్టు వ్యయాన్ని ఇబ్బడి ముబ్బడిగా పెంచారు. కనుక తెలంగాణ రాష్ట్ర సమితి ప్రభుత్వం ప్రకటిస్తున్న రిడిజైన్ పథకాలు వాస్తవంగా పాత పథకాలనే కాస్త అటూ ఇటూ మార్చి, పాత కాంట్రాక్టర్లకే అప్పగించే కొత్త జల-ధనయజ్ఞం ప్రాజెక్టులే తప్ప నిజంగా కొత్తవో, నిజంగా తెలంగాణ ప్రజా ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకున్నవో కావనే అనుమానాలు అప్పుడే ప్రారంభమయ్యాయి.

ఆ క్రమంలోనే పాత ప్రాణహిత ఉ చేవెళ్ల ఎత్తిపోతల ప్రాజెక్టు స్థానంలో రిడిజైన్ ద్వారా వచ్చిన కొత్త పథకం కాళేశ్వరం ప్రాజెక్టు. పాత ప్రాజెక్టు ప్రాణహిత నదిలో తుమ్మిడిహట్టి దగ్గర 160 టిఎంసి ల నీటిని తీసుకుని,ఆదిలాబాద్, నిజామాబాద్, కరీంనగర్, మెదక్, వరంగల్, నల్లగొండ, రంగారెడ్డి జిల్లాల్లో 16.4 లక్షల ఎకరాల వ్యవసాయ భూమికి సాగునీరుతో పాటు తాగునీరు, పరిశ్రమలకు నీరు అందించేదిగా రూపకల్పన జరిగింది. రిడిజైన్ చేసిన కొత్త పథకం లక్ష్యం ప్రాణహిత గోదావరిలో కలిసే స్థలానికి ఇరవై కిమీ దిగువన గోదావరి మీద మేడిగడ్డ దగ్గర ఒక ఆనకట్ట నిర్మించి, అక్కడి నుంచి ఎత్తిపోతల ద్వారా నీటిని అన్నారం, సుందిళ్ల ఆనకట్టలకు, అక్కడి నుంచి ఎల్లంపల్లి జలాశయానికి తరలించి, ఆ తర్వాత మరొక పదిహేడు జలాశయాలను నిర్మించడం గాని, మెరుగుపరచడం గాని చేసి, కాలువలు, సొరంగాలు, ఎత్తిపోతల ద్వారా మొత్తం పాత ఏడు జిల్లాలలోని (ప్రస్తుతం పదమూడు జిల్లాలలోని) 18.25 లక్షల ఎకరాలకు సాగునీరు, తాగునీరు, పారిశ్రామిక అవసరాలకు నీరు అందించడం, మరొక 18.82 లక్షల ఎకరాల ఆయకట్టును స్థిరీకరించడం. ఈ స్థిరీకరణ విస్తీర్ణం ఒక్కొక్క ప్రభుత్వ పత్రంలో ఒకలాగ ఆరు లక్షల ఎకరాల నుంచి పద్దెనిమిది లక్షల ఎకరాల దాకా ఉందంటేనే అది అబద్ధం కావడానికే ఎక్కువ అవకాశం ఉందన్నమాట.

ఈ క్రమంలో గోదావరి నుంచి మొత్తం గ్రహించే నీరు 195 టిఎంసిసిలనీ, వాటిలో అన్ని జలాశయాల సామర్థ్యం 147.7 టిఎంసిలని, 20 ఎత్తిపోతల పథకాలుంటాయని, ఈ పథకాలకు 4627 మెగావాట్ల విద్యుత్తు అవసరం అవుతుందని ప్రభుత్వం ప్రకటిస్తున్నది. పదహారు లక్షల ఎకరాలకు నీరు అందించే పాత పథకం రు. 38,000 కోట్ల వ్యయంతో తయారుకాగా, పద్దెనిమిది లక్షల ఎకరాలకు నీరు అందించే కొత్త పథకానికి రు. 80,190 కోట్ల వ్యయం అవుతుందని ప్రభుత్వం అంచనాలు వేస్తున్నది.

**అనుమానాలకు నాంది**

రిడిజైన్ చేసిన కొత్త పథకంలో ఎవరికైనా చూడగానే కొట్టవచ్చినట్టు కనబడే అసంగతాలు రెండు: ఒకటి, కేవలం రెండు లక్షల ఎకరాల పెంపుతో, అంటే పన్నెండు శాతం పెంపుతో, వ్యయం రెట్టింపుగా, నూటపదకొండు శాతం పెరుగుదలతో ఎలా జరిగింది? రెండు, పాత పథకం కాంట్రాక్టర్ల ప్రయోజనాల కోసమే తయారయిందని ఆరోపించి నప్పుడు కొత్త పథకంలో ఆ కాంట్రాక్టర్లే ఎలా కొనసాగుతున్నారు?

అయితే, సాధారణ పరిశీలనకు వెంటనే తట్టే ఈ రెండు ప్రశ్నలు మాత్రమే కాక, అసలు మొత్తం పథకంలో సాంకేతికాంశాలలో, ఆర్థికాంశా లలో ఎన్నో ప్రశ్నలున్నాయి. ఆ సాంకేతిక అంశాలు, ఆర్థిక అంశాలు విద్యావంతులకు కూడ సులభంగా అర్థమయ్యేవి కావు, సంక్లిష్టమైనవి. అందువల్ల ఎంతో హేతుబద్ధమైన ఆ అంశాల కన్న, ప్రశ్నలు లేవనెత్తుతున్నవాళ్ల మీద ప్రభుత్వం, ప్రాజెక్టు సమర్థకులు నిర్హేతుకంగా వేస్తున్న నిందలకే ఎక్కువ ప్రచారం దొరుకుతున్నది. ఆ ప్రశ్నలకు ప్రభుత్వం గాని, సమర్థకులు గాని సూటిగా, హేతుబద్ధంగా జవాబు ఇవ్వకపోవడం వల్ల మరిన్ని ప్రశ్నలు తలెత్తుతున్నాయి. మొత్తం ప్రాజెక్టు వ్యవహారంలో ప్రభుత్వం పారదర్శకంగా వ్యవహరించక పోవడం వల్ల, కాళేశ్వరం ప్రాజెక్టును ఒక యాత్రాస్థలంగా మార్చి, సమర్థకుల చేత మితిమీరిన ప్రశంసలు చేయించుకోవడంవల్ల ఏవో అక్రమాలు, అసంగతాలు జరిగే ఉంటాయన్న అనుమానాలు కలుగుతున్నాయి.

ప్రాజెక్టు గురించి జరుగుతున్న ప్రచారంలో, ప్రభుత్వమూ, సమర్థకులూ చేస్తున్న భజనలూ, దాచిపెడుతున్న, వక్రీకరిస్తున్న, తప్పుదారి పట్టిస్తున్న అంశాలూ చూస్తుంటే ఈ ప్రాజెక్టు కేవలం ముఖ్యమంత్రి అన్నమాటను నిజం చేసే వ్యక్తిగత ప్రతిష్ఠ అంశంగా చూస్తున్నారు గాని తెలంగాణ ప్రయోజనాలు ప్రధానం కావడం లేదని అనుమానాలు బలపడుతున్నాయి.

**సాంకేతిక అంశాలు**

మొట్టమొదట సాంకేతికాంశాలు చూస్తే అందులో నీటి లభ్యత, అంతర్రాష్ట్ర జల వివాదాలు, నీటి వినియోగ గణాంకాలు, విద్యుత్ అవసరాలు, ప్రాజెక్టు సంబద్ధత వంటి ప్రధానాంశాలున్నాయి.

పాత పథకం ప్రకారం తుమ్మిడిహట్టిలో ఆనకట్ట నిర్మిస్తే అక్కడ ముందు అనుకున్నంత నీటి లభ్యత లేదని కేంద్ర జల వనరుల సంఘం చెప్పిందని, అంతేకాక అక్కడ ఆనకట్ట ఎత్తు నిర్ణయించడంలో మహారాష్ట్ర ప్రభుత్వంతో ఇబ్బందులు ఉన్నాయని, మేడిగడ్డ దగ్గర అయితే చాల ఎక్కువ నీరు అందుబాటులో ఉందని, అందువల్ల రిడిజైన్ చేసిన పథకం చాల ప్రయోజనకరమని ప్రభుత్వం, ప్రాజెక్టు సమర్థకులు వాదిస్తున్నారు. నిజానికి ఈ మూడు వాదనలు కూడ అబద్ధాలు, అర్ధసత్యాలు. ఇవి కేవలం పాత ప్రాజెక్టును రద్దు చేసి కొత్త ప్రాజెక్టు నిర్మించడానికి చూపుతున్న సాకులు తప్ప ఈ మూడు కారణాలు కూడ వాస్తవ పరిశీలనకు నిలవవు.

తుమ్మిడిహట్టి దగ్గర ప్రభుత్వం ముందు అనుకున్నట్టుగా 165 టిఎంసిల నీరు లభ్యం కావడం లేదని కేంద్ర జల సంఘం ఎక్కడా ఎప్పుడూ అనలేదు. ఆ విషయం విమర్శకులు అంటున్నది మాత్రమే కాదు, స్వయంగా రాష్ట్ర ప్రభుత్వం ఇప్పుడు డిజైన్ మార్చి కాళేశ్వరం ప్రాజెక్టు కోసం తయారు చేసిన డీటెయిల్డ్ ప్రాజెక్ట్ రిపోర్ట్ (డిపిఆర్) లోనే ఆ మేరకు సూచనలున్నాయి. కేంద్ర జల సంఘం అన్నదల్లా తుమ్మిడిహట్టి దగ్గర గతంలో ప్రతిపాదించిన పంపులతో అనుకున్నట్టుగా 160 టిఎంసిల నీటిని తీసుకోవడం సాధ్యం కాదని మాత్రమే. ఆ పంపులతో 130 టిఎంసిల కన్న ఎక్కువ నీరు తరలించడానికి అవకాశం లేదని మాత్రమే. అంటే అక్కడే మరింత ఎక్కువ సామర్థ్యం గల పంపులు ఏర్పాటు చేస్తే పాత ప్రాజెక్టు సరిపోతుంది. ఆ కారణం కోసం పూర్తిగా ఆ ప్రాజెక్టునే మార్చవలసిన అవసరం లేదు.

అలాగే మహారాష్ట్ర ప్రభుత్వంతో తెలంగాణ ప్రభుత్వం 2014 నుంచి 2015 చివరి వరకూ జరిపిన చర్చలలో పాత ప్రాజెక్టు ఎత్తు గురించి, ముంపు విస్తీర్ణం గురించి కొన్ని భిన్నాభిప్రాయాలు వెలువడిన మాట నిజమే గాని వాటిలో కొన్ని చర్చల ద్వారా పరిష్కారమయ్యాయి, మిగిలినవి కూడ చర్చల ద్వారా పరిష్కారమయ్యేవే.

తుమ్మిడిహట్టి ఆనకట్ట 152 మీటర్ల ఎత్తున కట్టడానికి మహారాష్ట్ర ప్రభుత్వం అభ్యంతరం చెప్పింది గాని 148 మీటర్ల ఎత్తున కట్టడానికి

ఆమోదం తెలిపింది. మహారాష్ట్ర ఉ తెలంగాణ ప్రభుత్వాల మధ్య ఆ ఒప్పందం కూడ కుదిరింది. అలా 148 మీటర్ల ఎత్తు ఆనకట్ట కట్టినా, తీసుకోదలచుకున్న 160 టిఎంసి నీళ్లను తీసుకుని, ముందు అనుకున్నట్టుగా ఎల్లంపల్లికి ఎత్తిపోయవచ్చు. కాని హఠాత్తుగా, అంతర్రాష్ట్ర జల వివాదం సాకుతో తెలంగాణ ప్రభుత్వం మొత్తం ప్రాజెక్టు డిజైన్ నే మార్చి, 100 మీటర్ల ఎత్తున ఉన్న మేడిగడ్డ ఆనకట్ట తలపెట్టడానికి సాంకేతిక కారణాలు కాక ఇతర కారణాలున్నాయి. పైగా తుమ్మిడిహట్టిని తొలగించి, దాదాపు 150 కిమీ దిగువన మేడిగడ్డ దగ్గర నీళ్లు తీసుకుని భారీ పంపుల ద్వారా తుమ్మిడిహట్టికి సమాన ఎత్తులో ఉన్న ఎల్లంపల్లికి ఎత్తిపోయడం అనేది హాస్యాస్పదమైన, అనవసరమైన, వృథావ్యయానికి దారితీసే ప్రయాస మాత్రమే.

ఈ మధ్యలో భారీ పంపుసెట్లు, రెండు జలాశయాలు, పెద్ద ఎత్తున విద్యుదుత్పత్తి, పంపిణీ కేంద్రాలు మొదలైనవన్నీ విపరీతమైన ప్రజాధనం వ్యయంతో నిర్మించడానికి, అంటే కాంట్రాక్టర్లకు వేల కోట్ల రూపాయలు కట్టబెట్టడానికి, అందులో ఇరవై శాతమో ముప్పై శాతమో ముడుపులుగా తిరిగి పొందడానికి అధికారపక్షం చేసిన దురాలోచన తప్ప, ప్రాజెక్టు రిడిజైన్ లో ప్రజా ప్రయోజనమేమీ లేదు.

ఇక నీటి వినియోగ గణాంకాలలో ప్రభుత్వం, ప్రాజెక్టు సమర్థకులు రెండు పెద్ద తప్పులకు పాల్పడుతున్నారు. ఒకటి, మేడిగడ్డలో లభ్యమయ్యే నీరు, అక్కడి నుంచి ఎత్తిపోయగల నీరు ఎంత అనేది. రెండు, మేడిగడ్డ నుంచి, ఇతర చోట్ల నుంచి తీసుకునే నీటితో ఎంత ఆయకట్టు ఏర్పడుతుందనేది. మేడిగడ్డ దగ్గర 415 టిఎంసిల నీరు లభిస్తుందని, అందులో నుంచి 225 టిఎంసిల (240 టిఎంసిల) నీటిని తీసుకుని 20 లిఫ్టుల ద్వారా, 20 జలాశయాల ద్వారా 169 టిఎంసిల నీటిని వ్యవసాయానికి, 40 టిఎంసిల నీటిని తాగునీటి అవసరాలకు, 16 టిఎంసిల నీటిని పారిశ్రామిక అవసరాలకు అందిస్తామని ప్రభుత్వం చెపుతున్నది. నిజానికి ఈ అంకెలన్నీ అర్ధసత్యాలు మాత్రమే.

మేడిగడ్డకు చేరే నీరు ప్రాణహిత, గోదావరి, మానేరు అనే మూడు వనరుల ద్వారా మాత్రమే వస్తుంది. ప్రాణహితలో పైన తుమ్మిడిహట్టి దగ్గర పాత ప్రాజెక్టు కట్టడానికి నీరు లేదన్నవారు, ఆ స్థలంలో మరొక చిన్న ప్రాజెక్టు కడుతూనే కిందికి అంతకన్న ఎక్కువ నీరు వస్తుందంటున్నారు.

గోదావరిలో పైన ఎల్లంపల్లి దగ్గర ఉన్న ప్రాజెక్టు నిండిన తర్వాతనే నీరు కిందికి వచ్చే అవకాశం ఉండగా, దొంగలెక్క చూపి, మేడిగడ్డ నుంచి లిఫ్ట్ ద్వారా మళ్లీ ఎల్లంపల్లికి ఎత్తిపోస్తామంటున్నారు. మానేరులో పైన మిడ్ మానేర్, లోయర్ మానేర్ జలాశయాలు నిండిన తర్వాతనే నీరు కిందికి వచ్చే అవకాశం ఉండగా, అక్కడా దొంగలెక్క చూపి, కిందికి ప్రవహించిన నీటిని మేడిగడ్డ నుంచి లిఫ్టులద్వారా మళ్లీ ఎత్తి అవే జలాశయాలకు పంపుతామంటున్నారు.

ఇక ఒక టిఎంసి నీటితో ఎన్ని ఎకరాల సాగుభూమికి నీరు అందుతుందనే లెక్కలలో కూడ తెలంగాణ రాష్ట్ర సమితి ప్రభుత్వం ఎన్ని అబద్ధాలాడుతున్నదో లెక్కలేదు. గత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు ఒక టిఎంసితో పదిహేను నుంచి ఇరవై వేల ఎకరాలు సాగవుతాయని తెలంగాణలో సాగునీటి సౌకర్యాల గురించి అబద్ధాలు చెప్పపుతున్నదని కాని పదివేల ఎకరాల కన్న ఎక్కువ సాగు కష్టమని ఎన్నో సభల్లోనూ, చివరికి శ్రీకృష్ణ కమిషన్ ముందు లిఖితపూర్వకంగా సమర్పించిన నివేదికలలోనూ తెలంగాణ రాష్ట్ర సమితి నేతలు, వారిని సమర్థించే మేధావులు వాదించారు. ఇవాళ అదే మేధావులు కాళేశ్వరం నీటితో మాత్రం పన్నెండు వేలు, పద్నాలుగు వేల ఎకరాలు సాగుకు అవకాశం వస్తుందని దొంగలెక్కలతో అమాయకులను నమ్మిస్తున్నారు.

ఈ ప్రాజెక్టు కింద నిర్మించనున్న అన్ని లిఫ్టులకూ కలిపి 4627 మెగావాట్ల విద్యుత్తు అవసరం అవుతుందని ప్రభుత్వమే అంటున్నది. ఇందుకు అవసరమైన సబ్ స్టేషన్లు నిర్మించడానికి మూడువేల కోట్ల రూపాయలు కావాలి. ఈ లిఫ్టులు నిరంతరం పనిచేయడానికి ఆ సబ్ స్టేషన్ల, లిఫ్టుల నిర్వహణకు ప్రతిరోజూ అవసరమయ్యే విద్యుత్తుకు సాలీనా వేలాది కోట్ల రూపాయలు కావాలి. ఇలా కాళేశ్వరం నీటి సరఫరా వ్యయం సాలీనా రు. 12758 కోట్లకు పైనే ఉండవచ్చునని స్వతంత్ర పరిశోధకులు అంచనా వేస్తున్నారు.

అంటే కాళేశ్వరం ప్రాజెక్టు నిజంగా పూర్తయి, సాగు భూములకు నీరు అందినా ఆ సాగు చాల ఖరీదైన సాగుగా మారుతుంది. ఇప్పటికే పెట్టిన పెట్టుబడికి తగిన గిట్టుబాటు ధరలు అందని రైతాంగం మీద ఇది మరింత భారమవుతుంది. ఈ వ్యయాన్ని రైతులు భరించనక్కరలేదని, ప్రభుత్వం ఇప్పటిలాగే ఎప్పటికీ ఉచిత విద్యుత్తు ఇస్తుందని వాదించినప్పటికీ, ఆ వ్యయం మొత్తం రాష్ట్ర ప్రజానీకమైనా భరించవలసిన అదనపు భారమే అవుతుంది.

**ఆర్థిక అంశాలు**

ఇక ఆర్థికాంశాలలోకి వస్తే, ప్రాజెక్టు నిర్మాణ వ్యయం, ప్రాజెక్టు నిర్మాణానంతర వార్షిక నిర్వహణా వ్యయం, కాంట్రాక్టర్ల పాత్ర, రాజకీయ నాయకత్వం పాత్ర వంటి ప్రధానాంశాలున్నాయి. ప్రాజెక్టు నిర్మాణ వ్యయం హఠాత్తుగా రు. 38,000 కోట్ల నుంచి రు. 80,500 కోట్లకు ఎట్లా పెరిగిపోయిందో చూశాం. నిజానికి ఈ పెరుగుదల ఎందువల్ల జరిగింది, పాత ప్రాజెక్టు కన్న అదనంగా వచ్చి చేరిన అంశాలేమిటి, వాటిలో ఒక్కొక్కదాని ఖర్చు ఎంత, ఆ ఖర్చు అంచనాలు వాస్తవికంగా, హేతుబద్ధంగా ఉన్నాయా వంటి ప్రశ్నలు వేసుకుంటే ఒక్కదానికీ సంతృప్తికరమైన సమాధానం లేదు.

ప్రాజెక్టు నిర్మాణ వ్యయం విషయంలోనే ఈ గందరగోళం ఉండగా, నిర్మాణానంతర వార్షిక నిర్వహణా వ్యయం ఇప్పుడు ఉజ్జాయింపుగా అంచనా వేయగలిగిందే తప్ప కచ్చితంగా చెప్పగలిగినది. ఏ ఐదు, పది శాతం ఎక్కువ తక్కువలకు అవకాశమిస్తూ వాస్తవిక అంచనా తయారు చేయాలి. స్వతంత్ర పరిశోధకుల అంచనా ప్రకారం ఇది రు. 17,584 కోట్ల వార్షిక వ్యయంగా ఉండబోతుంది. అది ఇరవై వేల కోట్ల రూపాయల దాకా ఉండవచ్చు. ఇటువంటి బహుళార్థసాధక, ప్రజా ప్రయోజన ప్రాజెక్టులను లాభనష్టాల లెక్కలలో అంచనా వేయడం సరైనది కాదనే మాట నిజమే గాని, ప్రాజెక్టు నిర్మాణానికి ఎనభై వేల కోట్ల రూపాయలు (నిర్మాణం పూర్తయ్యేవరకు అది లక్షకోట్ల రూపాయలు దాటినా ఆశ్చర్యం లేదు), నిర్మాణానంతరం ప్రతి ఏటా ఇరవై వేల కోట్ల రూపాయలు ఖర్చు పెట్టి, అది కూడ ప్రజలకు పూర్తి సమాచారం ఇవ్వకుండా

ప్రజాధనాన్ని ఖర్చుపెట్టి, ఆ ఖర్చులో అత్యధిక భాగం కాంట్రాక్టర్ల బొక్కసాల్లోకీ, అటు నుంచి రాజకీయ నాయకుల బొక్కసాల్లోకీ ప్రవహిస్తున్నప్పుడు, ప్రవహించేది నీళ్లా, ధనమా అని ప్రశ్నించక తప్పదు. ఎవరి బొక్కసాల్లోకో ప్రవహిస్తున్న ధనం వల్ల ప్రజలకు ఒనగూరే ప్రయోజనం ఏమిటని ప్రశ్నించక తప్పదు. ఈ భారీ కుంభకోణంలో రాజకీయ నాయకత్వం పాత్ర ఎంత, కాంట్రాక్టర్ల లాబీ పాత్ర ఎంత, ఈ భారీ యంత్ర సామగ్రి తయారుచేసే బహుళ జాతి సంస్థల పాత్ర ఎంత, ఈ దొంగ నివేదికలు ఇచ్చే కన్సల్టెన్సీ సంస్థల పాత్ర ఎంత ప్రశ్నించక తప్పదు. ఇన్ని అవకతవకలతో, అసంగతాలతో సాగుతున్న ప్రాజెక్టుకు అసలు సంబద్ధత ఎంత అని ప్రశ్నించక తప్పదు.

**పారదర్శకత ఉ ప్రజాప్రయోజనాలు**

నిజానికి ఈ ప్రశ్నల్లో కొన్నిటికి సమాధానాలు చెప్పవచ్చు, భిన్న కోణాలున్నాయని, సంక్లిష్టత ఉందని చూపవచ్చు. ప్రభుత్వ చిత్తశుద్ధిని చూపుకోవచ్చు. కాని పారదర్శకత ఎంత మాత్రం లేకపోవడం, ఏ ఒక్క ప్రశ్నకూ జవాబు ఇవ్వకపోవడం, దాటవేయడం, అడిగినవారిమీద దుర్భాషలాడడం చూస్తే ప్రాజెక్టు సంబద్ధత మీద మరిన్ని అనుమానాలు వస్తున్నాయి, వచ్చిన అనుమానాలు బలపడుతున్నాయి. రెండు సంవత్సరాలుగా జరుగుతున్న చర్చా క్రమంలో ప్రభుత్వం, దాన్ని సమర్థిస్తున్న మేధావులు ఎన్నో విషయాలు దాచిపెట్టారు, వక్రీకరించారు. అది నిజంగా ప్రజాప్రయోజనాలు సాధించే ప్రాజెక్టే అయితే అలా దాచిపెట్టనక్కరలేదు, వక్రీకరించనక్కరలేదు. అది నిజంగా ప్రజా ప్రయోజనకర ప్రాజెక్టే అయితే, పారదర్శకంగా ప్రభుత్వమే అన్ని వివరాలనూ ప్రజల ముందు పెట్టి, ప్రజలలో నీళ్ల సెంటిమెంట్ ఉన్నందువల్ల సులభంగా బైటపడగలిగి ఉండేదే.

కాని ప్రాజెక్టుకు మౌలిక పత్రం అయిన డిపిఆర్‌ను బైటపెట్టడానికే ప్రభుత్వం ఏడాదిన్నర తాత్సారం చేసింది. మొదట డిపిఆర్ లేనేలేదని చెప్పింది. డిపిఆర్ లేకపోతే ముఖ్యమంత్రి, మంత్రులు, శాసనసభ్యులు ప్రాజెక్టు వివరాలు, ఖర్చు వివరాలు, భూసేకరణ వివరాలు ఎలా ప్రకటిస్తున్నారని ప్రశ్నిస్తే, డిపిఆర్ ఉంది గాని అది బైటపెడితే పొరుగు రాష్ట్రం, ప్రాజెక్టు వ్యతిరేకులు దాన్ని ఆపడానికి కోర్టుకు వెళతారు గనుక దాన్ని బైటపెట్టడం లేదని బుకాయించింది.

ఒక ప్రజాస్వామికమని చెప్పుకునే దేశంలో ఇది పచ్చి వంచన. నిజానికి న్యాయస్థానాల సమీక్షలో కూడ నెగ్గగలిగేలా ప్రజాప్రయోజన పథకాలను తయారు చేయాలి గాని, అక్కడ నెగ్గబోమేమోనని ముందే అనుమానించడమంటే ఆ పథకం లోపభూయిష్టంగా తయారయిందని చెప్పకనే చెప్పినట్టవుతుంది. చివరికి సమాచార హక్కు చట్టం కింద డిపిఆర్ కోసం అడిగిప్పుడు తప్పనిస్థితిలోనే ప్రభుత్వం డిపిఆర్ ను బైటపెట్టింది.

ఒకవైపు డిపిఆర్ గురించి ఆ తాత్సారం చేస్తూనే ఈ ప్రాజెక్టుకు అవసరమైన భూసేకరణ పనులను మాత్రం ప్రభుత్వం ఆగమేఘాల మీద అమలు జరిపింది. 2013 భూసేకరణ చట్టాన్ని పక్కనపెట్టి ఒకదానిమీద ఒకటిగా మూడు జివోలు తెచ్చింది. ఆ తర్వాత ఒక కొత్త చట్టమే తెచ్చింది. ప్రాజెక్టు సంబద్ధత గురించీ, తమకు దక్కవలసిన హక్కుల గురించీ, న్యాయబద్ధమైన పరిహారం గురించీ ప్రశ్నిస్తున్న ముంపు బాధిత రైతాంగాన్ని, ప్రజలనుబెదిరింపులకు గురిచేసింది, వేధించింది, అబద్ధాలు ప్రచారం చేసింది.

మరొకవైపు తన విధానాలకూ, ఈ ప్రాజెక్టుకూ అనుకూల వాతావరణాన్ని సృష్టించుకోవడానికి పెద్ద ఎత్తున ప్రచారం ప్రారంభించింది. రాజకీయ సమీకరణాల్లో భారతీయ జనతా పార్టీకి అంటకాగుతూ, ప్రతి కీలక సందర్భంలోనూ మోడీ ప్రభుత్వానికి మద్దతు ఇస్తూ, అందుకు ప్రతిగా కేంద్ర ప్రభుత్వ సంస్థలన్నిటి నుంచీ ఈ అసంబద్ధ ప్రాజెక్టుకు అనుమతులు సంపాదించింది. రాష్ట్రంలోనూ దేశంలోనూ ప్రభావశీలమైన రచయితలనూ, మేధావులనూ, పాత్రికేయులనూ, రాజకీయనాయకులనూ సమీకరించి యాత్రలు నిర్వహిస్తూ, కాళేశ్వరం ప్రాజెక్టు నిర్మాణ స్థలాలను యాత్రా స్థలాలుగా మార్చి, వారిచేత అమాయకపు భ్రమలూ మిథ్యా ప్రచారాలూ సాగించింది.

ఒక నిర్మాణం దానికదిగా ఎంత అద్భుతంగా, సృజనాత్మకంగా, ఇంజనీరింగ్ నైపుణ్యంతో, భారీగా కనబడి కళ్లు మిరుమిట్లు గొలిపినా ఆ నిర్మాణపు నేపథ్యం, అది తయారవుతున్న తీరు, అందులో జరుగుతున్న మోసాలు, నిజంగా అది నెరవేర్చే ప్రయోజనాలు వంటి సమగ్ర దృక్పథంతో కాకుండా పైపై చూపులతో ఆకర్షణలకూ భ్రమలకూ లోనైన కొందరు అభిప్రాయ నిర్మాతలు ఈ దుర్మార్గమైన ప్రాజెక్టుకు ఆమోదముద్ర వేస్తూ వందలాది వ్యాసాలు రాశారు, లేదా ప్రభుత్వం వాళ్ల చేత రాయించింది. నిజానికి అది అంత గొప్ప ప్రాజెక్టే అయితే ఇంత ప్రశంస చేయించవలసిన అవసరమే లేదు. ఈ మితిమీరిన ప్రశంసలే అక్కడ ఏదో అనుమానాస్పదమైనది ఉందని తేటతెల్లం చేస్తున్నాయి.

**కర్తవ్యం ఏమిటి?**

కేంద్ర ప్రభుత్వ, చట్టబద్ధ సంస్థల అనుమతులు కూడ వచ్చి, ఇప్పటికే వేలాది కోట్ల రూపాయలు ఖర్చయి, నిర్మాణాలు వేగంగా సాగుతూ, దాదాపు పూర్తి కావస్తున్న సమయంలో, ప్రభుత్వం ఎందరో మేధావులను కొనేసి, బెదిరించి, భ్రమల్లో ముంచి అనుకూల రచనలు చేయిస్తున్న నేపథ్యంలో కాళేశ్వరం ప్రాజెక్టు గురించి తెలంగాణ సమాజం ఏం చేయగలుగుతుందనే ప్రశ్న చాలమంది ఆలోచనాపరులలో ఉంది. అటువంటి అనుమానం ఉన్నవారికి ఒక పాత మాటే గుర్తు చేయవలసి ఉంది. గెలిచినదంతా న్యాయం కాదు, న్యాయం ఎప్పుడూ గెలవాలని లేదు. కాళేశ్వరం ప్రాజెక్టు తెలంగాణ ప్రజల మీద, ప్రజా ధనం మీద జరుగుతున్న ఒక భారీ అన్యాయం, ఒక క్రూర పరిహాసం.

ఇప్పటికి ఈ అన్యాయమే గెలిచింది, గెలుస్తున్నది. అయినా అన్యాయాన్ని అన్యాయమని ఎత్తిచూపడం బుద్ధిజీవుల బాధ్యత. చరిత్రలో జరిగిన చాల అన్యాయాలను బుద్ధిజీవులు ఆపలేకపోయారు కాని అది అన్యాయమని ఎత్తి చూపినందువల్లనే చరిత్రలో వాళ్లు నిలిచిపోయారు. ఇవాళ కాళేశ్వరం ప్రాజెక్టు సందర్భంలో జరుగుతున్న అన్యాయంలో భాగమవుతారా, సమర్థకులవుతారా, ఆ అన్యాయాన్ని ఎత్తి చూపి తమ ప్రజానుకూల చైతన్యాన్ని, బుద్ధిజీవులుగా తమ సార్థకత్వాన్ని రుజువు చేసుకుంటారా అనే సవాల్ తెలంగాణ బుద్ధిజీవుల ముందు ఉంది.

*(రచయిత వీక్షణం సంపాదకుడు)* వీ

# రాపూరు దళితులకు అండగా ఉమ్మడి పోరాటం

***ఆత్మగౌరవాన్ని ప్రకటించిన దళితులపై పోలీసులు దాడి చేయడం వెనక పాలకులు, వారికి అండగా దేశ వనరులను కొల్లగొడుతున్న సామ్రాజ్యవాదులు ఉన్నారని, వారికి వ్యతిరేకంగా ప్రజాస్వామికవాదులు ఉమ్మడిగా ఉద్యమించాలని అంటున్నారు*** **దుడ్డు ప్రభాకర్**

తరతరాలు దళితులపై అగ్రకుల దురహంకారం, భూస్వామ్య శక్తులు సామాజిక దాడులు, గృహదహనాలు, అత్యాచారాలు, హత్యలకు పాల్పడుతున్నారు. ఆ నరమేధాలన్నింటిలో పాలకులు, కోర్టులు, చట్టాలు హంతక మూకలకు అండగా నిలబడ్డాయి. పోలీసులు పరోక్షంగా సహాయ సహకాలందించారు. ఇదే చరిత్ర. కానీ నెల్లూరు జిల్లా రాపూరులో పోలీసులు కొత్త అధ్యాయాన్ని లిఖించే సాహసానికి పూనుకున్నారు. రెండు మాల పల్లెలు, ఒక మాదిగ పల్లెపై మూడు వందల మందికి పైగా పోలీసులు ప్రత్యక్ష దాడికి పాల్పడ్డారు. గతంలో జరిగిన దాడులకు అగ్రకుల దురహంకార అధిపత్యపు స్వభావముంటే, రాపూరు పోలీసుల దాడివెనుక సామ్రాజ్యవాదుల ప్రయోజనాలు పరిరక్షించే అగ్రకుల, హిందూత్వ రాజకీయాధికార ఆధిపత్య కాంక్షవున్నది.

పారిశ్రామిక అభివృద్ధి పేరుతో నెల్లూరు జిల్లా సముద్రతీర ప్రాంతంలో పదుల సంఖ్యలో థర్మల్ పవర్ ప్లాంట్‌ల నిర్మాణం జరిగింది. అవి వెదజల్లే ధూళి వల్ల తీర ప్రాంత ప్రజలు అనారోగ్యం పాలవుతున్నారు. గాలి, నీరు కలుషితమై తీరప్రాంత ప్రజలు రకరకాల శ్వాసకోశ వ్యాదుల బారిన పడుతున్నారు. నిత్యం పారిశ్రామిక అభివృద్ధి జపం చేస్తూ ప్రజల్ని మభ్య పెడుతున్న చంద్రబాబు ప్రభుత్వం ఇంకా అనేక రసాయన పరిశ్రమ స్థాపనకు అనుమతి తెలిపింది. అందుకే ప్రభుత్వం నిర్వహించే గ్రామ సభల్ని అడ్డుకున్నారు. బలవంతంగా వందల మంది పోలీసులతో సభలు నిర్వహించిన అధికారులపై పోలీసుల సమక్షంలోనే దాడులు చేశారు. పోలీసుల లాఠీదెబ్బల రుచి చూశారు. గాలిలో కాల్పుల శబ్దాలు విన్నారు. కేసులు, కోర్టులు, జైల్లు, బెయిళ్లు అన్న అనుభవంలోకి వచ్చాయి. ప్రజల కొరకు ప్రజలచేత ఎన్నుకోబడినామని చెప్పుకుంటున్న పాలకులు బహుళజాతి కంపెనీల ప్రయోజనాలు నెరవేర్చడం కోసం ఈ దేశ ప్రజలపై తుపాకులెక్కుపెడుతున్నారు. సామ్రాజ్యవాదుల విస్తరణ వేగవంతమయ్యేకొద్దీ విస్థాపనకు గురయ్యే ప్రజలు మాత్రమేకాదు, స్వచ్ఛమైన గాలి, పరిశుభ్రమైన తాగునీరు కోరుకునే ప్రజలందరూ ఉద్యమించాల్సిన స్థితికి నెట్టివేయబడుతున్నారు. ఒక అనివార్య పరిస్థితుల్లో జీవన్మరణ పోరాటాలకు సిద్ధపడుతున్న ప్రజలను సాయుధంగా అణచివేయడమే ఏకైక మార్గంగా పాలకులు ఎన్నుకున్నారు. అందులో భాగంగానే ప్రకాశం జిల్లా చినగంజాం, విశాఖ జిల్లా గంగవరం, శ్రీకాకుళం జిల్లా సోంపేట, కాకరాపల్లి, తమిళనాడులోని తూత్తుకుడి ఘటనలు జరిగాయి. రాజ్యం తన వైఖరిని ఇంకా స్పష్టంగా తెలియజేయడానికి ముందస్తు హెచ్చరికగా నెల్లూరు పశ్చిమ ప్రాంతంలోని దళితుల్ని టార్గెట్ చేశారనిపిస్తుంది. కాకుంటే ఒక కులానికి చెందిన ఇద్దరు వ్యక్తులకు సంబంధించి కేవలం రెండు వేల రూపాయలకు చెందిన బాకీ వసూలుకు పోలీసులు ఇంత సీన్ క్రియేట్ చేయాల్సిన అవసరం లేదు. పోలీసులు చెపుతున్నట్లు మాలలు పోలీసులపై తిరగబడి హత్యకు ప్రయత్నిస్తే ఇద్దరు మాదిగ యువకులపై ఒక కుమ్మరి, ఒక ముస్లిం యువకునిపై హత్యా ప్రయత్నం కేసులు పెట్టినందుకు చిత్రహింసలకు గురిచేసినట్లు. ఈ పరిణామాలన్ని నెల్లూరు జిల్లాలో అనేక తూత్తుకుడిలు జరగనున్నాయా? అని ప్రజల్ని ప్రజాస్వామిక వాదుల్ని ఆందోళనకు గురిచేస్తున్నాయి.

**రాపూరులో జరిగిందేమిటి?**

మండల కేంద్రమైన రాపూరులో మూడు దళిత వాడలున్నాయి. పాత మాల వాడలో 150, కొత్త మాల వాడలో, మాదిగ వాడలో 120 కుటుంబాలు జీవిస్తున్నాయి. మూడు నెలల క్రితం కొత్త మాలవాడకు చెందిన పక్కపక్క ఇళ్లకు చెందిన పంతిగాని వరలక్ష్మి (భర్త మధు) మేరిగ సుభాషిణి (భర్త యేసురత్నం)కి 5 అడుగుల స్థలం విషయంలో జరిగిన ఘర్షణలో సుభాషిణి చిటికెన వేలు బెణికి వాసింది. సుభాషిణి వరలక్ష్మిపై, ఆమె భర్తపై స్టేషన్‌లో రిపోర్టు చేసింది. ఎస్.ఐ. లక్ష్మణరావు వరలక్ష్మిని, ఆమె భర్త మధును స్టేషన్‌కు పిలిపించి కొట్టాడు. అడ్డం వెళ్లిన వరలక్ష్మినీ కొట్టాడు. దాంతో వరలక్ష్మి, తన భర్త, బంధువుల సలహామేరకు వెంకటగిరి మెజిస్ట్రేట్‌కు ఫిర్యాదు చేసింది. ఈ కేసును దర్యాప్తుచేసి వివరాలు పంపించమని కోర్టు గూడూరు సిఐని ఆదేశించింది. అయినప్పటికీ సి.ఐ. దర్యాప్తు చెయ్యలేదు. తనకు న్యాయం జరగలేదని 2018 జూలై 27న వరలక్ష్మి జిల్లా ఉన్నతాధికారులకు రిజిస్టర్ పోస్టు ద్వారా ఫిర్యాదు చేసింది. ఇది ఇలా ఉండగా అదే మాల వాడకు చెందిన యోసేబుకి మూడు మూడపోతల సుబ్బరాయుడు రు. 2000 ఇవ్వాలి. ప్రామిసరీ నోటు కూడా ఉంది. యేసేబు సుబ్బరాయుడ్ని డబ్బులడిగే సందర్భంలో ఇద్దరూ అడ్డుకున్నారు. అంతట యేసేబు సుబ్బరాయుడు, అతని సోదరుడు పిచ్చయ్యపై స్టేషన్‌లో రిపోర్టు చేశాడు. పిచ్చయ్య, సుబ్బరాయుడులు వరలక్ష్మికి బంధువులు. వరలక్ష్మి తనమీద పై అధికారులకు ఫిర్యాదు చేయడానికి వీళ్లే కారణమని అప్పటికి కొందరు ఎస్.ఐ.కి ఉప్పందించారు. ఇదే అదనుగా భావించిన ఎస్.ఐ. లక్ష్మణరావు రెండు కేసులకు సంబంధించిన ఇరు వర్గాలను 2018, ఆగస్టు 1న స్టేషన్‌కు పిలిపించాడు. "అవతలి వారి దగ్గర డబ్బులు తీసుకొని పోలీసులు మమ్మల్ని, మా ఆడాళ్లని స్టేషన్ చుట్టూ తిప్పుచున్నార"ని పిచ్చయ్య పక్క వారితో తిడుతూ చెపుతున్న దాన్ని సురేష్ అనే కానిస్టేబుల్

విన్నాడు. ఎవడినిరా నీవు తిట్టేది అని పిచ్చయ్యపై చేయిచేసుకున్నాడు. దాంతో ఎస్.ఐ., ఎస్.ఐ. రూంలో ఉన్నవారు బయటికి వచ్చారు. విషయం తెలుసుకున్న ఎస్.ఐ. కూడా పిచ్చయ్యను కొట్టాడు. ఆయన భార్య రాములమ్మ అడ్డం వెళ్లింది. ఆమెను పొత్తి కడుపు మీద తన్నగా స్పృహ కోల్పోయి కింద పడిపోయింది. చనిపోయిందనుకున్న భర్త పిచ్చయ్య తన బంధువులకు ఫోన్ చేయగా మరో తొమ్మిది మంది స్టేషన్‌కు వచ్చారు. అందరూ కలిసి పోలీసులపై తిరగబడ్డారు. ఇరువర్గాలకు గాయాలయ్యాయి. అయితే పోలీసులకు కనిపించే రక్తగాయాలయ్యాయి. పోలీసులు మాత్రం వ్యూహాత్మకంగా రక్తం కనిపించకుండా కొట్టారు. ఇవీ మా నిజనిర్ధారణలో తేలిన నిజాలు. ఇంకా స్పష్టంగా నిజాలు బయటకు రావాలంటే స్టేషన్‌లోని సి.సి. కెమెరాలో రికార్డయిన ఫుటేజీని బయటపెట్టాలి. పోలీసులు దళితులపై చేసిన దాడి దృశ్యాలను చూపకుండా, దళితులు పోలీసులపై చేసిన ప్రతిఘటనను మాత్రమే మీడియాకు రిలీజ్ చేసి పోలీసులు ప్రజల్ని తప్పుదారి పట్టిస్తున్నారు.

**దళితుల ప్రతిఘటనకు కారణాలు**

సాధారణంగా సామాన్య ప్రజలకు పోలీసులంటే భయమనేది జగమెరిగిన సత్యం. లాఠీ చార్జీలు, పోలీసు స్టేషన్‌లలో చిత్రహింసలు, లాకప్ హత్యలు నిత్యం మీడియా ద్వారా చూస్తున్న ప్రజలు పోలీసులంటే వణికిపోతున్నారు. స్టేషన్‌కు పిలిపించడమంటే అదొక అవమానకర విషయంగా భావిస్తారు. ఈ నేపథ్యంలో గ్రామీణ ప్రాంతానికి చెందిన కూలీనాలి చేసుకొని బతికే ఏ రాజకీయ పార్టీ అండదండలూ లేని అంటరాని కులానికి చెందిన నిరక్షరాస్యులైన నిర్భాగ్యులు పోలీసుల వైపు నుండి ఎలాంటి చర్యలు లేకుండా ఎస్.ఐ. మీద స్టేషన్‌లోనే దాడికి పూనుకోవడం అసాధ్యమైన విషయం. ఇలాంటి దృశ్యాలు సినిమాలలో, టి.వి. సీరియల్స్‌లో కూడా ఎవ్వరూ చూసి ఉండరు. ఎస్.ఐ. లక్ష్మణ్‌రావు ప్రజల సొమ్ము జీతంగా తీసుకుంటున్న ప్రజా సేవకుడనే విషయం మరచిపోయి రాపూరులో విధులు నిర్వహిస్తున్నాడు. (మెజారిటీ ఆ వైఖరితోనే ఉన్నారు) కుటుంబ సంబంధాలలో జోక్యం చేసుకోవడం, భూ వివాదాల్లో తల దూర్చడం, స్టేషన్‌కి పిలిపించి దుర్భాషలాడి బెదిరించడం లాంటివి ఆయన దిన చర్యల్లో భాగంగా ఉంటాయి. పొట్ట చేతపట్టుకొని రాజస్థాన్ నుండి రాపూర్ వచ్చి టీ కొట్టు పెట్టుకొని బతుకుతున్న చాయ్‌వాలాని స్టేషన్ టీ ఇవ్వలేదని కొడితే కోమాలోకి వెళ్లి కొన్ని రోజుల తరువాత బతికి బయటపడ్డాడు. ఇది ఎస్.ఐ. వికృత చేష్టలకు పరాకాష్ట. కేవలం పోలీసులంటే భయంతోనే రాపూరు ప్రజలు ఎస్.ఐ. అరాచకాలపై ఉన్నతాధికారులకు ఫిర్యాదు చెయ్యలేదు. కానీ వరలక్ష్మి ఫిర్యాదు చేసింది. "ఒక అంటరాని కులానికి చెందిన వ్యక్తి, అందునా ఆడది, నా మీద కోర్టులో, పై అధికారులకు ఫిర్యాదు చేసి ఎంక్వయిరీ చేయిస్తుందా" అనే అక్కసుతో వరలక్ష్మిపై, ఆమెకు అండగావున్న బంధువులపై కక్షతీర్చుకునే క్రమంలోనే 2018 ఆగస్టు 1న పోలీసుల దాడి జరిగింది. వరలక్ష్మి ఫిర్యాదు చేసినప్పుడే పై అధికారులు జోక్యం చేసుకొని ఎస్.ఐ.ని మందలించి శాఖాపరమైన చర్యలు తీసుకొనుంటే పరిస్థితి ఇంతవరకు వచ్చేది కాదు. పోలీసులు ఏంచేసినా ప్రజలు భరించాలి. లాఠీచార్జీ చేస్తే మౌనంగా వెళ్లిపోవాలి. స్టేషన్‌లో చిత్రహింసలు పెడితే కిమ్మనకుండా సహించాలి. లాకప్ హత్య జరిగితే రోదిస్తూ శవాన్ని తీసుకువెళ్లి ఖననం చేసుకోవాలి. అదికదా జరగాల్సింది. కాని అందుకు భిన్నంగా రాపూరులో దళితులు తిరగబడ్డారు. దాన్ని పోలీసు అధికారులు సహించలేకపోయారు. "పూటకు గతిలేని మాలలు స్టేషన్‌లో పోలీసులనే కొడతారా? మన ప్రతిష్ట ఏంకావాలి? అనుకున్నారో ఏమోగాని రెండు బెటాలియన్ల అదనపు బలగాలను రాపూరులో దింపారు. గూడూరు డి.ఎస్.పి. ఆధ్వర్యంలో నలుగురు సి.ఐ.లు, పది మంది ఎస్.ఐ.లు వందలాది మంది పోలీసులు మూడు పల్లెలు (రెండు మాల, ఒక మాదిగ) పై విరుచుకపడ్డారు. ఇల్లిల్లూ గాలించి దొరికిన వాళ్లను దొరికినట్లు కొట్టారు. అరెస్ట్ చేశారు. చిత్రహింసలు పెట్టారు. దాడి జరిగిన 15 రోజుల తర్వాత గూడూరు, నెల్లూరు జైలులోవున్న వారిని సందర్శించిన వారికి వారి శరీరాలపై నల్లగా కమిలి కదుములుగట్టిన గాయాలు స్పష్టంగా కనబడుతున్నాయి. దాడికి పాల్పడిన వారిని మాత్రమే అరెస్టు చెయ్యాలనుకుంటే స్టేషన్‌లోని సి.సి. కెమెరాల ఆధారంగా అరెస్టు చేయవచ్చు. స్టేషన్‌లోవున్న ప్రత్యర్థి వర్గానికి చెందిన దళితుల్ని అడిగి తెలుసుకోవచ్చు. అలా చెయ్యడానికి దాడికి పాల్పడిన వాళ్లు అధికార పార్టీకి చెందిన దళితుల్ని కమ్మ సామాజిక వర్గానికి సంబంధించినవారు కాదు. ప్రతిపక్షమైన రెడ్డి సామాజిక వర్గానికి చెందిన వారూకాదు. ఒక రైలులోని మొత్తం 20 బోగీలను బుగ్గిచేసి తుని పోలీస్ స్టేషన్ మీద దాడిచేసి, పోలీస్ వాహనాల్ని ధ్వంసంచేసి, ఫైళ్లను తగలబెట్టి, పోలీసుల్ని తరిమితరిమి కొట్టిన రాజ్యాధికారం కోసం పాకులాడుతున్న కాపులూ కాదు. వారు కూటికి గతిలేని, కూలిచేసుకొని బతికే మాలలు. అందుకే వారిని టెర్రర్ చెయ్యడం ద్వారా పోలీసులంటే ఏంటో, పోలీసులకు ఎదురు తిరిగితే ఏమౌతుందో సమాజానికి తెలియజెప్పాలనుకున్నారు. అందులో భాగంగానే 4,5 కుటుంబాలకు చెందిన వ్యక్తులు పాల్గొన్న ఘటనకు 500 మంది కుటుంబాల దళితుల్ని బాధ్యుల్ని చేస్తూ భయానక వాతావరణం సృష్టించారు.

**ఇది ముమ్మాటికీ అగ్రకుల దురహంకార చర్యే**

మన రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నియోజకవర్గంలోని పదిరికుప్పం, కారంచేడు, నీరుకొండ, వేంపెంట, లక్షింపేట ఇంకా దేశవ్యాపితంగా అనేక రాష్ట్రాలలో జరిగిన దాడులన్నీ అగ్రకులోన్మాద దాడులే. ఎవరో ఒక్కరో, ఇద్దరో దళితులు ఆత్మగౌరవాన్ని ప్రకటించినందుకు, అంటరానితనాన్ని, అణచివేతను ప్రశ్నించినందుకు, అగ్రకులాధిపత్యాన్ని ధిక్కరించినందుకు పల్లెల్లోని దళితులందర్నీ టార్గెట్‌చేసి వెంటాడి, వేటాడి ఎవరు చిక్కితే వాళ్లను నరికిచంపారు. మహిళలపై సామూహిక అత్యాచారాలు చేశారు. పల్లెల్ని తగులబెట్టి వల్లకాడు చేశారు. రాపూరులో పోలీసు చర్యకూడా అలాంటిదే. కేవలం 5 కుంటుంబాలు చేసిన ప్రతిఘటనను సాకుగా చూపి మూడు పల్లెలపై 300 మందికి పైగా పోలీసులు దాడిచెయ్యడం చట్టవ్యతిరేక అగ్రకుల దురహంకార చర్యే. అందుకే దాడికి నాయకత్వం వహించిన గూడూరు డి.ఎస్.పి.పై కూడా ఎస్.సి, ఎస్.టి. చట్టం కింద కేసు నమోదుచేసి అరెస్టు చెయ్యాలని రాపూరు దళితుల ఆత్మగౌరవ పరిరక్షణ కమిటీ డిమాండ్ చేస్తుంది.

ఈ దేశంలోని విచిత్రమైన స్థితి ఏమిటంటే వెలివాడల్లో నివసించే ప్రజలు వారిపై అమలౌతున్న వివక్ష, అణచివేతకు వ్యతిరేకంగా

పోరాడడాన్ని వారి అస్తిత్వం కోసం జరుగుతున్న పోరాటంగా ప్రచారం చేయబడుతుంది. అగ్రకులాధిపత్యాన్ని ధిక్కరించడమంటే సామ్రాజ్యవాదులకు కొమ్ముకాస్తున్న పాలకవర్గాలను ప్రశ్నించడం, కులం పునాదులపై నిర్మితమై బలోపేతమౌతూ ప్రజల్ని శత్రుశిబిరాలుగా చీలుస్తున్న హిందుత్వను సవాల్ చెయ్యడం. పీడక వర్గాలైన అగ్రకుల భూస్వాములు, పాలకులు, హిందూ మతోన్మాదుల ఉమ్మడి కార్యక్రమం పీడిత ప్రజల్ని మరింత అణచివేతకు గురిచేసి దోచుకోవడమే. దళితుల విషయంలో అగ్రకుల భూస్వాములుగా అణచివేస్తారు. ముస్లిం, క్రైస్తవులపై హిందూ మతోన్మాదులు హత్యాకాండలు కొనసాగిస్తారు. ఆదివాసులపై వనరుల దోపిడీకోసం సామ్రాజ్యవాదులు నరమేధాలు సృష్టిస్తుంటారు. వీళ్లందర్నీ కాపాడడానికి పాలకవర్గాలు కృషిచేస్తాయి. ఇవన్నీ దోపిడీ వర్గానికున్న పలుముఖాలు.

ఈ దేశ అసమాన సమాజ నిచ్చెనమెట్ల కులవ్యవస్థకు వ్యతిరేకంగా దళితులు చేస్తున్న పోరాటాలు వారి అస్తిత్వం కోసం చేస్తున్న పోరాటాలుగా వక్రీకరించబడుతున్న కారణంగా నేటికీ దళితులు ఒంటరి పోరాటం చేస్తున్నారు. శ్రీకాకుళం జిల్లా లక్ష్మింపేట దళితుల హత్యల నుండి దళితులు ఒంటరులు కాదని వారికి అండగా ఎస్.సి, ఎస్.టి, బి.సి మైనారిటీలలోని అభ్యుదయ శక్తులు వామపక్ష, కార్మిక మహిళా, హక్కుల సంఘాలు ఐక్యకార్యచరణ కమిటీగా ఏర్పడి ఉద్యమిస్తూ ఉన్నారు. ఆ పోరాట కొనసాగింపులో భాగంగా రాపూరు దళితుల ఆత్మగౌరవ పరిరక్షణ కమిటీ ఏర్పడింది.

**ప్రజా సంఘాలు కోరుతున్నదేమిటి? పోలీసులు చేస్తున్నదేమిటి?**

దళితులు రాపూరు పోలీస్ స్టేషన్‌పై దాడిచేసి పోలీసుల్ని గాయపరిచారన్న వార్త మీడియా ద్వారా రాష్ట్రంలో సంచలనం సృష్టించింది. ఏం జరిగిందో తెలుసుకుందామని మొదటిగా పౌరహక్కుల సంఘం, ఒ.పి.డి.ఆర్. తర్వాత దళిత, ప్రజాసంఘాలు, మహిళా సంఘాలు, వివిధ రాజకీయ పార్టీల ప్రతినిధులు, జాతీయ ఎస్.సి, ఎస్.టి కమిషన్ సభ్యులు రాపూరు సందర్శించారు. 2018, ఆగస్టు 1 నాటి ఘర్షణ, దానికి దారితీసిన కారణాలు, అనంతరం పోలీసుల చర్యల గురించి ప్రజల్ని అడిగి తెలుసుకున్నారు. రాపూరు సందర్శించిన ప్రతి ఒక్కరూ గ్రామంలో జరిగిన, జరుగుతున్న చట్ట ఉల్లంఘనా కార్యక్రమాలను ఎత్తి చూపారు. రాపూరు ఎస్.ఐ. చట్ట విరుద్ధంగా స్టేషన్‌లోనే సివిల్ సంచాయతీలు చేయడాన్ని తప్పుబట్టారు. ఎస్.ఐ. లక్ష్మణ్‌రావుపై వరలక్ష్మి చేసిన ఫిర్యాదును గానీ, కోర్టు ఆదేశాలను గానీ అధికారులు ఎందుకు పట్టించుకోలేదని నిలదీశారు. కేసుకు ఏమాత్రం సంబంధంలేని అమాయకులైన డిగ్రీలు చదివిన మాల యువకులపై, ఇద్దరు మాదిగలపై, ఒక కుమ్మరి కులానికి చెందిన వ్యక్తిపై, ఒక ముస్లిం వ్యక్తిపై క్రిమినల్ కేసులు పెట్టడంలో పోలీసుల ఉద్దేశమేమిటని ప్రశ్నించారు. ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పి, చట్టానికి లోబడి పనిచేస్తున్నామని ప్రజలకు నమ్మకం కలిగించాల్సిన పోలీసులు అందుకు భిన్నంగా కొందరికి కూలిచ్చి రాపూరు దళితులకు వ్యతిరేకంగా ధర్నాలు చేయిస్తున్నారు. పోలీస్ స్టేషనంటే ఒక దేవాలయమని, అందులోని ఎస్.ఐ. ఒక దేవుడని అలాంటి దేవుడ్నే కొడితే ఇక ప్రజలకు దిక్కేదని మీడియాలో చెప్పిస్తున్నారు. పోలీసు అధికారుల సంఘం అయితే పోలీసుల అప్రజాస్వామిక వైఖరిని వ్యతిరేకించిన వాళ్లను ఏకంగా హెచ్చరిస్తున్నారు. ఇప్పటిదాకా నక్సలైట్లు చనిపోయినపుడు న్యాయ విచారణకు డిమాండ్ చేసిన హక్కుల సంఘాల నాయకులకు వ్యతిరేకంగా ధర్నాలు చేయించారు. నక్సలైట్ల శవాల ఊరేగింపు సమయాలలో కౌంటర్ ర్యాలీలు చేయించారు. మావి ప్రాణాలు కాదా?, పోలీసులకు హక్కులుండవా? అనే నినాదాలు చేయించారు. అలాంటి కౌంటర్ కార్యక్రమాలు ఇప్పుడు దళితులపై దాడులు చేస్తున్నారు. అందరూ మనుషులే. అందరికీ హక్కులుంటాయి. పోలీసులైనా, నక్సలైట్లయినా, దళితులైనా, మహిళలైనా, ముస్లింలైనా, క్రైస్తవులైనా! చట్టం అందరికీ ఒకేలా అమలయ్యేటట్లు చూడాలి. అందుకే పోలీసులతో సహా చట్టానికి ఎవ్వరూ అతీతులు కాదని తెలియజేస్తున్నాం. శేషాచలం అడవుల్లో 20 మంది నిరాయుధులైన ఎర్రచందనం కూలీలను నిర్దాక్షిణ్యంగా కాల్చివేసిన ప్రభుత్వానికి తెలియచెయ్యడం. అది అమలుచేస్తుందనుకోవడం అత్యాశే కావచ్చు. కానీ పోలీసులు ప్రజల మధ్య విద్వేషాలు రెచ్చగొట్టేలా శాంతి భద్రతలకు విఘాతం కల్గిస్తూ, కౌంటర్ ప్రోగ్రాములు చేయిస్తూ ఉద్రిక్త పరిస్థితులు సృష్టిస్తున్నారు. వారి చట్టవ్యతిరేక చర్యలకు ప్రజామోదం ఉన్నట్లు ప్రజల్ని నమ్మించే జిమ్మిక్కులు చేస్తున్నారు. ఈ వైఖరి ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేసేదిగా ఉంది.

**రాజకీయ నాయకుల గారడీలు**

ఈ దేశంలోని అగ్రకుల భూస్వామ్య శక్తులు, పెట్టుబడిదారుల, హిందూ మతోన్మాదులు, పాలకుల దోపిడీ తీవ్రతరమవుతున్న దశలో ఈ దోపిడీ పీడనలకు వ్యతిరేకంగా పోరాడే ప్రజలను సాయుధంగా అణచి ఉంచడానికి ఈ దేశ దళారీ పాలక వర్గాలు ప్రయత్నాలు ముమ్మరం చేస్తున్నాయి. అడవి నుండి ఆదివాసుల్ని తరిమేస్తున్నారు. ఎస్.సి, ఎస్.టి అత్యాచారాల నిరోధక చట్టాన్ని నిర్జీవం చేస్తూ సుప్రీంకోర్టు తీర్పు వెలువడేలా కోర్టులను ప్రభావితం చేశారు. అందుకు ఎస్.సి, ఎస్.టి.లు నిరసన వ్యక్తంచేస్తే ఖాకీ దళాలు, కాషాయ దళాలు నిర్దాక్షిణ్యంగా 13 మందిని కాల్చిచంపాయి. గోరక్షక దళాల పేరుతో దళితుల్ని, ముస్లింలను టార్గెట్ చేసి నిర్దాక్షిణ్యంగా రాళ్లతో కొట్టి చంపుతున్నారు. కులాంతర, మతాంతర వివాహాలు చేసుకున్న దళితుల్ని, ముస్లింలను బహిరంగంగానే 'లవ్‌జిహాద్' పేరుతో హత్యలు చేస్తున్నారు. ఈ హత్యాకాండలను దిగ్విజయంగా నిర్వహించడానికి దేశవ్యాప్తంగా అనేక రాష్ట్రాలలో సాయుధ శిక్షణా శిబిరాలు ఏర్పాటుచేసి కరడుకట్టిన ఉన్మాదపు గుంపును తయారు చేస్తున్నారు. ఆ గుంపు పథకం ప్రకారం కల్బుర్గి, పన్సారే, దబోల్కర్, గౌరీలంకేశ్ లాంటి అభ్యుదయ వాదుల్ని హత్యలు చేస్తున్నారు. రోహిత్ వేముల, ఉమర్ ఖలీద్, దళిత, ముస్లిం విద్యార్థుల ప్రత్యక్ష, పరోక్ష హత్యలకు తెగబడుతున్నారు. ఈ నేపథ్యంలో ప్రతిఘటనా పోరాటాల ద్వారా మాత్రమే మన మాన ప్రాణాలు రక్షించుకోగలుగుతాం అని పిలుపునిచ్చిన భీమ్ ఆర్మీ నాయకుడు చంద్రశేఖర్ అజాద్ రావణ్‌పై దేశద్రోహ నేరంమోపి సంవత్సర కాలంగా జైలులో నిర్బంధించారు. అనివార్య పరిస్థితుల్లో జీవన్మరణ పోరాటాలకు సిద్ధపడుతున్న దళితుల్లోని ప్రతిఘటనా శక్తిని దారి మళ్లించడానికి పాలకులు అనేక కుయుక్తులు పన్నుతున్నారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు దళితుల్లో, బిసిల్లో, ఆదివాసులలో కొందరిని ఉద్యమకారులుగా ప్రమోట్ చేస్తూ ఆయా కులాల ప్రజల ముందు నిలబెడుతున్నాడు. మీడియా కూడా అలాంటి వారికే విస్తృత ప్రచారాన్ని కల్పించింది. దళితులపై అగ్రకుల దాడులు జరిగిన ప్రతి సందర్భంలో ముందుగా గ్రామాన్ని పోలీసులు చుట్టుముడతారు. బాధితులైన దళితుల్ని ఎవ్వరూ పరామర్శించడానికి వీలులేదని ఆంక్షలు విధిస్తారు. పాలకులు ఏర్పాటు చేసిన దళారీదండుకు మాత్రమే పరామర్శించే అవకాశం కల్పిస్తారు. వాళ్లు అత్యంత నాటకీయంగా దళితులపై వల్లమాలిన ప్రేమ ఒలకబోయడమే కాకుండా పోలీసులపై విరుచుకపడతారు. 24 గంటలలో నిందితుల్ని అరెస్ట్ చెయ్యకపోతే పోలీసుల అంతు చూస్తామని బెదిరిస్తారు. ఈ దళారీ దళిత నాయకుల మాటలు నిజమని నమ్మి దళితులు మళ్లీ, మళ్లీ మోసపోతున్నారు. ఉద్యమాలకు దూరమవుతున్నారు. "కాపూరు" సందర్భంగా, దళిత ఎన్.జి.ఓలు, పాలక వర్గాలకు పాదసేవచేసే దళారీ మాజీ బ్యూరోక్రాట్స్ ఇప్పటిదాకా దళితులకు మద్దతుగా ఉన్నట్లు నటిస్తున్న నాటకాలకు తెరదించి నగ్నంగా పాలక వర్గాల పల్లకీ మోస్తున్నారు.

పశ్చిమగోదావరి జిల్లా పెదగొట్టిపాడులో జరిగినట్లే నెల్లూరు జిల్లా రాపూరులో కూడా జరిగింది. అధికార పార్టీకి చెందిన దళిత నాయకులు ఎస్.సి. కార్పొరేషన్ చైర్మన్ జూపూడి ప్రభాకర్‌రావు బిజెపి ఏజెంటైన ఎస్.సి., ఎస్.టి. జాతీయ కమిషన్ సభ్యులు రాములు రాపూరును సందర్శించి పోలీసు అధికారులను తీవ్రంగా హెచ్చరించారు. ఇలాంటి దళారీ సెక్షన్ దళిత ప్రజానీకంలో పాలక వర్గాల పట్ల పదేపదే విశ్వాసాన్ని కలిగించే పాత్ర నిర్వహిస్తున్నాయి. తమ ఆర్థిక, రాజకీయ ప్రయోజనాలు నెరవేర్చడానికి డా. బి.ఆర్. అంబేద్కర్ భావజాలం పేరుతో పాలకవర్గ భావజాలాన్ని వ్యాప్తి చేస్తున్నారు. నేడు జై భీమ్ అనే నినాదాన్ని దళితుల్ని మభ్యపెట్టే ఒక బలమైన ఆయుధంగా పాలకవర్గాలు ఉపయోగించు కుంటున్నాయి. పాలకవర్గ పార్టీల పంచన పడిగాపులు కాచే దళిత దళారీలు వారి ప్రాబల్యం తగ్గకుండా ఉండడం కోసం దళితుల్ని ఇతర పీడిత కులాల ప్రజలతో కలవనీయకుండా తమకు, తమ పార్టీకి అనుచరులుగా ఉంచుకుంటున్నారు. ఇతర బి.సి. కులాలకు చెందిన నాయకులు కూడా ఇదే వైఖరితో ఉన్నారు. ప్రతి గ్రామంలో ఇలాంటి నాయకుల్ని పాలక వర్గ పార్టీలు పనిగట్టుకొని ప్రోత్సహిస్తున్నాయి. ఈ పరిస్థితిని నిజమైన దళిత, బహుజన ఉద్యమ శక్తులు ఒక సవాల్‌గా స్వీకరించాల్సి ఉంది. అప్పుడు మాత్రమే ఎస్.సి, ఎస్.టి, బి.సి, మైనారిటీ ప్రజల ఆకాంక్షల్ని ముందుకు తీసుకవెళ్లిన వారమౌతాం. దళితుల ఆత్మగౌరవ ప్రతిఘటనా పోరాటాలకు అండగా నిలబడిన వారమౌతాం.

**రాపూరు ఘటన దళితులకు ఒక హెచ్చరిక**

రాబోయే రోజుల్లో దళితులు, పీడిత కులాల ప్రజల పట్ల పాలకులు ఏ వైఖరితో ఉండబోతున్నారో రాపూరు ద్వారా స్పష్టం చేశారు. పారిశ్రామికాభివృద్ధి పేరుతో జరుగుతున్న విధ్వంసంతో ప్రకృతి వనరులు, సహజ సంపదే జీవనాధారంగా జతికే ఆదివాసులు, దళితులు, మత్స్యకారులు బతుకుదెరువు, నివాసాలు కోల్పోతున్నారు. ఇప్పటికే వివిధ ఉత్పత్తి కులాల ప్రజలు రోడ్డున పడ్డారు. సామ్రాజ్యవాదుల ఎజెండా అమలు కావాలంటే వనరుల దోపిడీకి ఆటంకంలేని చట్టాలు చేసే పాలకులు కావాలి. ఆ చట్టాలను వ్యతిరేకించే ప్రజలను నిర్దాక్షిణ్యంగా అణచివేసే సాయుధ బలగాలు కావాలి. పీడకులు అందరు కలిసి చేస్తున్న ఈ దోపిడీ, అణచివేతలలో ఎవరికి వారు ఒకరికొకరు సంబంధం లేనట్లు వ్యవహరిస్తూ ఉంటారు. అన్నిటికీ ప్రజల్నే బాధ్యుల్ని చేస్తూ మీడియా ద్వారా ప్రచారం చేస్తున్నారు.

అడవుల్ని ధ్వంసం చేస్తున్న వారే హరితహారం పేరుతో మనిషికి ఒక మొక్క నాటి వాతావరణాన్ని, పర్యావరణాన్ని కాపాడుకుందాం అంటారు. విషవాయువుల్ని వెదజల్లే పరిశ్రమల్ని స్థాపించారు. విషవాయువుల్ని వెదజల్లే ఫ్యాక్టరీలను మూసివేయమంటే కాల్చి చంపుతారు. శుభ్రత పాటించండని స్వచ్ఛభారత్ కార్యక్రమాన్ని రూపొందిస్తారు. వృత్తుల్ని ధ్వంసం చేసి జాతీయ ఉపాధి హామీ పథకం ద్వారా పని కల్పిస్తారు. ప్రభుత్వ ఆసుపత్రులను కనుమరుగుచేసి కార్పొరేట్ వైద్యం అందిస్తున్నామంటారు. బడులు, హాస్టల్స్ ఎత్తేసి విదేశీ చదువు లంటారు. కూటికి, కూలికి దూరం చేసి రూపాయికి కిలో బియ్యం అంటారు. ఆకలికి మాడ్చి అన్నా క్యాంటిన్లు తెరుస్తారు. ప్రజల కష్ట నష్టాలకు కారణం కర్మఫలమేనంటారు. యజ్ఞాలు, యాగాలు, పుష్కరాలను వేలకోట్ల ప్రజాధనం ఖర్చుపెట్టి నిర్వహిస్తారు. హిందూ మత భావజాలాన్ని రేకెత్తిస్తారు. ఉన్మాదాన్ని రెచ్చకొడతారు. ప్రజల మధ్య విద్వేశాలు రెచ్చగొట్టి రక్తపాతాలు సృష్టిస్తారు. అందులో ఓట్లను ఏరుకొని మళ్లీ అధికారంలోకి వస్తారు. మరోవైపు పోలీసులు, కోర్టులు, చట్టాలను ఉపయోగించుకొని అరెస్టులు చేసి జీవితకాలం జైళ్లలో నిర్బంధిస్తారు. ఇదీ జరిగిన, జరుగుతున్న, జరగబోయే చరిత్ర.

**మన కర్తవ్యం**

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిందని 71 ఏళ్లుగా వేడుకలు జరుపుకుంటున్నాం. నిన్నగాక మొన్న చంద్రబాబు నాయుడు దళితతేజం-తెలుగుదేశం కార్యక్రమాన్ని నెల్లూరు జిల్లాలోనే అట్టహాసంగా ముగించారు. ఆ సభలో రాష్ట్రంలోని దళితులు వెలిగిపోతున్నారని పచ్చనాయకులందరూ జబ్బలు చరుసుకున్నారు. కానీ క్షేత్రస్థాయిలో పరిస్థితులు ఇందుకు పూర్తి భిన్నంగా ఉన్నాయి. దళితులు ఈ రాష్ట్రంలో రెండవ తరగతి పౌరులుగా, పశువులకంటే హీనంగా జీవనం సాగిస్తున్నారనడానికి రాజ్యమే ప్రత్యక్ష దాడులకు తెగబడిన రాపూర్ సంఘటనే తాజా ఉదాహరణ.

దళితుల్ని తేజోవంతం చేయకపోయినా పర్వాలేదు. దళితులుగా పుట్టాలని ఎవ్వరూ కోరుకోకపోయినా పర్వాలేదు. కానీ వేల సంవత్సరాలుగా ఈ దేశంలో నిచ్చెన మెట్ల కుల వ్యవస్థకు వ్యతిరేకంగా, హిందూ మతోన్మాదానికి, అగ్రకుల భూస్వామ్య పాలకవర్గాలకు వ్యతిరేకంగా వీరోచితంగా పోరాడుతున్న కులంలో పుట్టినందుకు దళితులు గర్వపడుతున్నారు. వారూ ఈ దేశ పౌరులు కాబట్టి చట్టాలు వారికి వర్తింపచేయాలని డిమాండ్ చేస్తున్నారు.

అందుకే పౌరులుగా, ప్రజాస్వామిక వాదులుగా రాపూర్ దళితులకు అండగావుందాం.

*(రచయిత రాష్ట్ర అధ్యక్షులు కుల నిర్మూలనా పోరాట సమితి (ఆం.ప్ర)* వీ

# ఎవరిని శిక్షించాలి?

***సమాజంలో ఎటు చూసినా మహిళలపై అణచివేత, అత్యాచారాలు పెరిగిపోతున్నాయనీ, ఈ అరాచకాలకు కారణమైన వ్యవస్థను వదిలి వ్యక్తులను శిక్షిస్తే ఈ దాడులు ఆగుతాయా అనీ ప్రశ్నిస్తున్నారు*** **కె.సంధ్య**

మొన్న పెద్దనోట్ల రద్దు, నిన్న జీఎస్‌టి మోత, నేడు స్త్రీలపై, మైనర్ బాలికలపై జరుగుతున్న లైంగికదాడులు, హత్యలు దేశాన్ని కుదిపేస్తున్నాయి. బేటి బచావో అన్న నినాదం బేటి హటావోగా అమలవుతోంది. ఈ దేశంలో మహిళలపై అత్యాచారాలు కొత్తవి కాకపోయినా గత కొంతకాలంగా జరుగుతున్న సంఘటనల సంఖ్య, అవి జరుగుతున్న తీరు చూస్తే భయంతో శరీరం కంపించి పోతోంది. మెదడు మొద్దుబారిపోయి అసలు మనం ఏ సమాజంలో జీవిస్తున్నాం అనే సందేహం కలుగుతోంది. ఆడపిల్లలపై ఈ సమాజం మరీ ముఖ్యంగా ఉత్తరాది రాష్ట్రాలు యుద్ధం ఏమైనా ప్రకటించాయా అని అనిపించక మానదు. అత్యాచారాలు చాలా సహజమైన విషయంగా మారిపోతున్న ప్రమాదకర స్థితిలోకి సమాజం క్రమంగా చేరుకుంటోంది. దేశంలోని ముస్లిం మహిళల హక్కులు, రక్షణ గురించి ఇటీవల కాలంలో ఎంతో ఆందోళన, ఆదుర్దాను ప్రదర్శించి, ఆగమేఘాల మీద త్రిపుల్ తలాక్‌ను రద్దు చేస్తూ బిల్లును తీసుకువచ్చిన మోది, ఆయన ప్రభుత్వం, బాలికలపై జరుగుతున్న లైంగిక దాడులను నోరువిప్పి కనీసం ఖండించక పోవడం ఒకింత ఆశ్చర్యమే.

తెలంగాణా రాష్ట్రంలోని యాదాద్రిలో బీహార్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాల లోని ప్రభుత్వ, ప్రైవేట్ సంక్షేమ హాస్టళ్లలో పదులు వందల సంఖ్యలో ఆడపిల్లలను హింసిస్తూ వ్యభిచారం చేయిస్తున్న వాస్తవాలు బట్టబయలయ్యాయి. నిర్భయ తీర్పు తర్వాత మహిళలపై హింస, అత్యాచారాలు ఆగకపోగా రెట్టింపయ్యాయి. మహిళలతో పాటు మైనర్ బాలికలు కూడా బహిరంగ దాడులకు లక్ష్యంగా మారారు. ఇప్పుడు లైంగికంగా దాడి చెయ్యడం మాత్రమే కాదు, క్రూరాతి క్రూరంగా బాధితులను హింసించి హత్యచేసి సాక్ష్యం లభించకుండా శవాలను మాయం చేయడం, ఆనవాలు లేకుండా తగుల పెట్టడం జరుగుతోంది. ఒక శత్రువు పట్ల వ్యవహరించే తీరులో బాధితులపట్ల ఊహించలేనంత అమానుషత్వం, రాక్షసత్వం కసి కోపం ద్వేషం, ఒక రకమైన అసహనం శాడిజం వంటి ప్రమాదకర ధోరణులు ముద్దాయిలలో వ్యక్తం అవుతున్నాయి. జరుగుతున్న ఘటనలన్నీ కామోద్రేకంతో హఠాత్తుగా అప్పటికప్పుడు జరిగిన సంఘటనల లాగా అగుపించవు. ఒక పథకం ప్రకారం రోజులపాటు జరుపుతున్న సామూహిక లైంగిక హింసలు ఒంటరిగానో, సామూహికంగానో అత్యాచారం చేసి ఆ దృశ్యాన్నంతా వీడియో తీసి సోషల్ మీడియాలో దాన్ని బహిర్గతం చేస్తామని బాధితులను బెదిరిస్తూ రోజులు, నెలలపాటు పదే పదే లైంగిక దాడికి పాల్పడుతున్నారు.

గతంలో లైంగిక దాడులలో ఎక్కువ శాతం కేసులలో నేరస్తుడు ఒక్కడే ఉండేవాడు. 2010 తర్వాత ఇవి సామూహిక రూపం తీసుకుంటున్నాయి.

నిర్భయ తీర్పు వచ్చిన రెండవ రోజు మే 6న మూడు సంవత్సరాల పాపపై 22 ఏళ్ల యువకుడు దేశ రాజధానిలోని ప్రభాస్ ఖేరి ప్రాంతంలో అత్యాచారం చేశాడు. పది రోజులలోపు ఉత్తరప్రదేశ్‌లోని రోహతక్‌లో 2017 మే 14న ఇరవై సంవత్సరాల యువతిని గ్యాంగ్ రేప్ చేసి, ఇటుకలతో కొట్టి చంపి, ఆమె శవాన్ని పొదలలో విసిరేయగా, ఆమె శరీరపు కింది భాగాన్ని కుక్కలు పీక్కు తిన్నాయి. ఆమె జీర్ణాశయం కనిపించలేదని, మర్మాంగంలో అనేక కత్తిపోట్లు ఉన్నాయని అటాప్సి చేసిన వైద్యులు వెల్లడించారు.

చెన్నైలో వినికిడి లోపం ఉన్న 12 సంవత్సరాల మైనర్ బాలికకు మత్తుమందిచ్చి, పేపర్‌బాయ్, లిఫ్ట్‌బాయ్, వాచ్‌మాన్, ఎలక్ట్రిషియన్, ప్లంబర్, సెక్యూరిటి గార్డ్స్‌తో సహా పాతిక సంవత్సరాల వయసు నుండి 65 సంవత్సరాల వయసులో ఉన్న 24 మంది వంతుల వారిగా 7 నెలలపాటు అత్యాచారం చేయడం ఏ సంస్కృతికి నిదర్శనం. కథువాలో 8 సంవత్సరాల ఆసిఫాపై ఆరేడు రోజులపాటు ఏడు మంది సామూహిక అత్యాచారం చేసి బండతో కొట్టి చంపారు. మరొక చోట 8 నెలల పసి బిడ్డపై అత్యాచారం. మధ్యప్రదేశ్‌లో 8 సంవత్సరాల బాలికపై లైంగిక దాడి జరిపి ఆమె మర్మాంగంలో పదునైన రాడ్ పెట్టి తిప్పినందు వల్ల పొట్టలోని పేగులు బయటకు వచ్చాయి. పాప శరీరమంతా గాట్లు గాయాలు ఉండి రక్తపు మడుగులో అపస్మారక స్థితిలో పడి ఉంది. తమ సర్వీసులో ఇంతటి దారుణమైన కేసుని చూడలేదని, ఎవరిని చూసినా పాప వణికి పోతోందని వైద్యం చేసిన డాక్టర్లు వెల్లడించారు. హరియాణా లోని పంచకులలో 21 సంవత్సరాల మహిళపై జులై నెల 15 నుండి 18 వరకు నాలుగు రోజులపాటు ఒక గెస్ట్‌హౌస్‌లో బంధించి 50 మంది వంతులవారిగా అత్యాచారం జరిపారు.

ఎనిమిది నెలల నుండి పన్నెండు పదమూడు సంవత్సరాలలోపు పసిపిల్లల మీద జరుగుతున్న అనేక అత్యాచారాలు పత్రికలలో నిత్యం రిపోర్ట్ అవుతూనే ఉన్నాయి. టీచర్లు, ప్రొఫెసర్లు, బాబాలు, సన్యాసులు, కుటుంబంలోని వారు పరిచయస్తులు అందరికీ ఈ అత్యాచారాలలో భాగం ఉంది. ప్రతిఘటించే శక్తిలేని, అసలు తమ శరీరం మీద ఏమి జరగబోతోందనేది కూడా ఊహించ లేని పసిబిడ్డలు పెద్ద సంఖ్యలో ఈ దారుణాలకు గురవ్వడం సమాజంలో పెరిగిపోతున్న అభద్రతకు, నీచ సంస్కృతికి నిదర్శనం. రెచ్చగొట్టే విధంగా స్త్రీల వస్త్రధారణ, విచ్చల విడిగా రోడ్ల మీద తిరగడంవల్లే అత్యాచారాలు జరుగుతున్నాయని స్త్రీలనే తప్పుపడుతూ స్త్రీల కదలికలకు లక్ష్మణ రేఖలు గీసే వాదించే సాంప్రదాయ వాదులు మైనర్ బాలికలపై జరుగుతున్న దుర్మార్గాలకు ఏం వివరణ ఇస్తారు. ఇటువంటివి ఇంతకన్నా దారుణమైన హేయమైన సంఘటనలు స్త్రీల మీద ప్రతినిత్యం పదుల సంఖ్యలో దేశంలో నేడు జరుగుతున్నాయి.

గత పది సంవత్సరాల కాలంలో మహిళలపై జరుగుతున్న నేరాల

సంఖ్య మునుపటి కంటే 83 శాతం పెరిగాయని, గంటకు 39 దాడులు జరుగుతున్నాయని, ఈ దేశంలో ఇంకా 47 శాతం బాల్య వివాహాల సాంప్రదాయం కొనసాగుతోందని నేషనల్ క్రైం బ్రాంచి నివేదిక అంగీకరిస్తోంది. స్త్రీల అభద్రత, మహిళల అక్రమ రవాణాకు సంబంధించి, ప్రపంచంలోనే భారత్ ప్రథమ స్థానంలో ఉందని థామస్ రాయిటర్స్ ఫౌండేషన్ సర్వే నివేదిక స్పష్టం చేస్తోంది.

మోది ప్రభుత్వం 2016లో రూపొందించిన జాతీయ మహిళా ముసాయిదా, సమాజంలో పేరుకు పోయిన పితృస్వామిక భావాలు సామాజిక ఆర్థిక రంగాలలో స్త్రీల సాధికారతకు ఆటంకంగా వున్నాయని, పెరిగిన సాంకేతిక అభివృద్ధి ఫలితంగా మహిళలపై అనేక కొత్త రూపాలలో అత్యాచారాలు హింస పెరుగుతున్నాయని స్వయంగా పేర్కొంది.

భారతీయ సమాజం పుత్ర సంతానం కోసం (సన్ మెటా-ప్రిఫరెన్స్) పరితపిస్తోందని, పుత్ర సంతానం కలిగేంత వరకు ఆడపిల్లలను కనడం, లేదా గర్భంలో ఉన్నది మగశిశువు కాని పక్షంలో పిండ అభివృద్ధిని రద్దు చేసుకునే నియమాలను పాటిస్తున్నదని అరుణ్ జైట్లి జనవరి 29న పార్లమెంట్‌లో ప్రవేశపెట్టిన 2017-18 ఆర్థిక సర్వే ద్వారా తెలియ చేసాడు. దీనర్థం భ్రూణ హత్యలు ఇంకా కొనసాగుతున్నాయని పరోక్షంగా అంగీకరించడమే. పిత్రుస్వామిక ఆధిక్యతా విలువలు, సమాజంలో స్త్రీ-పురుషుల పట్ల కొనసాగుతున్న వివక్షత కారణంగా రెండు కోట్ల మందికి పైగా ఆడపిల్లలు తల్లి గర్భంలోనే అశువులు కోల్పోయారు.

ఇటువంటి గణాంకాలు మనం ఎంతో కాలంగా చెప్పుకుంటున్నవే. పితృస్వామ్య ఆధిక్యత, అసమాన విలువలు సమాజంలో పాతుకుపోయి వున్నాయని ఏలుతున్నవారే సెలవిస్తున్నారు. వివిధ పార్టీలు, జండాలు ఏడు దశాబ్దాలపాటు ఈ దేశాన్ని పాలించిన తర్వాత కూడా పురుషాధిక్యత ఇంకా ఇంత బలంగా ఉండడానికి కారణమేంటి అనే ప్రశ్న వేసుకోవాలి. స్త్రీలపై జరుగుతున్న హింస దాడులను అర్థం చేసుకోవాలంటే మరికొన్ని ప్రశ్నలు కూడా వేసుకోవాలి. మహిళలపై అత్యాచారాలు హత్యల గురించి మళ్లీ మళ్లీ చర్చించుకోవాల్సిన పరిస్థితి ఎందువల్ల కలుగుతోంది? అభివృద్ధి, సంక్షేమం పేరిట ప్రభుత్వాలు అవలంబిస్తున్న ఆర్థిక రాజకీయ విధానాలు స్త్రీలకు మేలు చేస్తున్నాయా లేక కీడు చేస్తూ వారి స్థితిని మరింత దిగజారుస్తున్నాయా! కఠిన చట్టాలు, శిక్షలతో లైంగిక దాడులు ఆగిపోతాయా! నిర్భయ, పోక్సో చట్టాలు ఈ నేరాలను ఎందువల్ల నివారించలేకపోయాయి? ఒక మైనర్ బాలికను అత్యాచారం చేసి హత్య చేసిన కారణాన 2004, ఆగస్టు 14లోనే ధనుంజయ్ ఛటర్జీని భారత ప్రభుత్వం పశ్చిమ బెంగాల్ సెంట్రల్ జైయిలో ఉరితీసింది. అయినా ఈ నేరాలు ఆగలేదనే సత్యం మన కళ్ల ముందు ఉంది. మరి వీటికి మూలం ఎక్కడుంది? పరిష్కారం ఏమిటి?

మూలం ఈ వ్యవస్థలో ఉంది. ఈ దోపిడీ వ్యవస్థ, దాన్ని కాపాడుతున్న అనేక అంగాలు వాటికున్న పితృస్వామిక దృక్పథంలో ఉంది. స్త్రీలు అనుభవించడానికి, దళితులు అణిగిమణిగి ఉండి సేవచేయడానికే అనే బ్రాహ్మణీయ ఆధిక్య భావజాలంలో ఉంది. ఆ భావజాలం సమాజం అంతటా పాతుకుపోయి ఉంది. మహిళలను పేద ప్రజలను, దళితులను పీడించి దోపిడి చెయ్యడం ద్వారా సంపదను సృష్టించుకుంటున్న శక్తులు ప్రభుత్వాలను నిర్వహిస్తూ ప్రజాస్వామ్యం ముసుగులో ఈ వ్యవస్థను పదిలంగా కాపాడుతున్న కుట్రలో ఉంది. మహిళలకు, పేద ప్రజలకు మేలు చేసే విధానాలు కాక తమ దోపిడీ ప్రభుత్వాలకు అనుకూలమైన విధానాలను, చట్టాలను రూపొందించడంలో ఉంది.

1990 దశాబ్దం ప్రారంభంలో ముందుకు తీసుకువచ్చిన సరళీకృత ఆర్థిక విధానాలు అన్ని రంగాలను కుప్పకూల్చడమే కాక విలువల విధ్వంసానికీ దారితీసాయి. ఈ విధానాల వల్ల మునుపటి కంటే ఎక్కువగా, సంపద కొద్దిమంది చేతుల్లో పోగుపడుతూ మనుషుల మధ్య ఉన్న అంతరాలను పెంచుతూ సమాజంలో అశాంతిని సృష్టిస్తోంది. ఇది హ్యూమన్ ట్రాఫికింగ్ వంటి మరి కొన్ని సామాజిక సమస్యలకు దారితీస్తోంది. మతతత్వ రాజకీయ ఎజండా కలిగిన శక్తులు సమాజాన్ని వెయ్యేళ్లు వెనక్కు తీసుకు వెళ్లే లక్ష్యంతో కులతత్వాన్ని రెచ్చగొడుతూ సమాజంలో హింసా ప్రవృత్తికి ఆజ్యం పోస్తూ మానవత్వాన్ని చంపేస్తున్నాయి. ప్రభుత్వాలు అమలు చేస్తున్న ఆర్థిక విధానాల మూలంగా వ్యవసాయ పారిశ్రామిక రంగాలు సంక్షోభానికి గురయ్యి పేదరికం నిరుద్యోగం పెరిగాయి. సెజ్‌లు, రకరకాల ప్రాజెక్టుల పేర ఉన్న భూములు పోయాయి.

దేశంలో మూడు లక్షల మందికి పైగా రైతులు ఆత్మహత్యలు చేసుకోవడంతో ఆ కుటుంబాలన్నీ వీధిన పడ్డాయి. మున్సిపాలిటిలో ఫోర్త్ క్లాస్ ఉద్యోగానికి గ్రాడ్యుయేట్‌లు పోస్ట్ గ్రాడ్యుయేట్‌లు, డాక్టర్లు పోటీ పడుతున్న దారుణమైన పరిస్థితి ఉంది. ఉచిత విద్య కాగితాలకే పరిమితమైనదే తప్ప పేదలకు అందుబాటులోకి రాలేదు.

130 కోట్ల భారతీయ జనాభాలో యాభై శాతం మంది యువకులేనని అందులో 30 ఏళ్ల లోపువారే 65 శాతం మంది ఉన్నారని సెన్సెస్ వివరాలు తెలియచేస్తున్నాయి. అంటే వీరంతా 1990 తర్వాత జన్మించిన వారే. చదువులేదు, ఉపాధి లేదు, ఎటువంటి భద్రత లేక జీవితం పట్ల సమాజం పట్ల ఒకవిధమైన అసహనం అశాంతిని ఎదుర్కుంటున్న ఈ యువకుల చేతుల్లోకి సెల్‌ఫోన్లు వచ్చాయి. పది రూపాయలు పెడితే బూతు వీడియోలను చూపెట్టే ఇంటర్నెట్ సెంటర్లు వచ్చాయి. మంచిచెడు విచక్షణలను నాశనం చేసి మనుషులను లైంగికంగా ఉద్రేకపరిచే ఆరు లక్షలకు పైగా పోర్న్ వీడియోలు ఇంటర్నెట్లలో నిత్యం ప్రసారమవుతాయి.

జీవితంలో ఎటువంటి సార్థకత లేక వాళ్ల సమర్థతను ఎక్కడ చూపించాలో తెలియక ఫ్రస్టేషన్లో మునిగిపోతున్న యువతరం తమ కసి కోపాన్ని స్త్రీలపై లైంగిక దాడులను చెయ్యడం ద్వారా పురుషుడిగా తమ అస్థిత్వాన్ని ఆధిక్యతను నిలబెట్టుకునే ప్రయత్నం చేస్తున్నారు. స్త్రీలను సెక్స్ సింబల్స్‌గా చూపెడుతున్న సంస్కృతి, అనాదిగా పురుషాధిక్యతను పెంచిపోషిస్తున్న సమాజం ఉండనే ఉంది. ఈ నేపథ్యం మహిళలపై హింసకు పాల్పడేందుకు కావలసిన నైతికబలాన్ని నేరస్థులకు అందిస్తోంది.

గత పది సంవత్సరాల కాలంలో జరిగిన లైంగిక దాడులను పరిశీలిస్తే ఎక్కువ మంది ముద్దాయిలు 25-30 సంవత్సరాల వయసు లోపువారే. బూతు సాహిత్యం సినిమాలు పోర్న్ వీడియోలు వీక్షించడం వల్ల సమాజంపై యువతపై దాని చెడు ప్రభావం చాలా బలంగా ఉందని ప్రభుత్వాలకు అధికారులకు ;తెలిసినా వాటిని అరికట్టే ప్రయత్నం ఏమి చెయ్యరు. లైంగిక దాడులకు పాల్పడిన అనేక మంది నేరస్తులు తమపై పోర్న్ వీడియోల ప్రభావం ఉందని విచారణలో స్వయంగా అంగీకరించారు. మైనర్ బాలికలపై అత్యాచారాలకు సమాజంలో పాతుకుపోయిన మూఢనమ్మకాలు కూడా మరొక కారణం. రజస్వల కాని బాలికలతో లేదా చిన్నపిల్లలతో సంపర్కం జరిగితే పురుషుడి సెక్స్ సామర్థ్యం పెరుగుతుందనే మూఢ విశ్వాసాల వల్ల కాటికి కాళ్లు చాపిన వాళ్లు కూడా అత్యాచారాలకు పాల్పడుతున్నారు.

లైంగిక దాడులు ఊహకందని రీతిలోనో, అత్యంత అమానుషంగా జరిగిన సందర్భంలోనో నేరస్తులను ఉరితీసో, రాళ్లతో కొట్టి చంపో శిక్షించాలనే డిమాండ్ మన ముందుకు పదేపదే వస్తోంది. సామాజికవేత్త

# విద్యుత్ కార్మికుల సమ్మె

*అసంఘటిత రంగాల కార్మికులు సంఘటితపడి తమ సమస్యలపే తామే పోరాడి హక్కులు సాధించుకోవాలని అటూ, ఇటీవల విద్యుత్ కార్మికులు జరిపిన సమ్మెకు గల పూర్వాపరాలను వివరిస్తున్నారు* **జి. హరగోపాల్**

మనుషులందరికీ తమకు ఇష్టమైన పనిని కల్పించడమేకాక, ఆపని గౌరవంతో, భద్రతతో కూడినప్పుడు ఆ వ్యవస్థను అభివృద్ధి చెందిన వ్యవస్థగా పరిగణించాలి. అభివృద్ధి అంటే సంపద ఎంత పెరిగింది, ఎంత వేగంగా పెరిగింది, ఇతర దేశాల కంటే ఎంత ముందుగా ఉన్నాం అన్నది పెట్టుబడిదారీ దేశాలు, ముఖ్యంగా సామ్రాజ్యవాద ప్రేరేపిత నమూనా కల్పించిన అసహజ, అశాస్త్రీయ సూచికలు. పంతొమ్మిది, ఇరవై శతాబ్దాలలో జరిగిన వలసవాద వ్యతిరేక ఉద్యమాలు ఏవి కూడా తమకు స్వాతంత్ర్యం వస్తే అధిక వృద్ధిని సాధిస్తామనో, పెట్టుబడిదారీ దేశాలను నిర్మిస్తామనో ఎక్కడ బహిరంగంగా లేదా ఉద్యమాల క్రమంలో అన్నట్లు దాఖలాలు లేవు. అన్ని స్వాతంత్ర్యోద్యమాలు ఒక న్యాయమైన, స్వేచ్ఛాపూరితమైన, విస్తృతంగా హక్కులు కల్పించి, హక్కుల పరిధిని, సామాజిక వ్యవస్థలను స్థాపిస్తామని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వాగ్దానాలు చేసినవే. ఈ చరిత్రలో భాగంగానే మన స్వాతంత్ర పోరాటం కూడా కార్మిక, కర్షక లోకానికి అలాంటి వాగ్దానమే చేసింది. దాని ఫలితంగానే భారత రాజ్యాంగం ప్రాథమిక హక్కులను పొందుపరచడమే కాక స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం, లౌకిక, సోషలిస్టు సమాజం నిర్మించే దిశగా దేశం పోవాలని ఆదేశిక సూత్రాలు ఆదేశిస్తున్నాయి. అంతేకాక తమకు న్యాయం జరగలేదని భావించిన సమూహాలు సంఘటిత పడవచ్చు, సంఘాలు పెట్టుకోవచ్చు, నిరసనలు తెలుపవచ్చు. అందులో భాగంగానే సమ్మెహక్కు కూడా కల్పించబడింది.

దేశ అభివృద్ధి నమూనా మొదటి నుండే గాడి తప్పింది. నెహ్రూవియన్ అభివృద్ధి వ్యవసాయిక సంబంధాల మార్పును, భూ పంపిణీని పక్కకు పెట్టడంతో 1960ల చివరి వరకే దేశ వ్యాప్తంగా నిరసన జ్వాలలు భిన్న రూపాల్లో ముందుకు వచ్చాయి. ఈ నిరసనల నుండి ప్రజాసామ్యం

---

కైలాష్ సత్యర్తి కూడా ఇటీవల కాలంలో అదే కోరాడు. కఠినమైన చట్టాలను ఇంకా రూపొందించాలనే డిమాండ్ కూడా వస్తోంది.

ప్రస్తుత సమస్య చట్టాలు లేక కాదు, వాటిని నిష్పక్షపాతంగా, ప్రజాస్వామిక దృక్పథంతో అమలు చేసే నిజాయితీ రాజ్యాంగ యంత్రానికి కొరవడడం. పోలీసు, న్యాయవ్యవస్థలు పురుషాధిపత్య దోపిడీ భావజాలాన్ని కలిగి ఉండడమే అందుకు కారణం. ప్రజలు పోరాడి సాధించుకున్న చట్టాలను ఆచరణలో బలహీనపరచడం, సవరణల ముసుగులో వాటి సారాన్ని తొలిచేయడం ప్రభుత్వాలు సహజంగా అనుసరించే ప్రక్రియ. దుర్వినియోగమవుతోందనే పేరిట 498/ఏ చట్టాన్ని, ఎస్‌సి, ఎస్‌టి చట్టానికి మార్పులు తీసుకురావడమే అందుకు తాజా నిదర్శనం.

నేరస్తులను ఉరితీసి చంపమంటే కూడా ప్రభుత్వానికి పోయేదేమి లేదు. పైగా ప్రభుత్వానికి కావలసింది కూడా అదే. తమ దుర్మార్గాన్ని కప్పెట్టుకుని ప్రజల ఆగ్రహం, వ్యతిరేకత, చైతన్యం వ్యవస్థ వైపు మళ్లకుండా, తప్పంతా వ్యక్తుల మీదకి తోసివేసి వాళ్లను చంపడం ద్వారా గొప్ప న్యాయం చేసినట్లుగా ఫోజు పెట్టవచ్చు.

నేరస్తులను తయారు చేస్తున్న వ్యవస్థను వదిలి పెట్టి కేవలం వ్యక్తులను మాత్రమే శిక్షించడం వల్ల సమస్య పరిష్కారం కాక పోగా మళ్లీ మళ్లీ పుడుతూనే ఉంది. కాలయాపన లేకుండా నేరస్తులను విచారించి శిక్షించకుండా, ఏళ్ల కొద్దీ కేసులను కోర్టులలో నానబెట్టడం, తీర్పులను వాయిదా వేయడం మరొక పెద్ద దుర్మార్గం.

రాజస్థాన్‌లో బాల్య వివాహాలను అడ్డుకోవడానికి ప్రయత్నించిన భన్వారి దేవి కేసు స్థానిక కోర్టునుంచీ హైకోర్టులో విచారణ మొదటిసారి జరగడానికి 15 సంవత్సరాలు పట్టింది. ఆలోగా ఆమెపై సామూహిక మానభంగానికి పాల్పడిన అగ్రకుల నేరస్తులలో ఇద్దరు మరణించారు. భన్వారిదేవికి న్యాయం దక్కకపోగా అత్యాచారానికి గురైనందుకు పోలీసు న్యాయ వ్యవస్థలు చేసిన అవమానాలను ఎదుర్కోవడం మాత్రమే కాక కుటుంబం నుంచి సమాజం నుంచి బహిష్కరణకు గురయ్యింది. విజయవాడలో ఆయేషా హత్య జరిగి 11 ఏళ్లు కావస్తున్నా ఆ కేసు ఇప్పటికీ ఒక కొలిక్కి రాలేదు. అసలు దోషులను ఈ నాటికీ పట్టుకోలేదు.

ఈ వ్యవస్థలో ఉన్నవాడిని కాపాడడానికి లేనివాడిని శిక్షించడానికే చట్టాలను ఎక్కుపెడుతున్న పరిస్థితి ఉంది. ఇలా వందలాది కేసులు విచారణ పేరుతో సుదీర్ఘ కాలం నడుస్తున్నాయి. ఈ దీర్ఘ కాలయాపన స్త్రీలపై దాడులకు తెగబడుత్తున్న ముద్దాయిలకు నేరం చేసి తప్పించుకోగలమనే మనస్థత్వాన్ని నైతిక బలాన్ని అందిస్తోంది. ఇప్పుడున్న స్థితిలో మార్పులు జరగకుండా, సమాజంలో న్యాయవ్యవస్థలో స్త్రీల పట్ల ఉన్న తప్పుడు దృక్పథాల్లో మౌలికమైన మార్పులు రాకుండా లైంగిక దాడులను నివారించడం అసాధ్యం.

ఈ నేపథ్యాన్ని పక్కకు పెట్టి సమస్యను వ్యక్తులకు కుదించి చూస్తే పరిష్కారం లభించదు. దీనర్థం ముద్దాయిలను శిక్షించకుండా వదిలి పెట్టమని కాదు. ఆ నేరాలకు వ్యక్తులను పురికొల్పుతున్న దోపిడీ వ్యవస్థను, దాన్ని పదిలంగా నిలపెడుతున్న ప్రభుత్వాల వైపు కూడా చూడాలని చెప్పడమే నా ఉద్దేశ్యం. ఇంటా బయటా స్త్రీలపై వివిధ రూపాలలో జరుగుతున్న హింస అత్యాచారాలు, అణచివేత, హత్యలు అమలవుతున్న పితృస్వామ్యానికి, పేదరికం నిరుద్యోగం నిరక్షరాస్యత మతతత్వవాదం వంటి అనేక సమస్యలకు మధ్య అవినాభావ సంబంధం ఉన్నదని చెప్పడమే ఈ వ్యాసం లక్ష్యం. అందుకు అనుగుణంగానే మన డిమాండ్లు నినాదాలు ఉండాలని గుర్తుచేయడమే దీని ఉద్దేశ్యం.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

పరిధవిల్లే బదులు, నియంతృత్వ పోకడలు పెరుగుతూ 1970లలో ప్రాథమిక హక్కులను రద్దు చేయడమేకాక దేశాన్నే ఒక జైలుగా మార్చేసారు. ఈ నియంతృత్వానికి భారత ప్రజలు ఎన్నికల ద్వారానే కావచ్చు కొంతవరకు అడ్డుకట్ట వేశారు.

పెరుగుతున్న సంక్షోభానికి మూలకారణాలు వెతికే బదులు పెట్టుబడి తగినంత లేకనే పరిస్థితి ఇలా మారిందని అంతర్జాతీయ ద్రవ్యనిధి (ఐఎంఎఫ్) దగ్గరకు అప్పుకొరకు వెళ్లడంతో పరిస్థితి పూర్తిగా మన చేయి దాటిపోయింది. దాంతో విధానపర నిర్ణయాలు ఢిల్లీలోకాక వాషింగ్టన్‌లో రూపొందించడంతో రాజ్యవ్యవస్థ దేశంలోని సంపన్నులకు, పెట్టుబడిదారులకు ఊడిగం చేస్తూ కార్మిక వ్యతిరేకిగా మారింది. స్వాతంత్ర్య పోరాటంలో భాగంగా పొందిన హక్కులను కాలరాస్తూ అభివృద్ధి మనిషికొరకు అనికాక మనిషే అభివృద్ధి కొరకు అనే భావజాలంతో అభివృద్ధి నమూనాను అమానవీయంగా తయారుచేశారు.

సామ్రాజ్యవాద అభివృద్ధి నమూనాలో దోపిడీ ఉంటుంది. ఆ దోపిడీ సహజ వనరులపై కావచ్చు లేదా మానవ వనరులపైనే కావచ్చు. ఈ ధోరణి 1990లకు వచ్చేవరకు ఒక విషవృక్షంగా ఎదిగింది. అంతర్జాతీయ ద్రవ్యసంస్థలు ఏది చెపితే అదే ఆట, అదే పాట. పర్యవసానంగా అవి పెరిగిన కొద్దీ నిరసనలు పెరిగినవి. దుర్మార్గ చట్టాల ద్వారా అణచివేయడ మొక్కటే మార్గంగా భావించి అమలుచేస్తున్నారు.

పెట్టుబడి సామ్రాజ్యవాద అవతారమెత్తడంతో అన్ని హక్కులు హరించిపోవడంతో గౌరవప్రదమైన, భద్రతతోకూడిన పని అనే విలువకు పూర్తి స్వస్తి చెప్పారు. గత మూడు దశాబ్దాలలో దాదాపు 40 నుండి 50 లక్షల ప్రభుత్వ ఉద్యోగాలు రద్దు చేయబడి, వాటి స్థానంలో కాంట్రాక్టు ఉద్యోగాలు, ఔట్‌సోర్సింగ్ విధానాలను ప్రవేశపెట్టారు. దేశంలో పర్మినెంట్ ఉద్యోగుల కంటే కాంట్రాక్టు ఉద్యోగుల సంఖ్య పెరుగుతూ వచ్చింది. వీళ్లంతా అసంఘటిత రంగంలోకి నెట్టబడడం వలన తమ హక్కుల కొరకు తాము పోరాడే వెసులుబాటే లేకుండా పోయింది. ఈ ఉద్యోగాలలో గౌరవం లేదు. డిగ్నిటీ లేదు. భద్రత అంతకంటే లేదు. ఈ మధ్యకాలంలోనే అనివార్యంగా కాంట్రాక్టు ఉద్యోగులు కూడా సంఘటితం కావడం ప్రారంభించారు. సంఘటిత కార్మికుల యూనియన్ లను పక్కకు పెట్టి తమంతగా తామే ఉద్యమాలు ప్రారంభించి వ్యవస్థను ప్రశ్నిస్తున్నారు, ఎదిరిస్తున్నారు.

ఈ మారుతున్న నేపథ్యంలో ఉద్యమాలు భిన్నరూపాలు తీసుకుంటు న్నాయి. భద్రతతో కూడిన ఉద్యోగాలు క్రమంగా మాయం కావడంతో నిరుద్యోగ యువత, విద్యార్థులలో ఆగ్రహం పెరుగుతూండడం వలన వ్యవస్థ నిర్వహణే ప్రశ్నార్థకంగా మిగిలింది. ఇలాంటి ఆగ్రహంలో నుండి వచ్చిన ఉద్యమాలలో ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం ఒక సజీవ ఉదాహరణ.

ఈ ఉద్యమంలో గ్రామీణ ప్రాంత యువత, రైతులు పాల్గొనడమే కాక పట్టణ ప్రాంత నిరుద్యోగ యువత, ముఖ్యంగా విద్యార్థి లోకం పెద్దఎత్తున పాల్గొన్నారు. ఉద్యమం ఆగిపోతుందేమో లేదా రాజకీయ నాయకులు రాజీపడతారేమో అని అనిపించినప్పుడల్లా ఉద్యమానికి ఊపిరిపోసి నిలబెట్టారు.

దీంట్లో భాగంగానే దాదాపు మూడు లక్షల కాంట్రాక్టు, ఔట్‌సోర్సింగ్ ఉద్యోగులు తమ శక్తి మేరకు ఉద్యమానికి మద్దతిచ్చారు. ఈ రాజకీయ క్రీడలో కాస్తా ముందుగా నిలబడింది తెలంగాణ రాష్ట్ర సమితి. ఉద్యమ నాయకుడు కెసిఆర్ తెలంగాణ రాష్ట్రం ఏర్పడుతూనే కాంట్రాక్టు వ్యవస్థ రద్దు చేస్తామని, తెలంగాణ రాష్ట్రంలో కాంట్రాక్టు ఉద్యోగాలుండవని, కాంట్రాక్టు పద్ధతిలో పని చేస్తున్న అందరి ఉద్యోగాలను క్రమబద్ధీకరిస్తామని పదేపదే వాగ్దానం చేస్తూ కొత్త ఆశలను రేకెత్తించారు. పరిస్థితి తప్పక మారుతుందని చాలా మంది విశ్వసించారు.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన మూడు, నాలుగు నెలల్లోనే ఉద్యమ వాగ్దానాలు ఏమయ్యాయని, క్రమబద్ధీకరణ దిశలో ఏ అడుగులు వేయడం లేదని కొంత నిరాశకు గురౌతూ, ఉద్యమ అనుభవం ఉంది కాబట్టి ఉద్యమాల ద్వారా రాష్ట్రాన్నే సాధించుకున్నామనే విశ్వాసం వలన మళ్లీ ఉద్యమబాట పట్టసాగారు. ఇది గ్రహించే ప్రభుత్వం ధర్నాచౌక్‌ను ఎత్తివేసింది.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడ్డ తర్వాత జరిగిన మొట్టమొదటి సమ్మె తెలంగాణ విద్యుత్ కార్మికుల సమ్మె. విద్యుత్ సేవలు సమాజానికి అత్యవసర సేవలు కావడంవల్ల, వీళ్లలో చాలామంది నైపుణ్యాలను కలిగి ఉండడంవల్ల ఈ కార్మికులకు ఆత్మబలం కొంచెం ఎక్కువే. దానికి తోడు వీళ్ల సంఖ్య 23 వేలు కావడంతో సంఖ్యాబలం కూడా ఉద్యమానికి తోడైంది. తెరాస ప్రభుత్వం భిన్న కారణాల వలన విద్యుత్తు రంగానికి చాలా ప్రాధాన్యత ఇవ్వడంతో, వ్యవసాయం, పరిశ్రమలు విద్యుత్ ఆధారితం కావడంవల్ల విద్యుత్ కార్మికులను విస్మరించడం సాధ్యంకాలేదు.

తమను కాంట్రాక్టర్ల దోపిడీ నుండి కాపాడమని వీళ్ల మొట్టమొదటి డిమాండ్. కాంట్రాక్టర్లు కేవలం దళారులు, కార్మికులకిచ్చే చాలీచాలని జీతంలో దాదాపు నాల్గవ భాగం తామే తిని, ఇచ్చిన జీతాన్ని కూడా నెలనెల ఇవ్వకుండా, మూడు నాలుగు నెలలకివ్వడం, ఆ డబ్బును వడ్డీ వ్యాపారానికివ్వడం, కార్మికుల ఎటియం కార్డులను తన దగ్గర పెట్టుకోవడం లాంటి దుర్మార్గాలకు పాల్పడడం వలన కార్మికులు ఎట్టి పరిస్థితిలో తాము కాంట్రాక్టు వ్యవస్థ కింద పనిచేయమని సమ్మె చేయడంతో ప్రభుత్వం దిగి వచ్చి కాంట్రాక్టర్లను తొలగిస్తూ జీతాలను నేరుగా ఇచ్చేలా ఒక కీలక నిర్ణయం తీసుకుంది. ఇది విద్యుత్ కాంట్రాక్టు ఉద్యోగులు సాధించిన విజయం. ఈ విజయం వాళ్ల విశ్వాసాన్ని పెంచింది. సమ్మెపై గురికుదిరింది.

రెండవ దఫా తమ ఉద్యోగాలను క్రమబద్ధీకరించాలని, ఇది తెలంగాణ ఉద్యమ వాగ్దానమని గుర్తు చేస్తూ సమ్మెకు పూనుకోవడంతో ప్రభుత్వం కొంత దూరాలోచనే చేసి క్రమబద్ధీకరణను చేపట్టింది. దీంట్లో సిజియం ప్రభాకర్‌రావు పాత్ర కొంత ఉంది. ఆయన మొదటి నుండి కాంట్రాక్టరు వ్యవస్థ అన్యాయమని వ్యక్తిగతంగా విశ్వసించారు. క్రమబద్ధీకరణ పట్ల కూడా సుముఖంగానే ఉన్నారు.

ఈ ప్రక్రియలో భాగంగా ప్రభుత్వం విద్యుత్ బోర్డును, క్రమబద్ధీకరణలోని సాంకేతిక, న్యాయపర అడ్డంకులను పరిశీలించమని ఆదేశించడంతో దాదాపు ఆరు నెలల్లో సమస్యను అన్ని కోణాల నుండి పరిశీలించి 23వేల మంది విద్యుత్ కార్మికులను నాలుగు క్యాటగిరీల కింద విభజించి పే స్కేళ్లను నిర్ధారించి క్రమబద్ధీకరణ చేయాలని సలహా ఇచ్చారు. ఆ మేరకు ప్రభుత్వం జిఒను కూడా జారీ చేసింది.

ప్రభుత్వం క్రమబద్ధీకరణ నిర్ణయం తీసుకుంటూనే ఒక అనామకుడి ద్వారా కాంట్రాక్టర్లు హైకోర్టులో ఒక పిల్ వేయించారు. పిల్‌కు స్పందిస్తూ న్యాయమూర్తి డైరెక్ట్ పేమెంట్‌కు అనుమతిస్తూ క్రమబద్ధీకరణ మీద అభ్యంతరం తెలిపి పిల్‌కు కౌంటర్ వేయమని ప్రభుత్వాన్ని ఆదేశించారు. ఈ దేశంలో న్యాయవ్యవస్థ రాజ్యాంగాన్ని విస్మరించి సామ్రాజ్యవాద అభివృద్ధి నమూనా వైపు మొగ్గుతూ వస్తున్నది.

గత రెండు దశాబ్దాల జడ్జిమెంట్లను పరిశీలిస్తే ఈ ధోరణి స్పష్టంగా కనిపిస్తుంది. ఈ ధోరణిలో భాగంగానే హైకోర్టు క్రమబద్ధీకరణకు అభ్యంతరం చెపుతూ కాంట్రాక్టు వ్యవస్థ నుండి ఉద్యోగాల్లో చేరిన చాలామంది 'తప్పుడు' మార్గాల ద్వారా చేరే అవకాశం ఉందని, ఇది రాజ్యాంగంలోని అందరికీ సమాన అవకాశాలు అనే సూత్రానికి విరుద్ధం అనే వాదనను ముందుకు తెచ్చింది.

ఈ వాదనలో కొంత నిజం లేకపోలేదు. కాని ఉద్యోగంలో చేరి పది, పదిహేను సంవత్సరాలు తమ బాధ్యతలని సక్రమంగా, సమర్థవంతగా నిర్వహించిన వారిని, సాంకేతిక నైపుణ్యతలు కలిగిన వారిని ఉద్యోగంలోకి సరియైన మార్గంలో రాలేదని అంటే కాంట్రాక్టు వ్యవస్థను రద్దు చేయాలి. కాని దీనికి కార్మికులను తప్పుపట్టడం ఎందుకు? ఈ పద్ధతి ద్వారా వచ్చిన ఉద్యోగి ముప్పై ఏళ్లు అంటే జీవితకాలం పనిచేస్తే, ఒకవైపు సమాన అవకాశాలు అనే సూత్రానికి అలాగే గౌరవప్రదమైన, భద్రత కలిగిన ఉద్యోగం అనే రాజ్యాంగ స్ఫూర్తి దెబ్బతిన్నట్లే కదా!

కాంట్రాక్టు వ్యవస్థను ప్రోత్సహించిన సామ్రాజ్యవాద పెట్టుబడిని, అలాగే దానిని అమలు చేస్తున్న ప్రభుత్వాలను తప్పు పట్టకుండా పది పదిహేను ఏళ్లుగా తమ బాధ్యతలను నిర్వహిస్తున్న కార్మికుడిది తప్పు ఎలా అవుతుందన్న ధర్మసందేహం న్యాయస్థానాలకు రావాలి. భారత న్యాయవ్యవస్థ ఈ మౌలికమైన అంశాన్ని సమగ్రంగా, కార్మిక దృక్పథం నుండి చూడవలసిన అవసరముంది. ఇలా వయసు మీరిన కాంట్రాక్టు కార్మికులని మధ్యే మార్గంలో వదిలిపెడితే తెలంగాణ నానుడిలో వాళ్ల జీవితాలు 'నా ఘర్‌కా నా ఘాట్‌కా' అన్నమాదిరిగా మారుతాయి.

ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాన్ని కోర్టు తప్పుపట్టి పిల్‌కు కౌంటర్ వేయమంటే సమర్థులైన లాయర్లను నియమించి కోర్టులో సానుకూల నిర్ణయం వచ్చేలా కృషి చేసే బదులు కాగలకార్యం గంధర్వులే తీర్చారని ఆలోచిస్తే ప్రభుత్వ చిత్తశుద్ధిని శంకించవలసి ఉంటుంది. ఎంతకీ కౌంటర్ వేయకపోవడం, ప్రకటించిన పేస్కేళ్లను అమలు చేయకపోవడమే కాక, 24 గంటలు కరెంట్ అందిందన్న 'సంతోష' సందర్భంలో ఎలక్ట్రిసిటీ ఉద్యోగులందరికీ ఒక ఇంక్రిమెంట్ ప్రకటించినప్పుడు, ఆ ఇంక్రిమెంట్ ఈ 23 వేలమందికి ఇవ్వలేదు. ఇంక్రిమెంట్ ఇస్తే కోర్టు అభ్యంతరం చెప్పేదా?

ఈ ధోరణి చూసిన కాంట్రాక్టు కార్మికులు మళ్లీ సమ్మెదారి పట్టారు. కోర్టులో కౌంటర్ వేయాలని ప్రకటించిన స్కేళ్లను అమలు చేయాలని, 'స్టే' క్రమబద్ధీకరణ మీదేకాని పేస్కేళ్ల మీద కాదనే డిమాండ్ ముందుకు తెచ్చారు. సమ్మెకు వెళ్లే ముందే నేను రాసిన వ్యాసాన్ని ఒక తెలుగు దినపత్రిక ప్రచురించకపోవడంతో, సమ్మె రోజు మరీ దగ్గరకు రావడంతో ముఖ్యమంత్రికి బహిరంగలేఖ రాయవలసి వచ్చింది. సమ్మెను నివారించే అవకాశం ఉందని, ప్రభుత్వం తాను తీసుకున్న నిర్ణయాన్ని తానే అమలు చేయమనే కార్మికులు డిమాండ్ కనుక చర్చలు ఫలవంతంగా చేపట్టవచ్చు అనే సలహా ఇచ్చినా, సమ్మెను నివారించలేకపోయాం.

కార్మిక నాయకత్వం శ్రీధర్ గౌడ్, సాయిలు ఇచ్చిన సమ్మె పిలుపుకు దాదాపు 93 శాతం మంది కార్మికులు స్పందించి సమ్మెలో పాల్గొనడంతో ప్రభుత్వం పునరాలోచనలో పడి మరీ ఆలస్యం చేయకుండా చర్చలకు పిలిచి స్కేళ్ల అమలుకు అంగీకరించింది. ఇది అసంఘటిత కార్మికుల విజయం. కార్మికుల స్పందన చూసి సంఘటిత కార్మిక సంఘాలు కొంత ఆశ్చర్యపోయి తాము రంగంలోకి దిగారు. ప్రభుత్వం విద్యుత్ కార్మికుల నాయకులను పరోక్షంగా సంప్రదించి, చర్చలు మాత్రం రికగ్నైజ్డ్ సంఘాలతో జరిపింది.

ఈ దేశంలో కార్మిక సంఘాలు న్యాయమైన పోరాటాలు చేపట్టక పోవడం వలన అసంఘటితరంగ కార్మికులు దాదాపు అనాథలై పోయారు. కార్మిక సంఘాలు బలహీనమై వాళ్లను పట్టించుకునే వాళ్లే లేకుండా పోయారు. కార్మిక వ్యతిరేక ప్రపంచబ్యాంకు నమూనా ఏ అడ్డంకులు లేకుండా నిరాఘాటంగా దేశంలో అమలు అవుతున్నది. గత రెండు మూడు దశాబ్దాలలో దాదాపు సమ్మెలు లేనట్టే. ఉదాహరణకి ప్రభుత్వం పెన్షన్ స్కీంను చాలా సునాయాసంగా రద్దు చేయగలిగింది. అదే మిగతా దేశాల్లో చాలా ప్రతిఘటన వచ్చింది.

ఫ్రాన్సులో లక్షలాది మంది కార్మికులు ప్యారిస్ వీథులను ఆక్రమించి ప్రతిఘటించడంతో పెన్షన్‌ను రద్దు చేసే నిర్ణయాన్ని వెనక్కితీసుకున్నారు. మన కార్మిక సంఘాలు తమ మధ్య విభేదాలతోనో, అనారోగ్యపోటీ వల్లనో, రాజకీయ పార్టీలతో కుమ్మక్కవ్వడం వల్లనో రాజ్యాంగం ప్రసాదించిన హక్కులను కూడా కోల్పోయారు. ఈ కారణాల వల్లే అసంఘటిత రంగం కార్మిక సంఘాలపై విశ్వాసాన్ని కోల్పోయింది. తామే సంఘటితపడి తమ సమస్యలకు తామే పోరాడాలనే నిర్ణయానికి వచ్చారు. తెలంగాణ విద్యుత్‌రంగ ఆర్టిజాన్ కార్మికులు ఈ నూతన ప్రయోగానికి దారులు వేశారు.

క్రమబద్ధీకరణ ఇపుడు హైకోర్టు ముందు ఉంది. ఇక లాయరు ఎవరు, వాదన ఎలా ఉంటుంది, జడ్జి ఎవరు, ఆయన మనస్తత్వమేమిటి, ఆయన ఏ విలువల చట్రంలో పనిచేస్తారు అనే వేయి ప్రశ్నలున్నాయి. న్యాయవ్యవస్థకు దాదాపు శ్రమపట్ల గౌరవం లేదు.

ఒక కాలంలో జస్టిస్ క్రిష్ణ అయ్యర్, జస్టిస్ దేశాయ్, జస్టిస్ భగవతి, జస్టిస్ చిన్నపరెడ్డి, జస్టిస్ జీవన్‌రెడ్డి లాంటి జడ్జిలున్నారు. వారంతా న్యాయం బలహీనుడి వైపు ఉంటుందని నమ్మినవారు. రాజ్యాంగ స్ఫూర్తి కూడా అదే.

ఇవ్వాళ న్యాయవ్యవస్థ న్యాయాన్యాయాల మధ్య కొట్టుమిట్టాడుతుంది. మార్క్స్ అసమ సమాజంలో సమన్యాయం ఎలా ఉంటుంది అని ప్రశ్నించాడు. ప్రపంచీకరణ యుగంలో మార్క్స్ విశ్లేషణ ఎంతో వాస్తవం అనిపిస్తుంది. అసమ సమాజాన్ని సమసమాజంగా మార్చే పోరాటమే ఈ అన్ని సమస్యలకు దీర్ఘకాలిక పరిష్కారం. ఈ పరిష్కారం దిశలో విద్యుత్ కార్మికుల పోరాటం లాంటి ఈ చిన్న పోరాటాలు ముసురుకున్న చీకట్లో చిరుదివ్వెల లాంటివి.

*(రచయిత విద్యుత్ కార్మికుల గౌరవ సలహాదారు)* వీ

# గ్రామ పంచాయితీ కార్మికులు ఏం కోరుతున్నారు?

***కనీస వేతనాలను పెంచాలని సమ్మె చేస్తున్న గ్రామ పంచాయతీ కార్మికుల హక్కులను ప్రభుత్వం కాలరాస్తూ, వారిపై తప్పుడు కేసులు పెడుతూ భయపెడుతోందని అంటున్నారు ఎం.శ్రీనివాస్***

'మేము పల్లెవాసులం...పారుశుద్ధ్య కార్మికులం. పల్లె ఒడిలో ప్రజల ఆరోగ్యాల కోసం పాటు పడేవాళ్లం. పరిశుభ్రత-పచ్చదనం, పర్యావరణ పరిరక్షణ నినాదాలు రాకముందే పల్లెల్లో ఊరు, వాడల పరిశుభ్రత - పచ్చదనం, పర్యావరణల కోసం మా ఆరోగ్యాలను ఫణంగా పెట్టినవాళ్లం.'

జూలై 23 నుండి గ్రామ పంచాయితీ కార్మికులు చేపట్టిన నిరవధిక రిలే నిరాహార దీక్షల ఉద్యమం ఐదవ వారంలోకి అడుగుపెట్టింది. ఇది 12,751 గ్రామ పంచాయితీలకు చెందిన 30 వేల మంది కార్మికుల, వారి కుటుంబాల జీవన్మరణ సమస్య. జీతభత్యాల మీదనే ఆధారపడిన ఈ కార్మికులలో అత్యధికులు దళిత, ఆదివాసీ, గిరిజన, బలహీన, మైనారిటీ వర్గాలే.

రెండు, మూడు దశాబ్దాలకు పైగా సేవలందిస్తున్న కార్మికులకు కనీస వేతనం లేదు. ఉద్యోగ భద్రత లేదు. జీతాలు పెంచరు, వచ్చే జీతాలు కూడా సకాలంలో సక్రమంగా ఇవ్వరు. చట్టబద్ధంగా లభించాల్సిన సౌకర్యాలు లభించవు. ఎనిమిది గంటల పనిదినం వారికి వర్తించదు. విధుల నిర్వహణలో నిర్దిష్ట సమయ పరిమితి ఉండదు. ఆదివారపు, పండుగల సెలవులు వారికి ఉండవు. నిజానికి వారిది వెట్టిచాకిరి. బానిసబతుకులు. వాళ్లు తమ ఆరోగ్యాలను ఫణంగా పెట్టి ఊరు, వాడ, ప్రజల ఆరోగ్యం కోసం రేయింబవళ్లు పనిచేసేవాళ్లు.

ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో జిపి కార్మికులు, ఉద్యోగులు ముఖ్యపాత్ర పోషించారు. తెలంగాణ రాష్ట్రమైతే వచ్చింది. వారి వెట్టిచాకిరీ పోలేదు. బతుకుకు భరోసా రాలేదు. 'బంగారు తెలంగాణ' నిర్మాణమే ధ్యేయంగా పనిచేస్తున్నామని చెప్పుకునే కెసిఆర్ తన పాలనలో బతుకు భరోసా కోసం రెండవ సారి గ్రామ పంచాయితీ కార్మికులు సమ్మెలోకి దిగారు. 2015లో కూడా ఇవే డిమాండ్లతో జి.పి. కార్మికులు 45 రోజులు సమ్మె చేశారు. పాలకుల వెన్నుపోటు, అణచివేతల కారణంగా ఉద్యమం ఫలదీకరణ చెంది ఫలితాలను ఇవ్వలేదు. ఆ విధంగా కార్మికులు ఉద్యమ ఫలాలను పొందలేకపోయారు.

కార్మికుల జీవనాధారమైన ఉద్యోగ భద్రతకు గ్యారెంటీ లేక, బంగారు తెలంగాణ సరే, మా బతుకులకు భద్రత ఏది అంటూ జి.పి. కార్మికులు ప్రశ్నిస్తున్నారు. వారు విధిలేని స్థితిలోనే సమ్మెబాట పట్టారు. నిరవధిక నిరాహార దీక్ష రూపంలో వారి ఆందోళన సాగుతోంది. అయినా ప్రభుత్వం 'నిమ్మకు నీరెత్తనట్లు'గా వ్యవహరిస్తున్నది. తీవ్ర నిర్లక్ష్యాన్ని ప్రదర్శిస్తుంది. కార్మికుల పట్ల ఇంతకంటే బాధ్యతారాహిత్యం, సామాజిక, మానసిక అణచివేత ధోరణి మరొకటి ఉండదు. న్యాయమైన డిమాండ్ల పరిష్కారానికి ప్రభుత్వం చొరవ చూపకపోగా ప్రతికూల వైఖరిని చేపట్టింది.

**జి.పి. కార్మికులు కోరుతున్నదేమిటి?**

వెట్టిచాకిరితో మగ్గుతున్న ఆ గ్రామీణ మట్టి మనుషులు అడుగుతున్న దేమిటి? పాలనాధికారంలో భాగస్వామ్యం కాదు. ప్రజా ప్రతినిధులకుండే వేతనాలు, సౌకర్యాలు కాదు. కేవలం వారి రెక్కల కష్టానికి తగిన ప్రతిఫలం మాత్రమే. చట్టబద్ధంగా రావాల్సిన హక్కులు మాత్రమే. గ్రామ పంచాయితీ కార్మికులకు కనీస వేతనాల చట్టం ప్రకారం వేతనాలివ్వాలంటున్నారు. వేతనాలకు ప్రభుత్వమే గ్రాంట్ మంజూరు చేయాలంటున్నారు. వారిని పంచాయతీరాజ్ ఉద్యోగులుగా గుర్తించాలంటున్నారు. ఉద్యోగ భద్రతలో భాగంగా పంచాయితీల్లో పనిచేస్తున్న కార్మికులను పర్మనెంట్ (ఉద్యోగాల క్రమబద్ధీకరణ) చేయాలంటున్నారు. కార్యదర్శులుగా పదోన్నతి కల్పించాలంటున్నారు. జనశ్రీ భీమా స్థానంలో రు. 5 లక్షల బీమా సదుపాయాన్ని కల్పించాలంటున్నారు. కార్మిక, ఉద్యోగులకు డీపీఓల చేత గుర్తింపు కార్డులు ఇవ్వాలంటున్నారు. అంత్యక్రియల కింద చెల్లించే మొత్తాన్ని రు. 20 వేలకు పెంచాలంటున్నారు. పిఎఫ్, ఇఎస్ఐ, ఇన్సూరెన్స్ సౌకర్యం కల్పించాలంటున్నారు.

2015 ఆగస్టు 14న పంచాయతి రాజ్ శాఖా మంత్రి కెటిఆర్ రాతపూర్వకంగా ఇచ్చిన ఒప్పంద హామీలను అమలు చేయాలంటున్నారు. జిపి సెక్రెటరీల నూతన నియామకాల కోసం నోటిఫికేషన్ ఇచ్చిన నేపథ్యంలో ఇన్‌సర్వీస్ ఉద్యోగులకు 50 శాతం అవకాశం కల్పించాలంటున్నారు. సమాన పనికి - సమాన వేతనం అమలు పరచాలంటున్నారు. గ్రామ సమగ్రాభివృద్ధిని దృష్టిలో పెట్టుకుని పంచాయితీలకు అవసరమైన నిధులను కేటాయించాలంటున్నారు.

ఈ డిమాండ్లు అత్యంత న్యాయసమ్మతమైనవి. ఈ చట్టబద్ధ హక్కులను చట్టపరిధిలనే సాధించుకోవడానికి ప్రయత్నించారు. అయినా ఫలితం దక్కలేదు. ప్రజాస్వామ్యంలో యూనియన్ పెట్టుకునే హక్కు, సమిష్టి బేరసారాలు చేసే హక్కును రాజ్యాంగం కల్పించింది. కనుకనే పారిశ్రామిక వివాదాల చట్టం - 1947 లోని సెక్షన్ 22 ప్రకారం సమ్మె నోటీసు ఇచ్చారు. అయినప్పటికీ ప్రభుత్వ వైపు నుండి కనీస స్పందన రాలేదు. ఇక విధిలేని పరిస్థితుల్లో కార్మికులు, ఉద్యోగులు సమ్మెలోకి దిగవలసి వచ్చింది. గతంలోనూ ఈ విధంగానే సమ్మెలోకి వెళ్లారు. కాని 'బంగారు తెలంగాణ' పాలకుల ఆదరణ కరువైంది. హామీలతో సానపట్టిన కత్తితో ఉద్యమ గొంతు కోసారు. తాత్కాలికంగా ఉద్యమాన్ని ఆపగలిగారు.

**కనీస వేతనాల చట్టం జిపి కార్మికులకు వర్తించదా?**

గ్రామ సేవకుల 'సేవ' చట్టం వర్తించనిదిగా, న్యాయంతో సంబంధం లేనిదిగా సాగుతుంది. భారత రాజ్యాంగంలో పొందుపరచిన మూడవ

షెడ్యూల్డ్‌లోనూ ప్రాథమిక హక్కుల్లో మూడవది 'దోపిడి నుండి రక్షణ పొందే హక్కు'. ఈ హక్కు ఆధారంగానే 1976లో కేంద్ర ప్రభుత్వం 'వెట్టిచాకిరి నిర్మూలన చట్టం' తెచ్చింది. ఆర్టికల్ 12 ప్రకారం గ్రామ పంచాయితీ కార్మికులకు కూడా ఈ చట్టం పరిధిలోకి వస్తారు. దశాబ్దాల తరబడి కింది స్థాయి ప్రభుత్వ పాలనా యంత్రాంగం జి.పి. కార్మికుల చేత వెట్టిచాకిరి చేయించుకుంటుంది. ఈ విషయం సంబంధిత మంత్రిత్వశాఖకు, లేబర్ డిపార్ట్‌మెంట్‌కు తెలియనిది కాదు. తెలిసినా, తెలియనట్లు వ్యవహరిస్తున్నాయి. ఈ విధంగా పనిచేయడం వారి బాధ్యత. ఉద్యోగ విధి కూడా అని అవి భావిస్తున్నాయి. ఇది ఎంత ఘోరం? అవును ఇది దొరల పాలన కదా! అందుకే ఈ దుస్థితి. ఇది దశాబ్దాల పాటు సాగుతున్న ప్రక్రియ. చట్టం ప్రకారం చెల్లించాల్సి వేతనాలకు దినసరి కూలీలు, ఉపాధి హామీ కూలీలు అర్హులైనప్పుడు గ్రామ పంచాయితీ కార్మికులు ఎందుకు అర్హులు కాకుండాపోయారు?

'కనీస వేతనాల చట్టం - 1948' ఈ కార్మికులకు తప్పనిసరిగా వర్తించవలసిన చట్టం. వర్తిస్తుంది కూడా. ఈ చట్టంలోని సెక్షన్-3, సబ్‌సెక్షన్-3బి ప్రకారం నెలవారి ఉద్యోగులకే కాదు, రోజువారి, ఒక గంటతో సహా రోజులో పరిమిత సమయం, పీస్ వర్క్ శ్రామికులకు సైతం ఈ చట్టం వర్తిస్తుంది. ఈ విధంగా గ్రామ పంచాయితీ కార్మికులు ఈ చట్టపరిధిలోకి వస్తారు. ఎందుకంటే స్థానిక ప్రభుత్వ అధికార సంస్థలు వీరిని నియమిస్తారు కనుక.

1983లో సంజిత్ రాయ్ వర్సెస్ రాజస్థాన్ ప్రభుత్వానికి మధ్య నడిచిన కేసులో కరువు నివారణ కార్యక్రమం కింద రాజస్థాన్ ప్రభుత్వం నియమించిన తాత్కాలిక ఉద్యోగులు కూడా 23వ ఆర్టికల్ కింద కనీస వేతనాలను పొందడానికి హక్కు కలిగి ఉన్నారని సుప్రీం కోర్టు తీర్పునిచ్చింది. మరో కేసులో కూడా తగినంత చెల్లింపులు (కనీస వేతనం) లేకుండా ఖైదీల చేత పని చేయించడం బలవంతపు చాకిరి కిందకు వస్తుంది. అది 23వ ఆర్టికల్ ఉల్లంఘనే అవుతుందని సుప్రీం కోర్టు పేర్కొన్నది. ఉపాధి హామీ పథకం కింద పనిచేసే కూలీలకు కనీస వేతనాల చట్టం కింద వేతనం చెల్లించాలని న్యాయస్థానాలు అనేక సందర్భాల్లో తీర్పులను వెల్లడించాయి.

2016 అక్టోబరు 26న సమాన పనికి సమాన వేతనం ఇవ్వాలని సుప్రీంకోర్టు తీర్పునిచ్చింది. ఈ తీర్పులు గ్రామ పంచాయతీ కార్మికులకు, ఉద్యోగులకు కూడా అక్షరాలా వర్తిస్తాయి. శ్రమదోపిడికి గురవుతూ గౌరవంగా బతికే హక్కును కోల్పోతూ వెట్టిచాకిరి చేసే జి.పి. కార్మికుల పట్ల పాలకులు అనుసరించే వైఖరి మాత్రం అమానవీయం. అనాగరికం.

### సహజ న్యాయ సూత్రానికి నోచుకోని జి.పి. కార్మికులు

జి.పి. కార్మికులకు, ఉద్యోగులకు విధిగా లభించాల్సిన సహజ న్యాయాన్ని కూడా చివరకు పాలకులు నిరాకరిస్తున్నారు. జూలై 24న ముఖ్యమంత్రి కెసిఆర్ 9,330 మందిని డిగ్రీ అర్హతతో పంచాయితీ రాజ్ శాఖలో నియామకాలు చేస్తామని, వారికి నెలకు రు.15 వేలు వేతనంగా ఇస్తామని స్వయంగా ప్రకటించాడు. తర్వాత క్రమంలో 6,603 పోస్టులకు కుదించి క్యాబినెట్ ఆమోదనతో ప్రకటించారు. మిగిలిన మూడు వేల పోస్టుల విషయం చెప్పలేదు. జీతాలు 14వ ఫైనాన్స్ కమీషన్ తర్వాత వచ్చే నిధుల నుండి చెల్లిస్తారట. ఇది ఆచరణ సాధ్యం కాని ప్రకటన.

కేంద్ర ప్రభుత్వం కొన్ని నిబంధనల ఆధారంగా నిధులు మంజూరు చేస్తుంది. ఈ నిధులు కేవలం కేంద్ర ప్రభుత్వ పథకాల అమలుకే ఖర్చు చేయవల్సి ఉంటుంది. ఈ నిధుల నుండి జి.పి. కార్మికులకు ఉద్యోగులకు వేతనాలు చెల్లించే అధికారం గ్రామ సర్పంచ్, కార్యదర్శులకు లేదు. అందుకే రాష్ట్ర ప్రభుత్వం 14వ ఫైనాన్స్ కమీషన్ నిధుల నుండి జీతాలు చెల్లిస్తామని చెప్పినప్పటికీ నిర్దిష్టమైన జీవోను కాని, మార్గదర్శకాలను ఇవ్వలేకపోవడానికి కారణం ఇదే. నిజానికి ఈ నిధులు కేంద్ర ప్రభుత్వం నుండి వచ్చేవి. గ్రామ పంచాయితీ కార్మికులను, ఉద్యోగులను పర్మినెంట్ చేయాలని, బిల్ కలెక్టర్, కారోబార్, ఇతర సిబ్బందిలో ఉన్న అనుభవాన్ని పరిగణిలోకి తీసుకుని 10వ తరగతి విద్యార్హతతో పంచాయితీ కార్యదర్శులుగా నియమించాలన్న ఉద్యమకారుల డిమాండ్‌ను నిరాకరించే వైఖరిని చేపట్టింది రాష్ట్ర ప్రభుత్వం.

అయితే, ఇక్కడొక విషయాన్ని గమనించాలి. గత ఉమ్మడి రాష్ట్రంలో ఏదైనా ఒక ప్రభుత్వ శాఖలో కొత్తగా ఉద్యోగ నియామకాలు చేయవల్సి వస్తే అప్పటికే ఆ శాఖలో పనిచేస్తున్న వారికి కొన్ని పోస్టులు కేటాయించేవారు. అర్హతలను బట్టి నియామకాలు జరిపేవారు. ఇది సహజ న్యాయసూత్రం. గ్రామ సేవకుల విషయానికి వస్తే ఉమ్మడి రాష్ట్రంలో కొన్ని పోస్టులను కేటాయించి జిఒ నెం.39 ద్వారా గ్రామ సేవకులను 10వ తరగతి విద్య అర్హతతో విఆర్ఒ పోస్టులలో నియమించారు. అదే విధంగా విద్యుత్ శాఖలో పనిచేస్తున్న కాంట్రాక్ట్ కార్మికులను రెగ్యులర్ ప్రాతిపదికపై జూనియర్ లైన్‌మన్‌లుగా నియమించారు. వైద్య, ఆరోగ్య శాఖలో కాంట్రాక్ట్ ఎఎన్ఎంలను పర్మినెంట్ చేశారు.

తెలంగాణ రాష్ట్రంలో (2014 తర్వాత) ఆర్‌టిసిలో పని చేస్తున్న కాంట్రాక్ట్ డ్రైవర్లను, కండక్టర్లను పర్మినెంట్ చేశారు. ఇటీవల కాలంలో ఐసిడిఎస్ శాఖలో సూపర్‌వైజ్ పోస్టుల భర్తీ సమయంలో అప్పటికే సర్వీస్‌లో ఉన్న అంగన్‌వాడీ టీచర్లకు విద్యార్హతలో మినహాయింపునిస్తూ నోటిఫికేషన్ ఇచ్చారన్న విషయాన్ని గమనంలో ఉంచుకోవాలి. ఈ విధంగా ప్రభుత్వం, అనుబంధ శాఖల్లో వేతనాలు ఇవ్వగలిగి, పర్మినెంట్ చేయగలిగిన ప్రభుత్వం గ్రామ పంచాయితీలలో ఎందుకు చేయలేక పోతున్నది?

### గ్రామ పంచాయితీ కార్మికులు - ప్రభుత్వ వైఖరి

గ్రామ పంచాయితీ పారిశుద్ధ్య కార్మికులను, ఉద్యోగులను హర్యానా, ఒడిశా, కేరళ, పశ్చిమ బెంగాల్, త్రిపుర రాష్ట్రాలలో పర్మినెంట్ చేశారు. కర్ణాటకలో అక్కడ ప్రభుత్వం జి.పి. కార్మికులను ప్రభుత్వ ఉద్యోగులుగా గుర్తించడమే కాకుండా వార్షిక బడ్జెట్‌లో ప్రత్యేక కేటాయింపులను చేసింది. 2017-18 వార్షిక బడ్జెట్‌లో రు.760 కోట్లు కేటాయించింది. కనీస వేతనం రు.10,225 నుండి రు.13,635 వరకు నిర్ణయించింది. పిఎఫ్, ఇఎస్ఐ, ఫించన్‌తో పాటు ఇతర సదుపాయాలు కల్పిస్తామని ప్రకటించింది. కేరళలో ఏ కార్మికుడికైనా కనీస వేతనం రు.600 చొప్పున నెలకు రు.18 వేలు ఉండే విధంగా నిర్ణయించి చెల్లిస్తోంది. తమిళనాడు, చత్తీస్‌ఘడ్, బెంగాల్ లాంటి రాష్ట్రాల్లో వార్షిక బడ్జెట్‌లో కేటాయింపులు, చేసి నిధులు విడుదల చేస్తూ వేతనాల చెల్లింపుకు చర్యలు తీసుకుంటు న్నాయి. మన రాష్ట్రంలో మాత్రం జి.పి. కార్మికులను, ఉద్యోగులను ప్రభుత్వ ఉద్యోగులుగా గుర్తించలేదు. రాష్ట్ర వార్షిక బడ్జెట్‌లో ప్రత్యేక

కేటాయింపులూ లేవు. కనీస వేతనం, ఉద్యోగ భద్రత, సంక్షేమ సదుపాయాలకు అవకాశం లేదు.

2015లో హైకోర్టు జి.పి. కార్మికులకు, ఉద్యోగులకు కనీస వేతనాలు చెల్లించాలని తీర్పునిచ్చింది. అంతే కాదు, ఐదు వారాలలో సంబంధిత నివేదికను అందజేయాలని కూడా ఆదేశించింది. ఈ తీర్పును రాష్ట్ర ప్రభుత్వం అమలు చేయలేదు. పైగా తప్పుడు నివేదికను సమర్పించి కోర్టును పక్కదారి పట్టించింది. అదే విధంగా 2015లో 45 రోజుల సమ్మె అనంతరం 2015 ఆగస్టు 14న నాటి పంచాయితీ రాజ్ శాఖ మంత్రి కేటిఆర్‌కు, కార్మిక సంఘాలకు మధ్య జరిగిన రాతపూర్వ ఒప్పందాలను పక్కన పెట్టారు. ఇటీవల రాష్ట్ర ముఖ్యమంత్రి కెసిఆర్ గ్రామ పంచాయితీలలో తక్కువ వేతనంతో పని చేస్తున్న వారికి కనీస వేతనం ఇస్తానని ప్రకటించాడు. నూతనంగా ఏర్పడిన 4 వేల పంచాయితీలతో కలిపి 16,751 పంచాయితీలలో కార్యదర్శులను ఇతర సిబ్బందిని నియమించుకోవాలని వారికి వేతనం రు.8,500 చెల్లించాలని ఆదేశాలిచ్చాడు. అయితే ఈ వేతన నిర్ణయానికి ప్రాతిపదిక ఏమిటో, వాటిని ఏ విధంగా చెల్లిస్తారో నిర్దిష్టంగా ప్రకటించలేదు. మార్గదర్శకాలు జారీ చేయలేదు. కాని అనధికారికంగా 14వ ఫైనాన్స్ కమీషన్ తరువాత వచ్చే నిధుల నుండి వేతనాలు ఇస్తామని చెప్తున్నాడు. ఈ నిధుల నుండి వేతనాలు జి.పి. కార్మికులకు చెల్లించడానికి నియమనిబంధనలు అంగీకరించవు. ఎందుకంటే ఇవి కేంద్ర ప్రభుత్వం ఇచ్చే నిధులు. కేంద్ర ప్రభుత్వ నిధుల నుండి వేతనాలిచ్చే అధికారం రాష్ట్ర ప్రభుత్వానికి లేదు.

వాస్తవానికి కేంద్ర 7వ వేతన సంఘం సిఫారసుల ప్రకారం కనీస వేతనం రు.18 వేలు ఇవ్వాలి. తెలంగాణ రాష్ట్ర కార్మిక శాఖ జారీ చేసిన జి.ఓ. నెం.11 ప్రకారం కార్మికులకు నెలకు అనగా అన్‌స్కిల్డ్ కార్మికులకు రు.8,658లు, సెమి స్కిల్డ్ కార్మికులకు రు.10,222లు, స్కిల్డ్ కార్మికులకు రు.12,544లు, హైస్కిల్డ్ కార్మికులకు రు.15,649లు ఇవ్వాలి. ఆర్థికశాఖ జారీ చేసిన జి.ఓ.నెం.14 ప్రకారం పారిశుద్ధ కార్మికుడికి రు.12 వేలు, డ్రైవర్, పంప్ ఆపరేటర్లకు రు.15 వేలు బిల్ కలెక్టర్, కారోబార్, కంప్యూటర్ ఆపరేటర్‌కు రు.17,500 కనీస వేతనంగా ఇవ్వాలని పేర్కొన్నది. ప్రస్తుతం జి.పి. కార్మికులకు, ఉద్యోగులకు ఇస్తున్న వేతనాలు చాలా స్వల్పమే. ప్రస్తుతం చెల్లిస్తున్న వేతనాలు బిల్‌కలెక్టర్, కారోబార్లకు నెలకు రు.2 వేల నుండి 3 వేలు. పంప్ ఆపరేటర్‌కు రు.1500 నుండి రు.2000. ఎలక్ట్రీషియన్లు, స్వీపర్లు, పారిశుద్ధ కార్మికులకు గరిష్టంగా రు.15,00 ఇస్తున్నారు. ఇవి కనీస వేతనం కాదు కదా, రోజువారి కూలీ కూడా గిట్టని పరిస్థితి.

మరోవైపున గ్రామ పంచాయితీల్లో వివిధ విభాగాల్లో పని చేస్తున్న కార్మికులను, ఉద్యోగులను ఒకే విభాగం కిందికి తెస్తూ 'మల్టీ పర్పస్ వర్కర్స్'గా మార్చడానికి ప్రభుత్వం ప్రతిపాదనలు సిద్ధం చేస్తుంది. దానితో ఇప్పటి వరకు కార్యనిర్వహక పనులు నిర్వహిస్తున్న బిల్ కలెక్టర్, కారోబార్లు కూడా మల్టిపర్పస్ వర్కర్స్‌గా మారుతారు. దీని వల్ల కార్మికులకు పనిభారం పెరుగుతుంది. ఆత్మగౌరవ సమస్య ముందుకు వస్తుంది.

రాష్ట్రంలో నూతనంగా ఏర్పడిన పంచాయితీలతో కలిపి 16,751 పంచాయితీలు ఉన్నాయి. వీటిలో 500 జనాభాకు లోబడిన చిన్న పంచాయితీలు వెయ్యికి పైగానే ఉన్నాయి. ఈ పంచాయితీల్లో (నూతనంగా ఏర్పడిన పంచాయితీలు మినహాయించి) ఇప్పటికే ఒక్కరో, ఇద్దరో కార్మికులు ఉన్నారు. మిగిలిన పంచాయితీల్లో 500ల జనాభాకు ఒకరు చొప్పున పారిశుద్ధ్య కార్మికులను నియమించనున్నారు. రాష్ట్రంలలో పంచాయితీల సగటు జనాభా 1500ల మంది. ఈ లెక్కన ప్రతి పంచాయితీ ముగ్గురు లేదా నలుగురు కార్మికులు నియమించుకోవచ్చు.

ఇక కొత్త పంచాయితీల్లో నియమకాలు తప్పనిసరి. ప్రతి పంచాయితీకి సగటున ముగ్గురు పారిశుద్ధ్య కార్మికులు అవసరం. మూడింటా రెండు వంతుల పంచాయితీలకు ఆదాయం అతిస్వల్పమే. అంటే 90 శాతం పంచాయితీలకు ఆదాయ మార్గాలు అంతంత మాత్రమే ఉన్నాయి. అసలు ఆదాయాలే లేని ఆదివాసీ గ్రామాలున్నాయి. మరోవైపున పంచాయితీల ఆదాయంలో 30 శాతం మాత్రమే కార్మికులకు, ఉద్యోగులకు వేతనాలు చెల్లించాలన్న నిబంధన ఉన్నది. 2015 ఆగస్టులో నాటి పంచాయితీ రాజ్ శాఖ మంత్రితో జరిగిన ఒప్పందంలో ఆయా పంచాయితీలకు ఉండే ఆదాయాన్ని బట్టి 40 నుండి 50 శాతం పెంచుకోవచ్చునని చెప్పినప్పటికీ నిధులే లేని పంచాయితీలకు ఉపయోగమేమిటి?

12,751 పంచాయతీలకు చెందిన 30 వేల మంది కార్మికులు, ఉద్యోగులు న్యాయమైన డిమాండ్ల కోసం చట్టపరిధిలోనే ఆందోళన చేస్తున్నారు. ఉద్యమకారుల డిమాండ్లలో న్యాయపరమైన చట్టబద్ధత ఉన్నది. దాని ఆధారంగా వాటి పరిష్కారానికి ప్రభుత్వం చొరవ చూపాలి. కానీ, ప్రభుత్వ వైఖరి అందుకు భిన్నంగా ఉన్నది. సమ్మెను విచ్ఛిన్నం చేయడానికి కార్మిక సంఘాలను, కార్మికులకు ప్రాతినిధ్యం వహించే నాయకత్వాలను కాదని జిల్లా కలెక్టర్లు, ఎంపిడివో, డీపీవోల ద్వారా సమ్మెను దెబ్బ తీయడానికి చర్యలు చేపట్టింది. ఉద్యమాన్ని, కార్మికులను చీల్చడానికి తెరలేపింది. గతంలో హైకోర్టు ఇచ్చిన తీర్పుని, ఆదేశాలను బేఖాతరు చేసింది. సమ్మె విరమించకపోతే తొలగిస్తామని బహిరంగంగానే ప్రకటిస్తుంది. సిఎం అదేశం మేరకు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఈ ప్రకటన చేశాడు. ఈ చర్య అప్రజాస్వామికం, రాజ్యాంగ విరుద్ధం కూడా.

చట్టబద్ధంగా జరుగుతున్న సమ్మెను ప్రభుత్వం విచ్ఛిన్నం చేయడం అన్‌ఫేయిర్ లేబర్ ఫ్యాక్టీరీసెస్ కిందికి వస్తుంది. హక్కుల కోసం చట్టపరిధిలో ఆందోళన చేయడం పాలకుల దృష్టిలో నేరం. అందుకే వారు కార్మికుల ఐక్యతను విచ్ఛిన్నం చేయడానికి, సంఘటిత ఉద్యమాన్ని దెబ్బతీయడానికి చేయవల్సిన కుట్రలన్నీ చేస్తారు, చేస్తున్నారు కూడా. కెసిఆర్ ప్రభుత్వం కార్మికులపట్ల అత్యంత నిరంకుశంగా, అణచివేత ధోరణితో వ్యవహరిస్తోంది. అక్రమ అరెస్టులు, కేసులతో కార్మికుల్లో భయానక వాతావరణం సృష్టిస్తున్నది. ఇది పాలకుల స్వభావం. ఇందులో తెలంగాణ పాలకులు మరో అడుగు ముందున్నారు. జి.పి. కార్మికుల ఆందోళనల్లో ఇది మరింత స్పష్టమౌతుంది.

అయితే ప్రభుత్వం అదిరించినా, బెదిరించినా, కుటిల యత్నాలు చేసినా తాము ఉద్యమబాటను వీడబోము. ఐక్యతలో పట్టు సడలనివ్వం. మాది ఒకటే లక్ష్యం… ఒకటే గమ్యం… అంటూ గ్రామ పంచాయితీ కార్మికులు ఒకే గొంతుతో ఉద్యమం సాగిస్తున్నారు. వారి న్యాయమైన చట్టబద్ధ హక్కుల సాధనకు చేస్తున్న ఉద్యమాన్ని బలపరచాలి. అండగా నిలబడాలి. ఉద్యమంలో భాగస్వామ్యమై ప్రభుత్వంపై ఒత్తిడి పెంచాలి. కార్మికులు ఆత్మస్థైర్యాన్ని పెంచుకోవాలి. పోరాటానికి మరింత పదును పెట్టాలి. తద్వారా సమస్యలను పరిష్కరించుకోవాలి. హక్కులను దక్కించుకోవాలి.

*(రచయిత ఇఫ్టూ తెలంగాణ రాష్ట్ర కార్యదర్శి)* వీ

# పర్యావరణాన్ని విషతుల్యం చేస్తున్న సిమెంట్ పరిశ్రమలు

***సిమెంట్ ఫ్యాక్టరీల నిర్మాణంలో కాలుష్య నియంత్రణ ప్రమాణాలు పాటించకపోవడం వల్ల పర్యావరణ కాలుష్యం తీవ్రంగా ఉందనీ, దీనికి ప్రభుత్వ వ్యవస్థల నిర్లక్ష్యం, అవినీతి కూడా ప్రధాన కారణమనీ అంటున్నారు*** **ఎం. రత్నమాల**

**ఈ** సిమెంట్ ఫ్యాక్టరీలొచ్చి మా నల్లరేగడి భూముల్ని తెల్లరేగడి చేసినయి. పంట పొలాల్నే కాదు ఇండ్ల కప్పుల మీద, ఇంటి గోడల మీద, గొడ్లమేత భూమ్మీద పచ్చగడ్డి, ఎండుగడ్డి వాముల మీద, చెట్లు, ఆకుల మీద సిమెంటు పరిశ్రమ పొగ గొట్టాల్లోంచి పైకొచ్చి గాలిలో కలిసివచ్చిన సిమెంటు దూలి రాలిపడి పేరుకుపోయి ఎక్కడ చూసినా ముతక తెలుపు (సిమెంట్) కనిపిస్తుంది. ఇక నీళ్లలో అయితే మరీ స్పష్టంగా సిమెంటు పైన పొరలా తేలుతూ కన్పిస్తుంది. నీటి కాల్వల్లో, సున్నపు రాయి కోసం తవ్విన దాదాపు చెరువుకంటే విస్తీర్ణం లోతు ఉన్న బొందల్లో ఈ సిమెంటు కలిసిన నీళ్లు తాగి పశువులు చచ్చిపోతున్నాయి – ఇది మఠంపల్లి మండలంలోని 33 తండాలు, 15 గ్రామాల ప్రజల ఆవేదన.

హుజూర్‌నగర్ నియోజకవర్గం సూర్యపేట జిల్లా మఠంపల్లి మండలంలో ఉన్న అయిదు సిమెంట్ ఫ్యాక్టరీల కాలుష్యం ఎంత తీవ్రంగా ఉందంటే సిమెంటు తయారీ కావలసిన ముడి పదార్థం సున్నపురాయి (సింమెంటు రాయి) కోసం తవ్విన గుంటలో పరిశ్రమ వ్యర్థాలు తెచ్చిపోశారని, వాన కాలంలో వర్షాలకు ఆ గుంటలో చేరిన నీళ్లు తాగిన ఆవులు ఒకే రోజు అక్కడికక్కడే చనిపోయాయని చెప్పారు. ఈ సంవత్సరం జనవరి నుంచి ఇప్పటివరకు 200 ఆవులు, ఎడ్లు చనిపోయాయని చెప్పారు.

ఆగస్టు 9న సాగర్ సిమెంటు పరిశ్రమ విస్తరణ కోసం నిర్వహించిన పబ్లిక్ హియరింగ్ సందర్భంగా పర్యావరణ పరిరక్షణ సమితి తరపున వెళ్లాము. అందులో ఇస్లావత్ బాలాజీ నాయక్, గడ్డం అశోక్ మొదలైనవారు, ఇంకా పియుసిఎల్ తెలంగాణ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి జయ వింధ్యాల, విరసం, విస్తాపక్ విరోది జనవికాస్ ఆందోళన్ నిర్వాసిత వ్యతిరేక ప్రజాందోళన జాతీయ కమిటీ నుంచి నేను (రత్నమాల) ఆగస్టు 8, 9 తేదీల్లో మఠంపల్లి మండలం వెళ్లాము. సిమెంటు ఫ్యాక్టరీ కాలుష్య బాధిత ప్రజలతో మాట్లాడాము. 1983 నుంచి 85 వరకు ఒకటొకటిగా పెట్టిన ఐదు పరిశ్రమలు వెదజల్లుతున్న కాలుష్యం వల్ల జరిగిన నష్టాన్ని తెలుసుకున్నాం. పరిశ్రమల యాజమాన్యానికి ప్రభుత్వం ఎంతగా తోడ్పడుతున్నా ఆగస్టు 9న ఉదయం పబ్లిక్ హియరింగ్ జరుగుతున్న ప్రాంతానికి వెళుతున్న మా నిజ నిర్ధారణ బృందాన్ని హుజూర్‌నగర్ దాటగానే అరెస్టు చేసి మఠంపల్లి మండలం చివరి పోలీస్ స్టేషన్‌లో (ప్రివెంట్ డిటెన్షన్) నిర్బంధించి ప్రజాభిప్రాయ సేకరణ పూర్తి అయిన గంట తర్వాత వదిలేశారు. ఈ పోలీస్ స్టేషన్ ప్రజాభిప్రాయ సేకరణ జరుగుతున్న (ఫ్యాక్టరీ కూడా అక్కడే ఉంది) మట్టపల్లి గ్రామానికి 70 కిలోమీటర్ల దూరంలో ఉంది. దీన్నిబట్టి ప్రభుత్వ పోలీసు యంత్రాంగం పరిశ్రమకు ఎంతగా సహకరిస్తున్నదో అర్థం చేసుకోవచ్చు. ఇక జరిగిన ప్రజాభిప్రాయ సేకరణ కూడా ఒక పెద్ద ప్రహసనంగా, బూటకంగా జరిపించారు.

సాగర్ సిమెంటు పరిశ్రమలో 800 మంది కార్మికులు పనిచేస్తున్నారు. 8న మేం కొందరు కార్మికులను కలిసి మాట్లాడాం. ప్రజాభిప్రాయ సేకరణ మా కార్మికుల్ని హాజరు అయ్యి టెంటంతా నిండిపోవాలని యాజమాన్యం ఆదేశించిందని అయినా తాము హాజరు కాదలచుకోలేదని చెప్పారు. వీరు దినసరి ప్రాతిపదికపై పనిచేసే కార్మికులు. ఎట్లాగూ రోజు పని దొరికేది లేదు. నెలలో కొన్ని రోజులే పనిదొరుకుతుంది. మిగతా రోజులు ఇతర పనులు వెతుక్కుంటారు. ఈ పనిపోతే ఇతర కూలీ పనులే చేసుకుంటాం అన్నారు. సాగర్ సిమెంట్స్‌లో 800 మందిలో పర్మినెంట్ కార్మికులు 250 మంది దాకా ఉంటారని, మిగతా వారంతా దినసరి కార్మికులే. 9న ప్రజాభిప్రాయ సేకరణకు 200 మంది (అందరూ సాగర్ సిమెంట్స్ ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికులే) మరో 20 మంది గ్రామాలు, తండాల ప్రజలను ప్రజాభిప్రాయ సేకరణకు రాకుండా చేయడానికి డబ్బు ఇచ్చి కూడగట్టుకున్న స్థానిక గూండాలు మొత్తం 220 మందిలో ప్రజాభిప్రాయ సేకరణ అయిందని పంచారు. అయినప్పటికి వారిలో నలుగురైదుగురు సాగర్ సిమెంటు వెదజల్లుతున్న కాలుష్యం గురించి మాట్లాడారని తెలిసింది.

సాగర్ సిమెంటు ఇండస్ట్రీస్ లిమిటెడ్ కాలుష్య బాధిత గ్రామాలు, తండాలు–1) పెదవీడు, 2) రామచంద్రాపురం, 3) గుర్రంపోడు తండా, 4) సుల్తాన్‌పురం తండా, 5) మంచ్చతండా, 6) కృష్ణతండా, 7) అవరేణికుండా తండా, 8) తీగల చెర్వుతండా, 9) బిల్యా నాయక్ తండా, 10) బోజ్యతండా.

మఠంపల్లి మండంలంలో ఇప్పటికీ అయిదు సిమెంటు పరిశ్రమలు 1) సాగర్ సిమెంటు ఇండస్ట్రీస్ లిమిటెడ్, 2) ఎన్‌సిఎల్ (నాగార్జున సిమెంటు లిమిటెడ్, 3) అదురేశ్వరి సిమెంట్స్ (ఇది పై రెండింటి కంటే చిన్న పరిశ్రమ. దాని సాగర్ సిమెంటు ఇండస్ట్రీ టేకోవర్ చేసుకున్నది), 4) గ్రేగోల్డ్ సిమెంట్స్ (ఇదీ చిన్న పరిశ్రమే), 5) కామాక్షి సిమెంట్స్ (ఇదీ చిన్నదే), 6) కొత్తది నిర్మాణంలో ఉంది.

ఈ 33 తండాల్లో, 15 గ్రామాల్లో మొత్తం 2700 ఎకరాల సాగు భూమి ఉంది. ఫ్యాక్టరీలు కట్టడానికి ముందు ఇంకా ఎక్కువ సాగుభూమి ఉండేదని చెప్పారు. ఇప్పుడు తక్కువ సాగుభూమి ఉండడానికి కారణం సిమెంటు పరిశ్రమలు. ఒక్కొక్కటి 250 నుంచి 300 వరకు ఎకరాల దాకా మార్కెట్ రేటు కాకుండా నామమాత్రపు ధర ఇచ్చి–ఎకరాకు రెండు వేలు– కొందరికి అదీ ఇవ్వలేదు. వారు పోరాడి సాగుచేసుకున్నారు. ఇది ప్రభుత్వ భూమి అని చెప్పి స్వాధీనం చేసుకున్నారని చెప్పారు.

ఒక్కో పరిశ్రమకు మధ్య 200 నుంచి 300 కిలోమీటర్ల దూరం

ఉంటుంది. చాలా గ్రామాలు, తండా రెండు ఫ్యాక్టరీల మధ్య కొన్ని మూడు ఫ్యాక్టరీల మధ్య ఉన్నందున రెండు దిక్కుల నుంచి మూడు దిక్కుల నుండి సిమెంటు దూళి పడుతుంది. అప్పుడు ఎకరాకు రెండు వేలు ఇచ్చి తీసుకున్నా అప్పుడు మార్కెట్ రేటు కంటే ఇది చాలా తక్కువ. ఇప్పుడైతే ఇక్కడ ఎకరా కోటి రూపాయలు అని చెప్పారు.

9న ప్రజాభిప్రాయ సేకరణ వద్ద ఆరుగురు ఎస్ఐలు, నలుగురు సిఐలు, 150 మంది పోలీసు బలగాన్ని మోహరించి నిర్బంధ ప్రజాభిప్రాయ సేకరణ చేశారు. అంతకు ముందు ఇదే సంవత్సరం జూన్ 29న నాగార్జున సాగర్ సిమెంటు పరిశ్రమల (ఎన్‌సిఎల్) విస్తరణకు ఇదే విధంగా 500 మంది పోలీసు బలగాన్ని మోహరించింది. బూటకపు ప్రజాభిప్రాయ సేకరణ జరిపినట్లు పర్యావరణ సమితి సభ్యులు చెప్పారు. స్థానిక రైతులు, ఇతర బాధిత ప్రజలు కుటుంబాలకు చెందిన హైదరాబాద్‌లో చదువుకుంటున్న విద్యార్థులు, స్థానిక రైతులు సిమెంట్ పరిశ్రమ కాలుష్యానికి వ్యతిరేకంగా పోరాడ్డానికి ఈ పర్యావరణ పరిరక్షణ కమిటీని ఏర్పరుచుకున్నారు. పరిశ్రమలు పెట్టినప్పుడు వీటివల్ల కలిగే అనర్థాల గురించి అప్పుడు తమకంతగా తెలియదని చెప్పారు.

1983లో పరిశ్రమలు పెట్టినప్పటి నుంచి తమ ఆరోగ్యాలు దెబ్బతినడం, ఊపిరితిత్తులు దెబ్బతినడం, శ్వాసకోసం పాడయిపోవడం, కడుపులో నొప్పి, ఇంకా కళ్ల జబ్బులు, చిన్న పిల్లలకు కూడా రావడం, పశువులు చనిపోవడం, పంట భూములు పాడైపోవడం, పంట దిగుబడి తగ్గడమే కాదు గతంలో పొగాకు, మిర్చి బాగా పండేదని ఇప్పుడు రెండు పంటలు అసలు లేనే లేవని రైతులు చెప్పారు. అంతేకాదు వందల మంది కార్మికులు పనిచేస్తున్న ఈ పరిశ్రమలో కార్మిక సంఘం లేదని చెప్పారు. భూములు కోల్పోయి, పశు సంపద నష్టపోయి, ఆరోగ్యాలు పాడై కూడా ప్రజలు నిత్య నిర్బంధంలో బతుకుతున్నారనడానికి రామచంద్రపురం గ్రామ వాస్తవ్యుడు మాలోతు వెంకటేష్ పరిస్థితి ఒక ఉదాహరణ.

ఇంట్లో ఇద్దరికి ఉద్యోగాలు ఇస్తాం అని చెప్పి వెంకటేష్‌కు తాత ముత్తాతల వారసత్వంగా వచ్చిన భూమిని సాగర్ సిమెంట్స్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ స్వాధీనం చేసుకున్నది. తీసుకున్న భూమికి డబ్బు ఇవ్వలేదు. ఉద్యోగాలు ఇవ్వలేదు. ఈ విషయం జూన్ 29న ప్రజాభిప్రాయ సేకరణకు ముందు ఈ విషయాలు పత్రికల వారితో మాట్లాడినందువల్ల జూన్ 24న అర్ధరాత్రి పరిశ్రమకు చెందిన గూండాలు మాలోతు వెంకటేష్ ఇంటిని చుట్టుముట్టి బీభత్సం సృష్టించారని, ఇంటిల్లిపాది భయంతో వనికిపోయామని కుటుంబ సభ్యులు చెప్పారు. మేం వెంకటేష్ ఇంటికి వెళ్లాం. చుట్టుపక్క ఇండ్ల వారు కూడా భయపడిపోయారని చెప్పారు.

ఈ విషయం వెంకటేష్ పియుసిఎల్ జయ వింధ్యాలకు వెంటనే ఫోన్ చేసి చెప్పగా ఆమె స్థానిక పోలీస్‌స్టేషన్‌కు ఫోన్‌చేస్తే స్పందించక పోవడంతో హైదరాబాద్‌లో రాష్ట్ర పోలీస్ ఉన్నతాధికారులకు ఫోన్ చేస్తే అప్పుడు పోలీసులు అక్కడికి వచ్చి గూండాలను మర్యాదగా పంపించారని, దీని మీద వెంకటేష్ ఇచ్చిన ఫిర్యాదును స్వీకరించకపోగా, పరిశ్రమ యాజమాన్యం తప్పుడు ఫిర్యాదుపై వెంకటేష్‌ను మరికొందరిని అరెస్ట్ చేసి 29 ప్రజాభిప్రాయ సేకరణ తర్వాత విడిచిపెట్టారని చెప్పారు.

అప్పటి ఉమ్మడి రాష్ట్రంలోనైనా, ఇప్పుడు తెలంగాణ రాష్ట్రంలోనైనా నల్లగొండ (పాత జిల్లా) లోనే ఎక్కువ సిమెంట్ పరిశ్రమలు ఉన్నాయి. నల్లగొండ జిల్లాలో మొత్తం 13 సిమెంటు పరిశ్రమలు, ఇప్పుడు నిర్మాణంలో (మఠంపల్లి మండలంలో) ఉన్న పరిశ్రమలతో కలిపి మొత్తం 14 సిమెంటు పరిశ్రమలు నల్లగొండలో ఉన్నాయి. మిగతావన్ని పాత ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లోని గుంటూరులో 4, కడపలో 3, ఆదిలాబాద్‌లో 3, అనంతపురంలో 2, కృష్ణా జిల్లాలో 2, నల్లగొండ జిల్లాలో మఠంపల్లి తర్వాత మిగతావి మిర్యాలగూడ మండలంలో ఉన్నాయి.

1998లో పౌరహక్కుల సంఘం అధ్యక్ష బాధ్యతలో ఉన్నప్పుడు రాష్ట్రంలో సిమెంటు పరిశ్రమల కాలుష్యంపై నిజ నిర్ధారణ సిఎల్‌సి బృందంతో పాటు పర్యటించిన సందర్భంగా మిర్యాలగూడలో ఇదే పరిస్థితిని గమనించాం.

కృష్ణా పరివాహక ప్రాంతంలో సిమెంటు తయారీకి అవసరమైన ముడిసరుకు సున్నపురాయి సమృద్ధిగా భూమిలో ఉంది. కనుక రాష్ట్రంలోకెల్లా ఇక్కడ సిమెంట్ పరిశ్రమలు నెలకొల్పారు. నిర్మాణాలకు సిమెంటు అవసరమే. ఇందుకోసం సిమెంటు పరిశ్రమలు అవసరమే కావచ్చు. కాని ఈ పరిశ్రమలు కాలుష్య నివారణ నియంత్రణ చర్యలు తీసుకోవాలి. కేంద్ర ప్రభుత్వం 1974లో నీటి కాలుష్య నివారణ నియంత్రణ చట్టం, 1981లో గాలి కాలుష్య నియంత్రణ నివారణ చట్టం ఈ రెండు చట్టాల ప్రకారం 3 నెలల శిక్ష ఉంటుంది. 1986లో కేంద్ర ప్రభుత్వం చేసిన పర్యావరణ (పరిరక్షణ) చట్టం కింద కాలుష్య నియంత్రణ నివారణ చర్యలు పాటించని పరిశ్రమల యాజమాన్యాలకు అయిదు సంవత్సరాల శిక్ష ఉంటుంది. అంతేకాదు భూములు కోల్పోయిన వారికి ప్రస్తుత నిర్వాసిత చట్ట ప్రకారం భూమికి భూమి, ఇంటికి ఇల్లు ఇవ్వాల్సి ఉంటుంది. నష్టపరిహారం అన్నది కాకుండా పునరావాసం జీవనాధారం కల్పించాల్సి ఉంటుంది. కాలుష్య నియంత్రణ చట్టాల అమలును పర్యవేక్షించి చర్యలు తీసుకోవలసిన బాధ్యత కాలుష్య నియంత్రణ నివారణ బోర్డు (పిసిబి) ది అయితే పిసిబి ఇటువంటి బాధ్యత నిర్వహిస్తున్నట్లు కనపడదు. పైగా ఎవరైనా పరిశ్రమల కాలుష్యంపై కోర్టులో ప్రైవేట్ కంప్లేంట్ వేయాలన్నా రెండు నెలలు ముందుగా ఈ విషయం కాలుష్య నియంత్రణ బోర్డుకు నివేదించాల్సి ఉంటుంది. కాలుష్య నియంత్రణ బోర్డు తన బాధ్యతలు సక్రమంగా నిర్వహిస్తున్న దాఖలా ఎక్కడా కనిపించదు. 'బోర్డు అధికారులు కంపెనీ గెస్ట్ హౌజ్‌లో కూర్చుని అక్కడే కంపెనీవాళ్లు ఇచ్చింది పుచ్చుకుని వాళ్లు చెప్పిందే రాసుకుని పోతారు' అంటూ బాధితులు చెప్పిన విషయాలు అక్షర సత్యాలు.

ఈ నెల 9న సాగర్ సిమెంట్స్ నిర్వహించిన బూటకపు ప్రజాభిప్రాయ సేకరణ కాలుష్య నియంత్రణ నివారణ బోర్డు జిల్లా బోర్డు పర్యావరణ ఇంజనీరు కూడా పాల్గొన్నాడు. చట్టప్రకారం కాలుష్య నియంత్రణ నివారణ బోర్డు అడిగిన సమాచారం ఇవ్వకపోయినా, కాలుష్యాన్ని లెక్కించడం కోసం బోర్డు నెలకొల్పిన పరికరాలను తొలగించినా, పాడు చేసినా, గాలిలోకి కానీ, నీటిలోకి కానీ ఫ్యాక్టరీ వదులుతున్న వ్యర్థ పదార్థాలను నిలిపివేయాల్సింది. బోర్డు ఇచ్చిన ఆదేశాలను పాటించక పోయినా, కాలుష్య నియంత్రణ నివారణ బోర్డు ఇచ్చిన నెలకొల్పమని చెప్పి కాలుష్య నివారణ నియంత్రణ యంత్రాలను నెలకొల్పకపోయినా, ఒక్కో దానికి 3 నెలల చొప్పున శిక్ష విధించవచ్చు. కాని కాలుష్య నియంత్రణ అమలు చేయు బోర్డే వీటిని అమలు చేయించాల్సిన బాధ్యతను నిర్వహించలేదు. అందుకే పరిశ్రమలు కాలుష్య నియంత్రణ నివారణ చర్యలు బేఖతరు చేసినా అడిగేవారు లేరనే ధీమాతో కాలుష్యాన్ని యథేచ్ఛగా విడుదల చేసిన ప్రజల ఆరోగ్యాన్ని దెబ్బతీస్తున్నాయి. పర్యావరణాన్ని విధ్వంసం చేస్తున్నాయి. దీన్ని అడ్డుకోగలిగేది ప్రజల చైతన్యం, పోరాట పటిమలు మాత్రమే.

*(రచయిత విరసం సభ్యురాలు)* వీ

# ఎస్‌సి, ఎస్‌టి అత్యాచార నిరోధక చట్టం

*చట్టాలను తయారు చేసేదీ, అమలు పరిచేదీ ప్రభుత్వాలయినా, వాటిని దీర్ఘకాలికంగా కాపాడేది ప్రజా చైతన్యం, ఉద్యమం మాత్రమేనని అంటున్నారు* **బి. రామకృష్ణ**

**త**న మీద పెట్టిన కేసును రద్దు చేయమని కోరితే ఏకంగా చట్టంలోని సెక్షన్‌లనే రద్దు చేసే లేదా బలహీనం చేసే తీర్పు బయటకు వచ్చింది. హైకోర్టు తీర్పుపై సుప్రీంకోర్టులో అప్పీల్ చేసినప్పుడు కింది కోర్టు తీర్పును సమర్థిస్తూనో, వ్యతిరేకిస్తూనో తీర్పు చెప్పవచ్చు. అంతటితో ఆగిపోవచ్చు. కాని ఎస్‌సి, ఎస్‌టి అత్యాచార నిరోధక చట్టం 1989లోని కీలకమైన సెక్షన్ 18ని బలహీనం చేస్తూ తీర్పు వచ్చింది. ఇందుకోసం పడిన తాపత్రయం అంతా ఇంతా కాదని 2018, మార్చ్ 20న ఆదర్శకుమార్ గోయల్, ఉదయ్ ఉమేష్ లలిత్‌లతో కూడిన ఇద్దరు న్యాయమూర్తుల ధర్మాసనం ఇచ్చిన 89 పేజీల తీర్పు చదివితే తెలుస్తుంది.

ఈ చట్టం కోరలు పీకేయడానికి వారనుకున్న ఆధారాలను వెతికి, వెలికి తీయడానికి ఎంతో శ్రమపడినట్లు అర్థం అవుతుంది. రెండున్నర దశాబ్దాలకు పైగా అమల్లో ఉన్న చట్టానికి గల కోరలు పనిచేసింది కూడా చాలా తక్కువే. ఆ మాత్రం దాన్ని కూడా సహించడానికి సిద్ధంగా లేని వాతావరణం అలుముకుని ఉన్నది.

2017 మేలో మహారాష్ట్ర హైకోర్టు ఇచ్చిన తీర్పుపై సుప్రీంకోర్టుకు అప్పీల్‌కు వెళ్లగా 2017 నవంబర్‌లో మొదలైన న్యాయ విచారణ ప్రక్రియ 2018 మార్చ్ 20న వచ్చిన తీర్పుతో ముగిసింది. ఎంత సత్వర న్యాయమో కదా.

ఇంత తొందరగా కేసును తెంపినందుకు సంతోషపడవల్సిందే. ఇంకా ఆలస్యం చేస్తే ఈ చట్టం వల్ల ఎంతోమంది నష్టపోవచ్చనే ఆత్రుతను తెలుసుకోవాల్సిందే. వెదకబోయిన తీగ కాలికు తగినట్లుగా ఇటువంటి కేసు తమ వద్దకు వచ్చినందుకు ముందే సిద్ధం చేసుకున్న చందంగా స్పందించిన తీరునూ తెల్సుకోవల్సిందే.

తనపై మోపబడిన ఎఫ్‌ఐఆర్‌ను తొలగించమని కాశినాథ్ మహాజన్ సుప్రీంకోర్టును అభ్యర్థించాడే కాని అత్యాచార నిరోధక చట్టం దుర్వినియోగం అవుతున్నదని, అందులోని సెక్షన్ 18 రాజ్యాంగానికి, అంతర్జాతీయ హక్కుల ప్రకటనకు, సమానత్వానికి వ్యతిరేకమైనదని దాని రాజ్యాంగబద్ధతను ప్రశ్నించలేదు. దానిని తొలగించమనో, బలహీనం చేయమనో అడగలేదు. తమకు తాముగానే ఈ చట్టంలోని ముందస్తు బెయిల్ నిరాకరణను తీవ్రమైన విషయంగా పరిగణించి దాన్ని వ్యతిరేకించడానికి వ్యక్తుల న్యాయమైన హక్కులకు భంగం కలిగిస్తున్న సందర్భాలలో గతంలో ఇవ్వబడిన తీర్పులను ఉల్లేఖించారు.

అమికస్ క్యూరిగా ఈ చట్టంపై విశేష అనుభవమున్న వారినో, ఎస్‌సి, ఎస్‌టి కమిషన్‌లో, హక్కుల ఉద్యమంలో పనిచేసిన లేదా భాగస్వాములైన న్యాయవాదులనో, న్యాయమూర్తులనో పెట్టుకోవచ్చు. ఈ చట్టం వచ్చిన నేపథ్యాన్ని వారు వివరించి ఉండేవారు. దళితులపై అత్యాచారాలను అడ్డుకోవడానికి ఎందుకు ఈ చట్టం కింద ముందస్తు బెయిల్ నిరాకరణ అవసరమో తెలిపి ఉండేవారు.

ఒక్క ఈ చట్టం కింద మాత్రమే ముందస్తు బెయిల్ నిరాకరించ బడలేదని, ఇతర కేసుల్లో (కాగ్నిజెబుల్/నాన్ కాగ్నిజెబుల్) కూడా బెయిల్ నిరాకరిస్తున్నదనే విషయాన్ని వివరించేవారు. అలా కాకుండా తమ వాదనలకు అనుకూలంగా స్పందించగల వారిని అమికస్ క్యూరిగా నియమించారు.

ఆధారాలు చూపకుండానే లేదా వక్రీకరింపబడిన ఆధారాలతో ఈ చట్టం దుర్వినియోగం అవుతున్నదనిస ఈ చట్టం కులతత్వం పెంచడానికి దోహద పడుతుందని చెబుతోంది. ఈ చట్టం దుర్వినియోగపర్చ బడుతున్నదని తేల్చేసారు. కాబట్టి దాన్ని కట్టడి చేసే బాధ్యత వారిపై పడనే పడుతుంది. అందుకోసమే ముందస్తు బెయిల్ ఇవ్వరాదని, ఈ చట్టంలోని సెక్షన్18 చెబుతున్న దాన్ని పక్కనబెట్టి బెయిల్ ఇవ్వవచ్చని తదితర విషయాలను కూడా చెబుతూ రూలింగ్ వచ్చేసింది.

ఎస్‌సి, ఎస్‌టిలు ఫిర్యాదు చేస్తే వెంటనే కేసులు నమోదు చేయవద్దని, ఒకవేళ నమోదు చేసినా వెంటనే అరెస్ట్ చేయడానికి వీలులేదని, డిప్యూటీ సూపరింటెండ్ ఆఫ్ పోలీస్ అధికారి విచారించాక ఇందులో ఏ దురుద్దేశ్యాలు లేవనే నిర్ధారణకు వస్తేనే కేసులు నమోదు చేయాలని న్యాయం చెప్పబడింది. ఈ చట్టం ప్రకారం కేసును నమోదు చేసే స్థాయిలోనే వీగిపోయేలా నిబంధనలను కఠినతరం చేయగలుగుతారు. ముద్దాయిలు ప్రభుత్వ ఉద్యోగులైతే వారి అరెస్టుకు వారి ఉన్నతాధికారుల అనుమతి తప్పనిసరి అని, అలాగే ప్రభుత్వ ఉద్యోగులు కాని వారి అరెస్టుకు ఆ జిల్లా సీనియర్ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ అనుమతి తప్పనిసరిగా కావాలనే కొత్త నిబంధన జోడించబడుతుంది. ఈ మార్గదర్శకాలను ఉల్లంఘిస్తే కోర్టు దిక్కారం కిందకు వస్తుందని పోలీసులకు హెచ్చరికలు చేసే షరతులను చేర్చి వారిని ఈ చట్టాన్ని అమలు చేయడానికి నిరాసక్తులను చేయగలుగుతారు.

పౌరుల వ్యక్తిగత స్వేచ్ఛకు, జీవించేహక్కుకు, సమానత్వాలకు భంగం కలిగిన సందర్భాలలో వాటిని రక్షించడానికి ఇచ్చిన తీర్పులను గుర్తు చేసుకుంటూ ఈ చట్టం వలన నష్టం జరిగి పోతున్నదని వ్యాఖ్యానించ గలుగుతారు. ఈ ధర్మాసనమే గతంలో 498–ఎ సెక్షన్‌ను నీరుగారుస్తూ తీర్పు నిచ్చిందనేది గమనంలో ఉంచుకోవాలి. గతంలో టాడా, పోటా నేడు యుఎపిఎ చట్టాలు ఎంతలా దుర్వినియోగ పరుచబడుతూ పౌరుల ప్రాథమిక హక్కులను కాలరాస్తున్నాయో వీరెవరికీ గుర్తుకురావు.

ఎస్‌సి, ఎస్‌టిలపై నేరాలు పెరుగుతున్నాయని, గత పదేళ్లలో దళితులపై అత్యాచారాలు 66 శాతం పెరిగాయని, దళిత మహిళలపై అత్యాచారాలు రెండుసెట్లు పెరిగాయని, దేశంలో ప్రతి 15 నిమిషాలకు ఒక దళితుడిపై అత్యాచారం జరుగుతున్నదని, ప్రతిరోజు ఆరుగురు దళిత మహిళలు లైంగిక దాడులకు లోనవుతున్నారని నేషనల్ క్రై రికార్డ్స్ బ్యూరో, కేంద్ర సామాజిక, న్యాయ మంత్రిత్వశాఖ నివేదికలు చెబుతున్నాయి. ఈ చట్టం ప్రకారం నమోదయ్యే కేసుల్లో 77 శాతం మాత్రమే చార్జ్ షీట్ దాఖలు చేయబడుతున్నాయి. శిక్షలు ఖరారు అయ్యేవి 15 శాతం మాత్రమే. శిక్షలు పడేవి 15 శాతం మాత్రమే కాబట్టి మిగతా అన్ని కేసులు తప్పుటివే. కాబట్టి ఈ చట్టం దుర్వినియోగం అవుతున్నదని ధర్మాసనం నిర్ధారణకు రావడం దురదృష్టకరం.

అట్టడుగు వర్గాలుగా తరతరాలుగా అణచివేయబడిన ఎస్‌సి, ఎస్‌టిలకు చట్టాల పట్ల, కోర్టుల్లోని ప్రక్రియల పట్ల, ప్రభుత్వ కార్యాలయాల్లో పనులు చేయించుకోవడం పట్ల, తమ రాజ్యాంగబద్ధ చట్టబద్ధమైన హక్కులను సాధించుకునే చైతన్యం ఇప్పటికీ చాలామట్టుకు లేదనేది సత్యదూరం కాదు. ఎస్‌సి, ఎస్‌టిలపై జరుగుతున్న అవమానాలు, దౌర్జన్యాలు, అత్యాచారాలపై కేసులు పెట్టించడానికే ఆందోళనలు చేసే దౌర్భాగ్య పరిస్థితులెన్నో ఉంటున్నాయి. ఎస్‌సి, ఎస్‌టి కేసులు సగం వరకు కోర్టు వరకు పోనేపోవు. అసలు పోలీస్ స్టేషన్ వరకు వెళ్లగలిగేవే తక్కువ. కులపెద్దలు, కులసంఘాల నాయకులపై ఒత్తిడి తెచ్చి కేసులను మాఫీ చేయిస్తుంటారు. పోలీస్‌స్టేషన్ల వరకే వెళ్లనీయకుండా చూస్తుంటారు. బెదిరింపులు రకరకాల ప్రలోభాలు, లొంగుబాట్లు, డబ్బుల ఎరలు తదితర కారణాలతో పోలీస్ స్టేషన్లు, కోర్టుల బయటనే సర్దుబాటు చేయబడు తుంటాయి. రాజకీయ నాయకుల, అగ్రకుల పెద్దల పలుకుబడితో, ప్రభావాలతో ఈ చట్టం ప్రకారం నమోదు కావాల్సిన కేసులు నమోదుకు దూరం చేయబడుతుంటాయి.

ఈ పరిస్థితుల్లో ఈ చట్టం ప్రకారం కేసును సమర్ధవంతంగా నడిపించి శిక్షలు పడేలా చేయడం ఎస్‌సి, ఎస్‌టి వర్గాల వారికి ఎంతో వ్యయ ప్రయాసలతో, రిస్క్‌తో, శ్రమతో, కష్టంతో కూడుకున్న పని అవుతుంది. కోర్టుల చుట్టూ, కార్యాలయాల చుట్టూ, ప్రభుత్వాధికారుల చుట్టూ, న్యాయవాదుల చుట్టూ, పోలీస్ స్టేషన్ల చుట్టూ తిరిగే సమయం, వెసులుబాటు అక్కడ పనులను చక్కబెట్టుకోగలిగే నైపుణ్యాలు శక్తి సామర్థ్యాలు వీరికి ఉండడం సాధ్యమయ్యే పనికాదు. ఆ పనేదో ప్రభుత్వాధికారులు, వివిధ రాజ్య యంత్రాంగాలు నిస్వార్థంగా, అంకితభావంతో తమ కర్తవ్యంగా భావించి స్పందిస్తే తప్ప కుదరని పని. పలుకుబడి, మనోధైర్యం, పనులను చక్కబెట్టుకోగలిగే లౌక్యం, నైపుణ్యం లేని బాధిత ఎస్‌సి, ఎస్‌టి వర్గాలు ఈ చట్టాన్ని దుర్వినియోగం చేస్తారా. ఉన్నదాన్నే సక్రమంగా అమలు చేయించుకోలేని దయనీయస్థితి దాపురించి ఉందంటుంటే ఇంకా దుర్వినియోగం జరగడమేముంటుంది. ఎక్కడైనా తప్పుడు కేసులు పెట్టబడి ఉంటే అవి పెత్తందార్లు, సమాజంలోని ఆధిపత్య శక్తులు తమ ప్రత్యర్థులపై పై చేయి సాధించడానికి పెట్టించినవి అయి ఉంటున్నవే ఎక్కువని అనుభవంలో తేలిన విషయాలే. ఇక్కడ కూడా ఆధిపత్య వర్గాల స్వార్థ ప్రయోజనాల కోసం బలి పశువులు దళితులే కావడాన్ని అర్థం చేసుకోవచ్చు.

ఈ చట్టంలో కఠినమైన నిబంధనలు ఉన్నప్పటికీ కూడా ఎస్‌సి, ఎస్‌టిలపై దాడులు, అత్యాచారాలు, దౌర్జన్యాలు పెరగడం దురదృష్టకరం అని, ఈ చట్టాన్ని మరింత పకడ్బందీగా రూపొందించాల్సి ఉందని 2015లో ఈ చట్టానికి సవరణలు చేస్తూ కొన్ని అదనంగా చేరుస్తూ పార్లమెంటు సవరణ చట్టం చేసింది. ఈ సవరణ చట్టం 26 జనవరి 2016 నుండి అమల్లోకి వచ్చింది. అయినప్పటికి దళిత వర్గాలపై దాడులు, దౌర్జన్యాలు, దోపిడి పీడనలు పెరుగుతున్నాయని హోంశాఖ నివేదిక తెలిపింది. పరిస్థితి ఇలా ఉంటే ఈ చట్టం దుర్వినియోగం గురించి బాధపడుతుండడం వారి హ్రస్వదృష్టిని తెలుపుతున్నది.

దళితులపై నేరాలు, వేధింపులు, హత్యలు, ఎన్నోరకాల అత్యాచారాలు పెరుగుతున్న వాస్తవాలను నేషనల్ క్రైం రికార్డ్స్ బ్యూరో, కేంద్ర సామాజిక న్యాయశాఖ మంత్రిత్వశాఖల నివేదికలు చెబుతున్నాయి. బిజెపి అధికారంలోకి వచ్చాక ఇవి మరింతగా పెరుగుతున్నాయి. కోర్టుల్లో శిక్షలు తగ్గిపోతున్నాయి. 2014లో జాతీయస్థాయిలో 28 శాతం కేసుల్లో శిక్షలు పడగా, బీజేపీ అధికారంలో ఉన్న గుజరాత్ రాష్ట్రంలో 3.4 శాతం కేసుల్లో మాత్రమే శిక్షలు పడ్డాయి.

వ్యవసాయంపై ఆధారపడి బతికే పరిస్థితి తగ్గింది. వలసలుపోయి దొరికిన పనులు చేసుకుంటూ పొట్టపోసుకోవడం వలన గ్రామాల్లోని భూస్వాములపై ఆధారపడే పరిస్థితి తగ్గుతూ వస్తున్నది. సామాజిక ఉద్యమాల ఫలితంగా అక్కడక్కడ ప్రతిఘటనా చైతన్యం కనిపిస్తున్నది. వీటిని అగ్రకుల తత్వం సహించలేకపోతున్నది. యూనివర్సిటీ స్థాయిల్లోనే రీసెర్చ్ స్కాలర్లపై కుల వివక్షత వికృత రూపాలెన్నో అమలవుతున్నాయి. దీనికి ఉదాహరణగా హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీలోని రోహిత్ వేముల సంఘటననే చూడొచ్చు.

అనువనువునా మనువాద బ్రాహ్మణీయ అగ్రకుల దురహంకారాలను పులుముకున్న ఆర్ఎస్ఎస్, దాని అనేక విభాగాలలో పనిచేస్తున్న వారు ఈ చట్టాన్ని ప్రత్యక్షంగా వ్యతిరేకించలేక లూప్‌లైన్లో ఈ చట్టం దుర్వినియోగం అవుతున్నదనే వాదాన్ని ముందుకు తెస్తున్నారు. తద్వారా ఈ చట్టాన్నే రద్దు చేయించడానికి లేదా శక్తిహీనం చేయడానికి భూమికను తయారు చేస్తున్నారు. అందులో భాగంగానే సుప్రీంకోర్టు తీర్పును అర్థం చేసుకుంటే సరిపోతుంది.

ఈ చట్టంలోని సెక్షన్ 18ను బలహీనం చేయడం కోసం వెలికి తెచ్చిన అనేక రెఫరెన్స్‌లకు బదులుగా ఈ కేసులు ఎందుకు ఏయే స్థాయిల్లో ఎలా వీగిపోతున్నాయో తెలుసుకునే ప్రయత్నం చేస్తే ఎన్నో వాస్తవాలు తెలిసి వచ్చేవి. ఎస్‌సి, ఎస్‌టి కమీషన్లు, సామాజిక హక్కుల ఉద్యమాల అధ్యయనాలను, పరిశీలనలను అనుభవాలను గమనంలోకి తీసుకునుంటే మరెన్నో కఠోర నిజాలు, దయనీయ ఘట్టాలు తెలిసేవి.

1984లో ఆంధ్రప్రదేశ్‌లోని కారంచేడులో దళితులపై దాడి చేసి ఐదుగురిని హత్యచేసారు. ఈ కేసులో కింది కోర్టు కొంతమందికి శిక్షలు వేసింది. హైకోర్టులో అప్పీల్‌కు వెళ్లగా అందరిపై కేసులు కొట్టేయడం జరిగింది. నేరస్తులు నిర్దోషులుగా విడుదలయ్యారు. 1991లో చుండూరులో అగ్రకుల భూస్వాములు ఎనిమిది మంది దళితులను దారుణంగా నరికి చంపారు. శవాలను కాలువల్లో పడేసారు. ఈ కేసుకు సంబంధించి 2007లో కొంతమందికి ప్రత్యేక కోర్టు శిక్షలు వేసింది. 2014లో హైకోర్టు సరైన ఆధారాలు లేవని కేసును కొట్టేస్తూ అందరిని

నిర్దోషులుగా ప్రకటించింది. కారంచేడు, చుండూరు అంతకు ముందు పదిరికుప్పం, నీరుకొండ హత్యాకాండల విషయంలో ప్రజాసంఘాలు, హక్కుల సంఘాలు, మేధావులు, విద్యార్థులు పెద్ద ఎత్తున్నే నిరసనలు, ఆందోళనలు చేపట్టారు. కాని చివరకు ఎవరికీ శిక్షలు పడలేదు అందరూ నిర్దోషులుగా ప్రకటించబడ్డారు. మరి హంతకులెవరో, దోషులెవరో తేలని ప్రశ్నగా మిగిలిపోతున్నది. 1996లో తూర్పు గోదావరి జిల్లాలో ఎంఎల్ఎ తోట త్రిమూర్తులు దళిత యువకులకు గుండు గీయించిన సంఘటనలో నేటివరకు న్యాయం జరగలేదు. ఎస్‌సి, ఎస్‌టి చట్టం కేసైతే నమోదు అయ్యింది, కాని ఆ కేసు ఇంకా నడుస్తూనే ఉన్నది. సత్వర న్యాయానికి అర్థమే లేకుండా పోయింది. శ్రీకాకుళం జిల్లాలోని లక్ష్మింపేటలో ఐదుగురు దళితులపై జరిగిన హత్యాకాండపై ఇంతవరకు విచారణే ప్రారంభం కాలేదు. ఇలా ఎన్నో సందర్భాలలో ఈ చట్టం ఎంత బలహీనంగా పనిచేస్తున్నదో తెలుసుకోవచ్చు.

ఏప్రిల్ 2017లో పశ్చిమగోదావరి జిల్లా పాలకోడేరు మండలం గంగపర్రు గ్రామంలో దాదాపు 800 మంది దళితుల మీద సాంఘిక బహిష్కరణ అమలు చేసారు. దళితులు పెట్టిన అంబేద్కర్ విగ్రహాన్ని తొలగించడంతో ఈ ఘర్షణలు మొదలయ్యాయి. ఈ చర్యను నిరసిస్తూ రాస్తారోకో చేసినా దళితులపైనే కేసులు నమోదు చేసారు. గుజరాత్‌లో చచ్చిన గొడ్డు చర్మం ఒలిచిన పాపానికి గోవును చంపారనే నెపంతో దళిత యువకులను జీపుకు కట్టేసి దాడిచేసి కొట్టారు. దీన్ని సోషల్ మీడియాలో కూడా పెట్టారు. ఇలా చెప్పుకుంటూ పోతే ఒడవని ముచ్చటే అవుతుంది. ఈ నేపథ్యంలో ఎస్‌సి, ఎస్‌టి అత్యాచార నిరోధక చట్టం ఉపయోగపడుతున్నది చాలా తక్కువ సందర్భాలలోనే అనేది తెలుస్తుంది.

ఈ చట్టం ప్రకారం దర్యాప్తు చేసే అధికారులు వచ్చిన ఫిర్యాదులపై ప్రాథమిక విచారణ చేసి వాస్తవమని అనుకుంటేనే చార్జ్ షీట్ దాఖలు చేస్తారు. లేదంటే కేసును మూసేస్తూ కోర్టులో ఫైనల్ రిపోర్ట్ సమర్పిస్తారు. ఇలా మూసేసే చాలా కేసులు తప్పుడువని చెప్పడానికి లేదు. 2007 ఆగస్ట్‌లో వాకపల్లిలో పదకొండు మంది ఆదివాసి మహిళలను అత్యాచారం చేసిన గ్రేహౌండ్స్ పోలీసులపైన తప్పుడు కేసు అని ఫైనల్ రిపోర్టును కోర్టులో సమర్పించారు. ఈ ఆదివాసి మహిళలు హైదరాబాద్‌లోని మానవ హక్కుల కమీషన్‌ను, హైకోర్టును ఆశ్రయించినా ఫలితం లేకుండా పోయింది.

హైదరాబాద్‌కు దూరంగా అటవీ ప్రాంతంలో, కొండకోనల్లో బతుకులీడుస్తున్న ఆదివాసీ మహిళలకు కోర్టుల చుట్టూ, కలెక్టర్ల చుట్టూ, పోలీస్‌స్టేషన్ల చుట్టూ, అధికారులు, న్యాయవాదులు చుట్టు తిరిగేంత చైతన్యం కాని అవగాహన కాని, అంగ అర్థబలాలు కాని ఉంటాయా? సామాజిక, హక్కుల ఉద్యమాల కృషి వల్ల సుప్రీంకోర్టుకు వెళితేగాని కేసును రిజిష్టర్ చేయడం జరగలేదు. ఇక శిక్షలు పడే మాటా చాలా పెద్దది. ఇంతలా నిరుపయోగం అవుతున్న చట్టం దుర్వినియోగం అవుతున్నదని చెప్పడానికి సాహసించడం అనేది మనువాద స్వభావానికి నిదర్శనం. 2016లో సుప్రీంకోర్టులోని ముగ్గురు న్యాయమూర్తుల ధర్మాసనం ఈ చట్టం సక్రమంగా అమలవ్వడం లేదని చెబితే 2018 మార్చ్ 20 నాడు ఇద్దరు జడ్జిల ధర్మాసనం ఈ చట్టం దుర్వినియోగం అవుతున్నదని దాన్ని బలహీనపరిచే సవరణలను చేసింది. అంటే తీర్పు చెప్పే స్థానంలో ఉండే వ్యక్తుల సామాజిక, తాత్విక, అవగాహనలపై ఆధారపడి భిన్నమైన తీర్పులు వచ్చే పరిస్థితి నెలకొన్నది. ఈ చట్టం దుర్వినియోగం అవుతున్నదనే ఆరోపణలతో అసలు చట్టాన్నే అమలు కాకుండా చేసే దుర్నీతిని అడ్డుకోవాల్సి ఉన్నది.

ఎక్కడో ఒకటో అరో కేసుల్లో దుర్వినియోగం కావడాన్ని కాదనలేక పోవచ్చు. అయితే దాన్ని ఎలా సరిదిద్దాలో చెప్పాలి కాని ఎలుకలున్నాయని ఇల్లును తగులబెట్టడం సరైంది కాదు కదా. ఏ కేసులోనైనా తప్పుడు సమాచారంతో సాక్ష్యాలతో చట్టాలను అపహాస్యం చేయాలని చూస్తే వాటికి తగిన నేర విచారణా ప్రక్రియలు తెలుపబడి ఉన్నాయనే విషయాన్ని మరిచిపోకూడదు. చట్టాలను దుర్వినియోగం చేయడం, వాటిని తమకు అనుకూలంగా మలుచుకోవడం వాటిలోని లొసుగులను ఆధారం చేసుకుని తాము చేసిన నేరాల నుండి తప్పించుకునే పరిస్థితి రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘికంగా అభివృద్ధి చెందిన, పలుకుబడి కలిగిన వర్గాలకే ఉంటుంది. కాని వెనుకబడి, వివక్షతలకు, ఆత్మన్యూనత లకు, ఆత్మగౌరవాలకు లోనయ్యే బలహీనులకు చాలా వరకు ఉండదనే విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఎక్కడో ఒకటీ అరా ఉంటే ఉండవచ్చు. కాని వాటినే జనరలైజ్ చేస్తూ మొత్తంగా చట్టాన్నే బలహీనపరచడం సరైంది కాదు. అలా బలహీన పరచదలిస్తే ఈ చట్టమే అవసరం లేదు. భారత శిక్షాస్మృతి (ఐపిసి), నేర విచారణ ప్రక్రియ స్మృతి (సిఆర్‌పిసి) లలో పొందుపరచబడిన సెక్షన్‌లు సరిపోతాయి.

ఈ తీర్పుకు వ్యతిరేకంగా దళితవర్గాల నుండి తీవ్రమైన నిరసనలు వచ్చాయి. ఏప్రిల్ 2018లో జరిగిన దేశవ్యాప్త బంద్‌లో 8 మంది చనిపోయారు. ఎంతోమంది గాయాల పాలయ్యారు. ఈ ఉద్యమ ఒత్తిడి ఫలితంగా మోదీ ప్రభుత్వం ఈ తీర్పుపై రివ్యూ పిటిషన్ వేయాలని నిర్ణయించింది. దళిత వర్గాల నుండి ఆందోళనలు పెరుగుతుండడంతో సుప్రీంకోర్టు తాజా తీర్పు చెల్లుబాటు కాకుండా ఉండేందుకు పాతచట్టాన్ని యథాతథంగా ఉంచేలా పార్లమెంటులో ఈ చట్టానికి సవరణ బిల్లును ప్రవేశపెట్టారు. ఈ సవరణ బిల్లు రేపు చట్టం అయ్యాక మళ్లీ సుప్రీంకోర్టులో ఏ ధర్మాసనమో ఇప్పటి రూలింగ్‌నే ఇవ్వదని గ్యారంటీ ఏమీలేదు. నిరంతర ప్రజా చైతన్యం, సమాజంలోని మౌలిక మార్పు కోసం జరిగే పోరాటాలు ఎస్‌సి, ఎస్‌టిలపై జరిగే అత్యాచారాలను నిలువరించగలుగుతాయి.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. – సం.*

# మరాఠాల రిజర్వేషన్ల కొట్లాట

***ఒకప్పుడు రిజర్వేషన్లను వ్యతిరేకించిన వర్గమే ఈ రోజు రిజర్వేషన్లను కోరుకోవడం వెనక అవకాశవాద రాజకీయాలు ఉన్నాయనీ, యువత మౌలిక సమస్యలకు పరిష్కారాలు వెతకాలనీ అంటున్నారు సంతోష్***

గతంలో హర్యానాలో జాట్‌లు, రాజస్తాన్‌లో గుజ్జర్‌లు, ఎపిలో కాపులు, గుజరాత్‌లో పాటీదార్ (పటేల్)లు రిజర్వేషన్ల కొరకు ఆందోళన చేశారు. నేడు మహారాష్ట్రలో మరాఠాలకు రిజర్వేషన్ కోసం తామే మరాఠాలమని చెప్పుకునే 96 కులాల సమూహం లక్షలాది మంది ప్రజలను సంఘటితపరిచి ఉద్యమాన్ని తీవ్రస్థాయిలో కొనసాగిస్తున్నారు. మరాఠాల రిజర్వేషన్ ఉద్యమం మళ్లీ రాజుకుంది. చదువు, విద్య, ఉద్యోగ రంగాల్లో మరాఠా సామాజిక వర్గానికి రిజర్వేషన్లు డిమాండ్ చేస్తూ మహారాష్ట్రలో జరుగుతున్న ఆందోళనలు హింసాత్మకంగా మారాయి. మరాఠా క్రాంతి మోర్చా జూలై 25న మహారాష్ట్ర బంద్‌కు పిలుపునివ్వడంతో లాతూర్, జల్నా, సోలాపూర్, బుల్దానా, పూనె జిల్లాలో బందు సంపూర్ణంగా కొనసాగింది. రహదారులు, పాఠశాలలు, ప్రభుత్వ కార్యాలయాలు, ఇంటర్నెట్ సేవలన్నీ బంద్ అయినాయి. ప్రభుత్వం సహేతుకమైన పరిష్కారంతో సకాలంలో స్పందించకపోవడం వల్ల మరాఠాల ఆందోళన హింసాత్మకంగా మారింది. ఈ ఘర్షణల్లో ఒక కానిస్టేబుల్ మరణించగా, ఏడుగురు ఆందోళనకారులు ఆత్మహత్యలకు పాల్పడ్డారు. దేశ ఆర్థిక రాజధాని ముంబైని కుదిపేసింది.

ఈ నేపథ్యంలో కార్యాచరణ సంబంధాల్లో 'కార్యం' కేంద్రంగా పరిష్కరించేందుకు ప్రయత్నిస్తే తాత్కాలిక ఉపశమనానికి దారితీస్తుందే గానీ శాశ్వత పరిష్కారాన్ని అందించజాలదు. పైగా అలాంటి ప్రయత్నాల వల్ల శాశ్వత పరిష్కారం మరింత జటిలమవుతుంది. కుల, మత, ప్రాంత, జెండర్ తదితర అస్తిత్వాలు తమ ఉనికి లేదా ఆత్మగౌరవం కోసం తరతరాలుగా ఉద్యమిస్తున్నాయి. మరాఠాలకు రిజర్వేషన్లపై ప్రభుత్వం గత ఏడాది ఇచ్చిన హామీలను అమలు చేయాలంటూ జూలై 25న నిరసనల్లో పాల్గొన్న 28 ఏళ్ల రైతు కాకాసాహెబ్ షిండే ఔరంగాబాద్‌లో గోదావరి నదిలో దూకి ఆత్మహత్యకు పాల్పడ్డాడు. అందుకు నిరసనగా మరాఠా సంస్థలు ఆగస్టు 7, 8 తేదీల్లో మళ్లీ రెండు రోజులు రాష్ట్ర బంద్‌ను పాటించాయి. ఆందోళనకారులు పలుచోట్ల వాహనాలను దగ్ధం చేశారు. ప్రపంచ వ్యాప్తంగా కుల, మత, జాతి, ప్రాంత తదితర అస్తిత్వ ఉద్యమాలు ప్రారంభంలో శాంతియుతంగానే ఉంటాయి. పాలకుల నిర్లక్ష్యం, అప్రజాస్వామిక, అహేతుక వైఖరి కారణంగా ఆ ఉద్యమాలన్నీ హింసాత్మకంగా మారడం సహజం. అదొక సామాజిక చలన నియమం.

1980లలో మండల్-కమండల్ వివాద నేపథ్యంలో రిజర్వేషన్ అమలుకు వ్యతిరేకంగా (ఒ.బి.సి.లకు) బాహాటంగా తాము వెనుకబడిన వర్గాలవారిమి కామని, రిజర్వేషన్లను సమర్థించని ఇద్దరు మరాఠా నాయకులు ఇప్పుడు ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్నారు. మారిన గ్లోబల్ పరిస్థితితో దేశ సామాజిక, రాజకీయ, ఆర్థిక మార్పు పరిణామ క్రమంలో దశాబ్దకాలంగా తమకూ రిజర్వేషన్ కల్పించాలన్న డిమాండ్ ఊపందుకుంది. మొత్తం రిజర్వేషన్లు 50 శాతానికి మించరాదని సుప్రీంకోర్టు తీర్పు ఉన్నప్పటికీ, రాజకీయ పక్షాలు తమ ఓటు బ్యాంకు ప్రయోజనాల కోసం వివిధ సామాజిక సమూహాల ఆకాంక్షలను సంతృప్తి పరచేందుకు కోటాలను పరిమితికి మించి పెంచుతున్నట్లు ప్రకటిస్తుండడమే కాక, శాసనసభల్లో తీర్మానాలు చేస్తున్నాయి.

మహారాష్ట్రలో ఎన్నికల ఫలితాలను, పార్టీల తలరాతలను మార్చగల మందబలం, ఆర్థికశక్తి మరాఠాలకు ఉన్నది కనుకనే, రాజకీయ పార్టీలేవీ వారి డిమాండ్‌ను కాదనడం లేదు. మహారాష్ట్రలో ఏ పక్షమూ వారి డిమాండ్‌ను వ్యతిరేకించడం లేదు. ఓబిసి కేటగిరిలో చేర్చాలన్న ఈ డిమాండ్‌లో హేతుబద్ధత ఉన్నదా లేదా అన్నది అటుంచితే, ఇప్పటికే 50 శాతం రిజర్వేషన్లు నిండుగా అమలవుతున్న రాష్ట్రంలో వాటిని పెంచే ప్రయత్నమేదీ న్యాయస్థానాల్లో నిలబడదన్నది వాస్తవం. ఈ అంశం తన చేతుల్లో లేదనీ, న్యాయస్థానాలే తేల్చాలని ఫడ్నవీస్ పలుమార్లు చేతులెత్తేశారు కూడా. ఫడ్నవీస్‌కు ముందు కాంగ్రెస్ ముఖ్యమంత్రి పృథ్వీరాజ్ చౌహాన్ 2014లో ఒక ఆర్డినెన్స్ ద్వారా వీరికి రిజర్వేషన్లు కల్పిస్తున్న విన్యాసం ఒకటి చేశారు. అసెంబ్లీ ఎన్నికలకు నాలుగు నెలల ముందు చేసిన ఈ పనికి బాంబే హైకోర్టు అడ్డుపడింది.

హైకోర్టు నిర్ణయాన్ని సవాలు చేస్తూ సుప్రీంకోర్టులో ప్రభుత్వం పిటిషన్ వేసినప్పటికీ ఆ కేసు తిరిగి హైకోర్టు పరిశీలనకు వచ్చింది. మరాఠాల వెనకబాటుతనాన్ని వివరిస్తూ సమగ్ర నివేదికను రూపొందించవలసిందిగా మహారాష్ట్ర ప్రభుత్వాన్ని బాంబే హైకోర్టు కోరింది. కోర్టు ఆదేశాలను పరిగణిస్తూ మరాఠాల ఇబ్బందులపై నివేదిక రూపొందించి కోర్టుకు సమర్పించవలసిన బాధ్యత ఫడ్నవీస్ ప్రభుత్వంపై ఉంది. రిజర్వేషన్‌లను డిమాండ్ చేస్తూ మరాఠా సంస్థలు వేలమందితో రాష్ట్రవ్యాప్తంగా గత రెండేళ్ల నుంచి 50కి పైగా మౌన ప్రదర్శనలు నిర్వహించింది. అయితే తమ సమస్యలను పరిష్కరించాలని డిమాండ్ చేస్తూ ఏడుగురు మరాఠాలు ఆత్మహత్య చేసుకున్నారు. దాంతో ఉద్యమం హింసాత్మకంగా మారింది. అందుకు ప్రభుత్వమే బాధ్యత వహించవలసి ఉంటుందని ప్రతిపక్షాలు, ప్రజాస్వామిక వాదుల విమర్శలు వెల్లువెత్తాయి. ఇక, ఇప్పటికే రిజర్వేషన్ పొందుతున్న కులాలు కొత్త కులాల చేరికను వ్యతిరేకించడం అన్ని చోట్లా ఉన్నదే.

అయితే 'మరాఠా క్రాంతి మోర్చా' ప్రధాన డిమాండ్లను ప్రభుత్వం అంగీకరించిందని, రిజర్వేషన్లు కల్పించటానికి రాష్ట్ర ప్రభుత్వం సాధ్యమైనంత త్వరలో ఒక నివేదికను తయారు చేస్తోందని ముఖ్యమంత్రి దేవేంద్ర ఫడ్నవీస్ ప్రకటించారు. మరాఠాలకు ప్రభుత్వ ఉద్యోగాల్లో, విద్యాసంస్థల్లో, ఉద్యోగాల్లో రిజర్వేషన్లపై చట్టబద్ధమైన సంప్రదింపులు ప్రారంభిస్తామని, ఈ ఏడాది చివరి నాటికి చట్టబద్ధమైన

ప్రక్రియలన్నింటినీ పూర్తిచేసి, 2019 చివరి నాటికి అసెంబ్లీలో బిల్లు పెట్టేందుకు రంగం సిద్ధం చేస్తున్నామని మహారాష్ట్ర ముఖ్యమంత్రి ఫడ్నవీస్ ప్రకటించారు. మరాఠాల ప్రధాన డిమాండ్ అయిన 72 వేల ఖాళీ ప్రభుత్వ ఉద్యోగాలను భర్తీ చేయకుండా ఫడ్నవీస్ ప్రభుత్వం నిలిపివేసింది. ఇది నిరుద్యోగులకు ఆశనిపాతంగా మారింది.

మహారాష్ట్ర ముఖ్యమంత్రి హామీలు రాతపూర్వకంగా ఉండాలన్న డిమాండ్‌ను కూడా ప్రభుత్వం ఖాతరు చేయకపోవడంతో మరాఠా సంస్థలు మళ్లీ ఆందోళన చేసేందుకు ఏకమయ్యాయి. రాష్ట్ర జనాభాలో 32 శాతంగా ఉన్న మరాఠాలు రాజకీయంగా శక్తిమంతులు. రాష్ట్ర శాసన సభలోను, స్థానిక ప్రభుత్వాలు, పౌర సంస్థల్లో మరాఠాల ప్రాతినిధ్యం గణనీయంగా ఉంది. గతంలో మహారాష్ట్ర రైతుల మహా పాదయాత్ర (లాంగ్ మార్చ్) సందర్భంలోనూ రాష్ట్ర ప్రభుత్వం ఆందోళనకారుల డిమాండ్లన్నిటినీ ఆమోదించినట్లు ప్రకటించినా, ఇప్పటి దాకా ఒక్కదాన్ని కూడా పట్టించుకున్న పాపాన పోలేదు. ఈ అనుభవం నేపథ్యంలో హామీలతో సరిపెట్టకుండా ప్రభుత్వం తమ సమస్యల్ని పరిష్కరించేదాకా ఆందోళన సాగించాలనే పట్టుదలతో మరాఠాలు ఉన్నారు.

రిజర్వేషన్ల కోటా కోసం గత కొన్ని సంవత్సరాలుగా ఉద్యమిస్తున్న వర్గాలకు, ఇప్పటికే రిజర్వేషన్లు అనుభవిస్తున్న ప్రజా సమూహాలకు మధ్య వైషమ్యాలు తలెత్తి, బడుగు బలహీన వర్గాల ఐక్యతకు విఘాతం కలిగే పరిణామాలు సంభవించాయి. ప్రజల మధ్య వైరుధ్యం పాలకవర్గాలకు తోడ్పడుతుంది. రాష్ట్ర జనాభాలో 32 శాతంగా ఉన్న మరాఠా సామాజిక సమూహానికి ప్రభుత్వ ఉద్యోగాల్లో, విద్యాసంస్థల్లో రిజర్వేషన్లు కల్పించాలంటూ డిమాండ్ చేస్తూ మరాఠా సంఘాలు కొంతకాలంగా ఉద్యమిస్తున్నాయి. 'మరాఠా క్రాంతి మోర్చా' 2016 నుంచి జల సమాధి, బందులు, ముట్టడులు, రాస్తారోకో తదితర రూపాల్లో నిరసనలు చేపడుతుండడం విధితమే.

ప్రధానంగా మరాఠ్వాడ్, పశ్చిమ మహారాష్ట్ర ప్రాంతాలలో నివసిస్తున్న మరాఠాలు నాలుగు తరగతులుగా ఉన్నారు. అవి పాలకులు, భూస్వాములు, మధ్యతరగతి ధనిక రైతులు, రైతు కూలీలు. 1980లో మండల్ కమిషన్ మరాఠాలను అగ్రకులంగా గుర్తించింది. మొత్తం మహారాష్ట్ర జనాభాలో మరాఠాలు 32 శాతం ఉండగా మరాఠాలోని ఉపకులమైన కుంబీలు 10 శాతం వరకు ఉంటారు (వీరిలో అత్యధికులు వ్యవసాయ కూలీలు). మహారాష్ట్రంలో మరాఠాలకు 33.7 శాతం, ఒ.బి.సి.లకు 23.8 శాతం, ఎస్.సి.లకు 5.3 శాతం వ్యవసాయ భూమి ఉంది. 2008లో మహారాష్ట్ర స్టేట్ బ్యాక్‌వర్డ్ కాస్ట్ కమిషన్ మరాఠాలను ఆర్థికంగా రాజకీయంగా ఎదిగిన వారిగా గుర్తించింది. మరాఠాలలో మొదటి తరగతికి చెందిన వారు మంత్రులు, ఎంఎల్ఏలు, చెక్కర బోర్డుల డైరెక్టర్లుగా ఉన్నారు. రెండవ తరగతికి చెందిన భూస్వాములు వాణిజ్య పంటలు పండిస్తారు. వీరు గ్రామాల్లో రాజకీయంగా గణనీయమైన ప్రభావాన్ని చూపుతారు. మూడవ తరగతికి చెందిన మధ్యతరగతి రైతులు పూర్తిగా వ్యవసాయం మీద ఆధారపడి జీవనం సాగిస్తారు. నాలుగవ తరగతికి చెందిన వారు పేద రైతులు, భూమిలేని కార్మికులుగా ఉన్నారు. గత దశాబ్ద కాలంగా ఏర్పడిన కరువు పరిస్థితుల వల్ల మరాఠా రైతులు ఏప్రిల్ 2014- మార్చి 2016 మధ్య కాలంలో 4000 మంది ఆత్మహత్య చేసుకున్నారు.

1960లో రాష్ట్ర ఏర్పాటు తరువాత మహారాష్ట్రలో అధికారం చేపట్టిన 18 మంది ముఖ్యమంత్రుల్లో పది మంది మరాఠా ముఖ్యమంత్రులే. రాష్ట్ర మొట్టమొదటి ముఖ్యమంత్రి యశ్వంతరావ్ చవాన్ కూడా మరాఠా. మరాఠాల్లో ప్రతి ఎన్నికల్లో ఎన్నికైన ప్రతినిధులలో 30 నుంచి 40 శాతం మంది ఉంటున్నారు. సమాజంలో వరుసగా రాష్ట్ర మంత్రివర్గాలలో మరాఠాలకు గణనీయమైన వాటా ఉంది. 2010లో అబిహెతటార్, వివేక్ ఘూటాలేలు రచించిన 'మహారాష్ట్ర క్యాబినెట్స్ సోషల్ అండ్ రీజినల్ ప్రొఫైల్' ప్రకారం 1960 నుంచి 2010 వరకు 173 క్యాబినెట్ మంత్రుల్లో 78 మంది మరాఠాలే. 1995 నుండి 1999 వరకు శివసేన-భారతీయ జనతా పార్టీ (బిజెపి) ప్రభుత్వంలోని మనోహర్ జోషి నేతృత్వంలోని క్యాబినెట్‌లో మరాఠాలు మెజారిటీలో లేనప్పుడు (ఆరుగురిలో ఒకరు) మరాఠా ఆందోళనకు బీజాలు పడ్డాయి.

ప్రస్తుత దేవేంద్ర ఫడ్నావిస్ నేతృత్వంలోని ప్రభుత్వ క్యాబినెట్‌లో 39 మంత్రులలో15 మంది మరాఠాలే. మూడోవంతు జనాభా ఉన్న మరాఠాలకు కాక మూడుశాతం ఉన్న బ్రాహ్మణులకు ముఖ్యమంత్రి పదవి ఇవ్వడం కూడా వారి ఈ ఆగ్రహానికి మరోకారణమని కొందరి విశ్లేషణ. అశోక్ చవాన్, శరద్‌పవార్ వంటి నాయకులు ఎప్పటికప్పుడు దీనిని మరాఠాలకు అన్యాపదేశంగా గుర్తుచేస్తూనే ఉన్నారు. ఉపరితలంలో రిజర్వేషన్ల ఉద్యమానికి మద్దతు ఇస్తూ, తిరిగి మరాఠాల చేతికి రాజ్యాధికారం రావాల్సిన ప్రథమ కర్తవ్యాన్ని గుర్తు చేస్తున్నారు. మరాఠాల రిజర్వేషన్ ఉద్యమానికి కాంగ్రెస్, ఎన్‌సిపి పార్టీలు రాజకీయ లబ్ధి కొరకు తమ వంతుగా ఆజ్యం పోస్తున్నాయి.

మహారాష్ట్ర జనాభాలో ఇప్పటి వరకు ఎస్.సి., ఎస్.టి., ఒ.బి.సి. వర్గాల వారికి లభించిన రిజర్వేషన్ ఫలితాలు ఏమిటంటే, ఎస్.సి.కి 13 శాతం, ఎస్.టి.కి 7 శాతం, ఒ.బి.సి.లకు 19 శాతం, ఎస్.సి. బిసిలకు 2 శాతం, ఎస్.సి. (1)వ వర్గానికి 11 శాతం, ఎస్.సి.(2)కు 2.5 శాతం, ఎస్.సి. (3)కు 3.5 శాతం, ఎస్.సి. (4)కు 2 శాతం మొత్తం కలిపితే 52 శాతం ఇచ్చినప్పటికీ కేవలం 4 శాతం పై వర్గాలలోని వారు లబ్ధి పొందినట్లు, మిగిలిన 96 శాతం రిజర్వేషన్లకు వంచితులుగా ఉన్నట్లు విశ్లేషకులు పేర్కొంటున్నారు. 52 శాతం ఒ.బి.సి.లకు కేంద్రంలో 27 శాతం రిజర్వేషన్ సౌకర్యం ఉంది. మరాఠాలకు రిజర్వేషన్ సౌకర్యం కలిగించాలంటే ముందుగా సమాజంలోని కింది వర్గాలకన్న మరాఠా సమాజం ఆర్థికంగా దుర్లభంగా ఉన్నట్లు నిరూపించుకోవాలి.

1990 మండల్ కమిషన్ నివేదిక దేశంలో 52 శాతంగా ఉన్న 'ఇతర వెనుకబడిన వర్గాలు' (ఒ.బి.సి.)లకు కేంద్ర ప్రభుత్వంలోనూ, ప్రభుత్వ రంగసంస్థల్లోనూ 27 శాతం రిజర్వేషన్లు (ఎస్.సి., ఎస్.టి. రిజర్వేషన్లను కలుపుకుంటే మొత్తం 49 శాతం రిజర్వేషన్లు) కల్పించవచ్చనే సూచనను కేంద్ర ప్రభుత్వం 1992 నుంచి అమలు చేస్తోంది. అయితే దేశవ్యాప్తంగా అనేక సామాజిక సమూహాలు వివిధ రూపాల్లో కోటా కోసం ఉద్యమిస్తున్నాయి. రిజర్వేషన్లపై పరిమితి విధిస్తూ సుప్రీంకోర్టు తీర్పు చెప్పిన నేపథ్యంలో అమలు కాని రిజర్వేషన్ కోటాలను కేటాయిస్తూ, న్యాయస్థానాల్లో చుక్కెదురైనప్పుడు పార్లమెంట్‌లో రాజ్యాంగ సవరణలు చేయాలని రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్రాన్ని అభ్యర్థిస్తూ చేతులు దులుపుకుంటున్నాయి. కోటా కేటాయింపులు పెంచేందుకు తమ పార్టీకి చిత్తశుద్ధి ఉందని, రాజ్యాంగ పరిమితుల వల్ల అది సాధ్యం కావడం లేదని ఆయా సామాజిక సమూహాలను బుజ్జగించేందుకు రాజకీయపక్షాలు ప్రయత్నిస్తూనే ఉన్నాయి.

రాజస్తాన్‌లో గుజ్జర్లు ఉద్యమించి 21 శాతం ఒ.బి.సి, ఒక్క శాతం ఎం.బి.సి. రిజర్వేషన్ కోటాను సాధించారు. పట్టపు మత్స్యకారులు,

చాకలి తదితర కుల సమూహాల వాళ్లు తమను ఎస్.టి.లుగా పరిగణించాలని ఎప్పటి నుంచో డిమాండ్ చేయడంపై ఇదివరకటి నుంచి ఎస్.సి.లుగా ఉన్న సామాజిక సమూహాలు ఆగ్రహం వ్యక్తం చేస్తున్నాయి. ఎస్.టి. రిజర్వేషన్ సమూహాల్లోని అడవిలోని ఆదివాసీ జాతులకు, గ్రామీణ ప్రాంతాల్లోని లంబాడా తదితర తెగలకు మధ్య ఒక యుద్ధవాతావరణం ఏర్పడింది. బి.సి.లలో మెజారిటీ– మైనారిటీ (ఎం.బి.సి.) బి.సి.లకు మధ్య, బి.సి. కేటగిరీలోకి చేర్చాలని డిమాండ్ చేస్తున్న ముస్లింలు, కాపులు– ఇతర వెనుకబడిన తరగతుల ప్రజానీకానికి మధ్య సరికొత్త వైరుధ్యాలు తలెత్తుతున్నాయి.

యుద్ధవీరులుగా ప్రసిద్ధి కెక్కి, క్షత్రియ సామాజిక హోదా అనుభవిస్తున్న మరాఠాలు ఓ.బి.సి. కోటా కోసం ఉద్యమించడంపై రిజర్వేషన్‌లు అనుభవిస్తున్న సామాజిక సమూహాలలో ప్రధానంగా ఎస్.సి., ఎస్.టి.లలో తీవ్ర అసంతృప్తి చోటు చేసుకొని ఉన్న తరుణంలో 2017 ఆగస్టులో కోపార్డీ అత్యాచారం, హత్య ఉదంతం ఆ వర్గాల మధ్య వైషమ్య పూరిత వాతావరణాన్ని ఏర్పరచింది. ఇదే క్రమంలో భీమా కోరేగావ్, బుధ్రుక్ వివాదాలు మరాఠాలు, దళితులకు మధ్య వైషమ్యాలను తీవ్రతరం చేసింది. ఈ వైషమ్యాన్ని అడ్డుపెట్టుకుని సంఘపరివార్ సంస్థలు మరాఠాలను రెచ్చగొడుతూ దళిత, బలహీనవర్గాలపై దాడులకు పాల్పడుతున్నట్లు అనేక కథనాలు వచ్చాయి. అదే సమయంలో ఎస్.సి. రిజర్వేషన్ హోదాలో ఉన్న మాల– మాదిగ తదితర సమూహాల మధ్య వర్గీకరణ చిచ్చు రగిలింది.

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలు అమలులోకి వచ్చాక వ్యవసాయం, చిన్నచిన్న వ్యాపారాలు, పరిశ్రమలు మనుగడ సాగించలేని దుస్థితిలో ఉన్నందున మరాఠాలు, పటేళ్లు, జాట్లు, కాపులు వంటి కులాలు రిజర్వేషన్ ఉద్యమాలకు మళ్లే పరిస్థితి ఏర్పడుతున్నది. ఈ శక్తివంతమైన సామాజిక వర్గాలను తమకు అనుకూలంగా ఉంచుకోవడమన్నది ప్రతీ రాజకీయ పార్టీకీ సమస్యగా మారుతోంది. అనావృష్టితో వ్యవసాయం దెబ్బతినిపోవడం, గ్రామాలపై పెత్తనం తగ్గడం వంటివి మరాఠాల వంటి ఆధిపత్యకులాల ఉద్యమాలకు ఒక కారణం. గ్రామీణ ప్రాంతాల్లో పెరిగిపోతున్న దురవస్థలు, ఆర్థిక అసమానతలు సంప్రదాయ భూస్వామ్య కులాల వారిని ఉద్యమాల వైపు నడిపిస్తున్నాయి. వివక్ష, సామాజిక వెనుకబాటుతనం ఇత్యాదివి రిజర్వేషన్లకు ప్రాతిపదిక తప్ప ఆర్థిక వెనుకబాటుతనం కాదు. అయినా రాజకీయ పార్టీలు రిజర్వేషన్ల అసలు స్ఫూర్తిని దెబ్బతీస్తూ వాటిని ఓటు బ్యాంకు రాజకీయాలకోసం వాడుకోవడం ఈ విపరిణామాలకు ప్రధాన కారణం. రిజర్వేషన్ అన్నది సామాజికాంశంగా కాక ఇప్పుడు రాజకీయ, ఆర్థికాంశంగా ప్రతివారికీ కనిపించడానికి రాజకీయపక్షాల విన్యాసాలే కారణం.

సామ్రాజ్యవాద ప్రపంచీకరణ వేగవంతమైన గత రెండున్నర దశాబ్దాలకాలంలో వ్యవసాయ రంగంలో సంక్షోభం నెలకొనడం వల్ల రైతుల జీవితాలు అనిశ్చితంగా మారాయి. కొన్ని దశాబ్దాలుగా రైతు వర్గం నుంచి వచ్చిన వారు ఉన్నత విద్యావంతులై, నగర జీవనానికి అలవాటుపడడం మొదలైంది. అయితే రెండున్నర దశాబ్దాలుగా ఆర్థిక విధానాలలో వచ్చిన మార్పు వల్ల ఉద్యోగాల సంఖ్య తగ్గిపోయింది. ప్రభుత్వాలు అనుసరిస్తున్న అభివృద్ధి విధానాలు అసమతుల్యతను సృష్టిస్తున్నాయి. స్థానిక ఉపాధి అవకాశాలను దెబ్బతీస్తున్నాయి. దీనివల్ల రైతు కుటుంబాల నుంచి వచ్చిన యువత సంక్షోభంలో పడిపోయింది. దీంతో కొన్ని వర్గాలకు రిజర్వేషన్ సౌకర్యం కల్పించడం వల్లనే తాము ఉద్యోగ అవకాశాలను కోల్పోతున్నామనే భావన వ్యాపించింది. తమకూ రిజర్వేషన్ ఉంటే ఉద్యోగాలు లభిస్తాయనే అభిప్రాయం యువతలో ఏర్పడ్డది. నిజానికి ప్రభుత్వ రంగంలో ఉపాధి కునారిల్లింది. ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లు లేవు.

ప్రపంచ ఆర్థిక సంక్షోభం తీవ్రం కావడంతో యుద్ధాలు– అంతర్యుద్ధాలు, సామాజిక రాజకీయ అస్తవ్యస్తతకు పరిష్కారంగా మత, జాతి తదితర అస్తిత్వ దురహంకారాలతో ఫాసిస్టు/ఫాసిస్టు ధోరణి గల రాజ్యాలు ఉనికిలోకి వచ్చాయి. దానికి సమాంతరంగా రాజ్యంలోనే కాకుండా అంతర్జాతీయ సమాజంలో కూడా ఫాసిజం వ్యవస్థీకృతమైతంది. భారత్ కూడా ఆ పరిణామాలకు మినహాయింపు కాదు. వ్యవసాయ రంగం తీవ్ర సంక్షోభంలో కొట్టుమిట్టాడుతుండడంతో గ్రామాలలోని చేతివృత్తులు, చిన్న వ్యాపారాలు ప్రపంచీకరణ దెబ్బకు కుదేలై కోట్లాది ప్రజల జీవన ప్రమాణాలు ఘోరంగా దెబ్బతిన్నాయి. ప్రపంచ ఆర్థిక సంక్షోభం కారణంగా వాణిజ్య, పారిశ్రామిక రంగాలు ఉదాసీనంగా మారడంతో దేశ ప్రజల జీవనప్రమాణాలు ఘోరంగా తయారయ్యాయి. దాంతో ఈ సంక్షోభం నుంచి బయటపడేందుకు సమాజంలోని వివిధ ప్రజా సమూహాలు తమ అస్తిత్వం పునాదిగా పరిష్కారాలను డిమాండ్ చేస్తూ ఉద్యమించడం ప్రారంభించారు. మహారాష్ట్ర రైతాంగ లాంగ్ మార్చ్ కూడా అందులో భాగమే. దేశ ప్రత్యేకతలకు తగినట్లు కులం, మతం రూపంలో సమాజంలో ఫాసిజం విస్తృతమవుతుండడం ప్రజాస్వామిక వాదులకు ఆందోళన కలిగిస్తోంది.

'కార్యం' కేంద్రిత అస్తిత్వ ఉద్యమాలు వాటికవే మౌలిక సామాజిక మార్పును తీసుకురాగలవని భావించడం చారిత్రక అర్థరాహిత్యమే కానీ వేరొకటి కాదు. సామాజికార్థిక సంబంధాల పాదార్థిక 'కారణం' అస్తిత్వ ఉద్యమాల రూపంలోని 'పర్యవసానం' లేదా 'కార్యం' –ఈ రెండింటి పునాదిగా సమగ్ర సామాజిక విప్లవం కోసం కృషి చేయవలసిన చారిత్రక అవసరాన్ని గుర్తించాలి. సార్వత్రిక ఎన్నికలు సమీపిస్తున్న సమయంలో కుల, మత, జాతి తదితర అస్తిత్వాల ప్రాతిపదికన సామాజిక వైషమ్యాలు రెచ్చగొట్టి ఓటు బ్యాంకులను సృష్టించుకోవాలని చూస్తున్న వివిధ అస్తిత్వ ఉద్యమ సంస్థలు, రాజకీయ పార్టీల కార్యకలాపాల పట్ల ప్రజలు అప్రమత్తంగా ఉండాలి. మహారాష్ట్ర పరిణామాల నుంచి గుణపాఠం తీసుకోవాలి. ఇటువంటి నేపథ్యంలో రాజకీయ లబ్ధికోసం కాకుండా రిజర్వేషన్ల వ్యతిరేక, అనుకూల, వర్గీకరణ ఉద్యమాల పుట్టుకకు గల కారణాలను జాతీయ స్థాయిలో రిజర్వేషన్ల విధానాన్ని, లబ్ధిదారుల వర్గీకరణను పునః సమీక్షించాల్సిన పరిస్థితి ఏర్పడింది.

ప్రజల అవసరాలకు అనుగుణంగా రాజకీయ ఆర్థిక విధానాలను రూపొందించి అమలు చేయని కారణంగా నిరుద్యోగం పెరిగింది. ప్రభుత్వ రంగం కుదించుకుపోయి, విస్తరిస్తున్న ప్రైవేట్ రంగంలో ఉపాధి అవకాశాలు సన్నగిల్లాయి. దేశంలో నానాటికీ పేదరికం, నిరుద్యోగం పెరిగిపోతున్నాయి. దుర్భర జీవన పరిస్థితుల్లో అశాంతి పెరుగుతున్నది. భవిష్యత్తు అగమ్యగోచరమై యువత నిరాశా నిస్పృహలకు లోనవుతున్నది. మొత్తంగా ప్రజా జీవనం సంక్షోభంలో పడింది. అభివృద్ధి పేరుతో ప్రజల జీవనాధారాలు కొల్లగొట్టారు. నిర్వాసితులను పెంచారు. కొత్త ఉద్యోగాల సృష్టి జరగకపోవడం ఒకవైపు, ఉన్న ఉద్యోగాలు ఊడిపోవడం మరోవైపు జరుగుతోంది. ఈ నేపథ్యంలో యువత వ్యవస్థగత లోపాలను, సమస్య మూలాలను అర్థం చేసుకోకుండా, మౌలిక సమస్యల పరిష్కారం కొరకు ఉద్యమించకుండా రాజకీయ నాయకుల అమలుకానీ వాగ్దానాలకు పావులుగా మారిపోతున్నారు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# రాఫెల్ ఒప్పందం - భారీ కుంభకోణం

*విమానాల కొనుగోళ్లలో భారీ కుంభకోణాలు జరుగుతున్నాయనీ, గోప్యత, నిబంధనల పేరుతో అనర్హులకు, ఆశ్రితులైన కార్పొరేట్ శక్తులకు ప్రయోజనాలు కల్పించేందుకు దేశ భద్రతను పణంగా పెట్టి ప్రజాధనాన్ని దుర్వినియోగం చేస్తున్నారనీ అంటున్నారు* **డా. ఎ. పున్నయ్య**

దాదాపుగా మూడు దశాబ్దాల క్రితం భారత ప్రభుత్వం 410 (155 ఎంఎం) హావిజర్ తుపాకుల సరఫరా కోసం స్వీడిష్ ఆయుధాల కంపెనీ, బోఫోర్స్ కంపెనీతో ఒప్పందం కుదుర్చుకుంది. దీని విలువ రు. 285 మిలియన్లు. అయినప్పటికీ ఆనాటి స్వీడన్ ప్రభుత్వ ఆయుధాల సరఫరా ఒప్పందాల్లో అత్యంత పెద్దది. ఆ లావాదేవీల్లో జరిగిన ఒప్పందాలు బోఫోర్స్ కుంభకోణంగా బయటికి వచ్చింది. అది దేశ రాజకీయాలను కుదిపి తిరుగులేని ప్రజాబలంతో ఉన్న అప్పటి ప్రధాని రాజీవ్ గాంధీని ఏకంగా గద్దె దించింది.

గత కొద్ది రోజులుగా మీడియాలో ఆగస్టా హెలికాప్టర్ల కొనుగోలు రు. 200 మిలియన్ల కుంభకోణంపై ఆరోపణల యుద్ధం కొనసాగుతోంది. అయితే ఇది కాంగ్రెస్‌ను ఇరకాటంలో పడేసి నరేంద్రమోడీకి మంచి అవకాశమిచ్చింది. కాని ఒకటిన్నర దశాబ్దం తర్వాత ఈ ప్రహసనాన్ని మధిస్తే ఎందరో పాత్రదారులు, సూత్రదారులు, మంత్రులు, పార్టీలు కనిపిస్తాయి. ఈ కుంభకోణాల్లో అధికారులు, అధినేతలు, మిలటరీ ఉన్నతాధికారులు, మధ్య దళారీలు, విదేశీ సంస్థలతో ఒక బలమైన విషవలయం అల్లుకుంది. మిగిలిన రంగాలకన్నా రక్షణ రంగంలో ఇవి మరింత జరగడానికి కారణం దేశ భద్రత పేరిట అంతా గప్‌చుప్‌గా, లోపాయికారిగా నడవడమే. రక్షణ కొనుగోళ్లలో మధ్యవర్తులు ఉండరాదనే రాతపూర్వ నిబంధనలున్నప్పకీ ఏదో ఒక రూపంలో కొనసాగుతున్నారు.

అయితే బోఫోర్స్‌తో పాటు ఇప్పటి వరకు జరిగిన అన్ని కుంభకోణాలను మించిందే ఈ రాఫెల్ యుద్ధ విమానాల ఒప్పందం. రక్షణ రంగంలోనే ఇది అత్యంత భారీ కుంభకోణం. ఏకంగా దేశ సార్వభౌమాధికారం, దేశ భద్రతతోనే ఈ ప్రభుత్వం రాజీపడింది. ఈ యుద్ధ విమానాల ఒప్పందాలను ఆకస్మికంగా మార్చిన తీరు, నిబంధనల ఉల్లంఘన పారదర్శకతను కప్పిపుచ్చడానికి ప్రభుత్వం చేసిన పలు ప్రయత్నాలు రక్షణ మంత్రుల భిన్నమైన ప్రకటనలే సజీవ సాక్ష్యాలు. మరోవైపు ఈ ప్రభుత్వం అబద్ధం ప్రచారాల కోసం తమకు అనుకూలమైన ఎలక్ట్రానిక్, ప్రింట్ మీడియా సంస్థలను వాడుకున్న విధానం. దీనితో పాటుగా సహకరించని మీడియాను తొక్కిపట్టిన తీరు అత్యంత అభ్యంతరకరం. కాంట్రాక్టు సమయంలోనే గోప్యత నిబంధనలు ఉన్నట్లు చెబుతుండడం.

దశాబ్దాల పాటు విమాన తయారీలో అనుభవం ఉన్న జాతీయ సంస్థ హిందుస్థాన్ ఎరోనాటిక్స్ లిమిటెడ్ (ఎచ్ఏఎల్)ను ఇందులో భాగస్వామ్యం చేయకపోవడంతో మెక్ ఇన్ ఇండియా సిద్ధాంతానికి తూట్లు పొడిచినట్లయింది. విమానాల తయారీలో ఏమాత్రం అనుభవం లేని రిలయన్స్ ఏరోస్ట్రక్చర్ లిమిటెడ్ (ఆర్ఏఎల్) సంస్థకు దీన్ని కట్టబెట్టడం లాంటివన్ని రాఫెల్ డీల్‌లో అంతర్గతంగా భారీ స్కాం జరిగినట్లుగటా ధృవపరుస్తున్నాయి. నిజానికిది నేరపూరిత దుష్ప్రవర్తన. అధికార దుర్వినియోగానికి పరాకాష్ట. ఏకంగా దేశ భద్రతనే దెబ్బతీసే చర్య ఇది. స్వతంత్ర భారత చరిత్రలో అతిపెద్ద కుంభకోణం ఇది.

### రాఫెల్ యుద్ధ విమానాల కొనుగోలు – పరిణామాలు

2008లో యుపిఏ ప్రభుత్వ హయాంలో 126 మీడియం, మల్టీ మోడల్ యుద్ధ విమానాల, మీడియం మల్టీ రోల్ కంబాట్ ఎయిర్‌క్రాఫ్ట్ (ఎంఎంఆర్‌సిఏ) తొలుతగా (రిక్వేస్ట్ ఫర్ ప్రపోజల్) ఆర్ఇపి ప్రతిపాదన చేశారు. దీనికి ఆరు సంస్థలు దరఖాస్తు చేసుకోగా ఫ్రాన్స్‌కు చెందిన డసాల్ట్ ఏవియేషన్ (రాఫెల్) సంస్థను ఖరారు చేశారు. అనేక దశల్లో చర్చలు జరిగాయి. ఇది 2015 ఏప్రిల్‌లో కొలిక్కి వచ్చింది. కాని డీల్ మారింది. 126 యుద్ధ విమానాల స్థానే 36 విమానాలు వచ్చాయి. 126 విమానాల ఖరీదు రు. 42,000 కోట్లని తొలుత ప్రకటించారు. కాని నేడు కేవలం 36 విమానాలనే రు. 58,000 కోట్లకు కొంటున్నారు. విమానాల సంఖ్య ఎందుకు తగ్గింది? రేటు ఎందుకు పెరిగింది' ఇది ఎవరి అనుమతితో జరిగింది? డీల్ పాదతే అయితే ఇంత పెరుగుదల ఎట్లా? ఒకవేళ కొత్తదైతే తాజాగా టెండర్లు ఎందుకు పిలవలేదు? దీనికి ప్రభుత్వం దగ్గర సమాధానం లేదు.

యుద్ధ విమానాలు భారత్‌లో తయారు చేస్తే వ్యయం అధికమవుతుంది. ఫ్రాన్స్‌లో ఉన్న ప్లాంట్‌లో తయారు చేస్తే ఒక్కొక్క విమానం 715 కోట్ల కన్నా తక్కువ పడుతుందన్న విషయాలు తెలిసి కూడా ఎందుకు వదిలేశారు? వర్క్‌షేర్ అగ్రిమెంట్ కింద హిందుస్థాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్ 70 శాతం పనిచేస్తుందని చెప్పి ఏడాది తిరగకుండానే అనుభవం లేని అంబానీ సారధ్యంలో రిలయన్స్ డిఫెన్స్ లిమిటెడ్‌ను (ఆర్‌డిఎన్) తీసుకొని దానికి 51 శాతం వాటా ఎందుకు కట్టబెట్టారు? ఈ అంశాలన్నింటిని బహిర్గతం చేయాల్సిన అవసరముంది.

### గతంలో రక్షణ రంగంలో కుదుర్చుకున్న బహిరంగ ఒప్పందాలు

2008 జనవరి 25న భారత్, ఫ్రాన్స్ ప్రభుత్వాల మధ్య రక్షణ రంగానికి సంబంధించి యుద్ధ విమానాల కొనుగోలు ఒప్పందాల్లో ధరలను బహిర్గతం చేయరాదన్న అంగీకార పత్రం లేదు. కాని ఇరుదేశాల సాంకేతిక సామర్థ్యాలను బహిర్గతం చేయరాదని ఒప్పందం జరిగింది. గతంలో రక్షణ రంగంలోని లావాదేవీలను ప్రజలకు తెలియజేసిన సందర్భాలు అనేకం ఉన్నాయి. 2010 మార్చ్ 15న లోక్‌సభలో అన్‌స్టార్డ్ ప్రశ్న నెం 2822 ద్వారా ఐఎన్ఎస్ విక్రమాదిత్యను 2330 మిలియన్ అమెరికన్ డాలర్లకు కొనుగోలు చేసినట్లు వెల్లడించారు. 2013 మార్చ్

4న లోక్‌సభ అన్‌స్టార్డ్ ప్రశ్న నెం 941 ద్వారా మిరేజ్ యుద్ధ విమానం ధరను తెలియజేశారు. 2010 ఆగస్టు 9న లోక్‌సభలో అన్‌స్టార్డ్ ప్రశ్న నెం 2318 ద్వారా సుఖోయ్ విమానాల కొనుగోలు వ్యయాన్ని తెలియ జేశారు. రాఫెల్ యుద్ధ విమానం ధర సుమారు 670 కోట్లని 2016 నవంబర్ 18న రక్షణ సహాయ మంత్రి డా. సుభాష్ భమ్రె లోక్‌సభలో అన్‌స్టార్డ్ ప్రశ్నకు సమాధానం ఇచ్చారు. 2018 మార్చ్ 19న రాజ్యసభలో ప్రశ్న నెం. 2574కు రక్షణ మంత్రిత్వ శాఖ రాఫెల్ యుద్ధ విమానం ధరను మరోమారు బహిర్గత పరిచింది. ఒక్కొక్క దాని ఖరీదు దాదాపుగా 670 కోట్లుగా పేర్కొంది. కాని డసాల్ట్ ఏవియేషన్ వార్షిక నివేదిక 2016లో వాస్తవిక ధర రు. 1670 కోట్లుగా ప్రకటించింది. ఈ అస్పష్ట ప్రకటనలకు ఈ ప్రభుత్వం సమాధానం చెప్పాలి.

రాఫెల్ డసాల్ట్ ఏవియేషన్ నుంచి రిలయన్స్ డిఫెన్స్ ఆఫెసెటి కాంట్రాక్టును అప్పజెప్పిన విషయం తనకు సమాచారం లేదని రక్షణ మంత్రి పార్లమెంట్ సాక్షిగా ప్రకటించడం పలు అనుమానాలకు దారితీసింది. ఫ్రెంచ్ రక్షణ మంత్రి భారత రక్షణ మంత్రిని 2017 అక్టోబర్ 27న ఢిల్లీలో కలుసుకొని అక్కడి నుండి నాగ్‌పూర్‌కు వెళ్లి అక్కడ మిహాన్‌లో ఏర్పాటు చేసిన డసాల్ట్ రిలయన్స్ ఏరోస్పెస్ తయారీ కేంద్రాన్ని ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో కేంద్ర కెబినెట్ మంత్రి నితిన్ గడ్కరీ, మహారాష్ట్ర ముఖ్యమంత్రి దేవేంద్ర ఫడ్నవీస్‌లు హాజరైనారు. ఇంతటి ప్రాధాన్యత గల విషయం రక్షణ మంత్రికి తెలియకుండా జరుగుతుందా? కాగా రిలయన్స్ కంపెనీ ఆర్ ఇన్‌ఫ్రా వెబ్‌సైట్‌లో స్పష్టంగా తాము 36 యుద్ధ విమానాల కొరకు రు. 30,000 కోట్ల విలువైన ఆఫ్‌సెట్ కాంట్రాక్ట్‌ను డసాల్ట్ ఏవియేషన్‌తో తీసుకున్నట్లు పేర్కొన్న విషయం నిజం అయినప్పటికీ ప్రభుత్వం తమకు తెలియదన్నట్లు నటించడం విచారకరం, బాధ్యతారహితం.

భారతదేశంలో రక్షణ ఉత్పత్తుల గురించి సభలో వెల్లడించడాన్ని ఏ గొప్యత ఒప్పందం అడ్డుకోలేదు. ఏ దేశం నుంచి కొనుగోలు చేసినా ఆ కొనుగోలు జరిగిన తీరును కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (సిఎజి) ఆడిట్ చేస్తుంది. ఒప్పందం తాలుకు పత్రాలను, ధరలను పరిశీలిస్తుంది. పార్లమెంట్‌కు చెందిన పబ్లిక్ అకౌంట్స్ కమిటీ (పిఎసి) కూడా దానిపై సమీక్షించే పద్ధతితో పాటు సంయుక్త పార్లమెంటరీ కమిటీతో దర్యాప్తు చేసే పద్ధతి కూడా మనదేశంలో కొనసాగుతున్నప్పుడు, ఒప్పందాల్లో రహస్యమేముంటుంది. ఇది ప్రజలందరికీ తెలిసిన సత్యం. దీనిని ఈ ప్రభుత్వం ఎట్లా సమర్థించుకుంటుంది. ఈ ప్రకటనలతో రక్షణ మంత్రి దేశాన్ని తప్పుదోవ పట్టిస్తున్నారు.

**అంబానీ సంస్థకు కాంట్రాక్టు ఎందుకు వచ్చింది?**

రాఫెల్ యుద్ధ విమానాలు కొంటున్నట్లు ప్రధాని నరేంద్రమోడీ 2015 ఏప్రిల్ 10న పారిస్‌లో ఆకస్మికంగా ప్రకటించారు. ఆ ప్రకటన వెలువడిన 14 రోజుల తర్వాత అంటే ఏప్రిల్ 24న రిలయన్స్ ఏరోస్ట్రక్చర్ లిమిటెడ్ అనే సంస్థ ఏర్పడింది. ఈ సంస్థ సృష్టి అంబానీదే. ఆర్‌డిఎల్‌కు అనుబంధ సంస్థ ఇది కేవలం ఐదులక్షల రూపాయల మూల ధనంతో ఏర్పాటయింది. ఆర్ఎల్‌కు సొంతంగా భూమి గాని, కనీసం సొంత భవనం గాని లేకపోగా రిలయన్స్‌కు రు. 8,000 కోట్ల అప్పులు, రు. 1300 కోట్లు నష్టాల్లో ఉంది. యుద్ధ విమానాల తయారీ నిమిత్తం పెట్టుకున్న దరఖాస్తు కూడా గోల్‌మాల్‌గా ఉంది. మరీ అభ్యంతరకరం ఏమంటే దరఖాస్తులో ఇచ్చిన చిరునామా గుజరాత్‌లోని మారుమూల గ్రామం. ఆ చిరునామాలో సంస్థ కార్యాలయం కూడా లేదు. అదే చిరునామాలో పిపావన్ డిఫెన్స్ అండ్ ఆఫ్‌షోర్ ఇంజనీరింగ్ ప్రైవేట్ లిమిటెడ్ అనే వేరే సంస్థ ఉంది. చివరికి లైసెన్స్ మంజూరి నాటికి అంటే 2016 ఫిబ్రవరి 22 నాటికి సొంతంగా జాగా లేనప్పటికీ ఇన్ని వేల కోట్ల రూపాయాల ఒప్పందం కుదుర్చు కునేందుకు ముందుకొచ్చింది. అలాంటి సంస్థకు కాంట్రాక్టు కట్టబెట్టడం వెనుక ఆంతర్యమేమిటి? అనిల్ అంబానీ సంస్థల వార్షిక నివేదికల ప్రకారం 2015 ఆగస్టు 28న ఆర్ఎఎల్‌కు నాగపూర్‌లోని మిహాన్ వద్ద ప్రత్యేక ఆర్థిక మండలి (సెజ్)లో 104 ఎకరాల స్థలాన్ని రు. 63 కోట్లకు కేటాయించారు. అంబానీ సంస్థ ఆ మొత్తాన్ని 2017 జూలైలో చెల్లించింది.

యుద్ధ వియానాల తయారీలో విశేషానుభవం ఉన్న డసాల్ట్ సంస్థ విమానాల తయారీలో అనుభవం ఉన్న ప్రభుత్వ రంగ సంస్థ అయిన హిందుస్థాన్ ఎరోనాటిక్స్ లిమిటెడ్ (ఎచ్ఎఎల్)ను తన పార్ట్‌నర్‌గా ఎంపిక చేసుకోలేదు. ఏమాత్రం అనుభవం, అడ్రస్ లేని రిలయన్స్ డిఫెన్స్ లిమిటెడ్ లాంటి సంస్థను తన పార్ట్‌నర్‌గా ఎంపిక చేసుకోవడం అంటేనే అవినీతికి, ఆశ్రిత పక్షపాతానికి తావిచ్చినట్లు స్పష్టంగా అర్థమవుతుంది. కేవలం ఒక వ్యాపారికి ప్రయోజనం చేకూర్చేందుకే గతంలో కుదిరిన ధరకు మూడు రేట్లు అధికంగా చెల్లించినట్లుగా అర్థమవుతుంది. ఇది పూర్తిగా నేరపూరిత దుష్ప్రవర్తనకు నిదర్శనంగా, అధికార దుర్వినియోగానికి పరాకాష్టగా అర్థం చేసుకోవచ్చు.

**రాఫెల్ కుంభకోణంలో సమాధానాలు దొరకని సందేహాలు**

36,000 కోట్ల విలువైన కాంట్రాక్టును పబ్లిక్ సెక్టారు యూనిట్ అయిన హిందుస్థాన్ ఎరోనాటిక్స్‌కు భాగస్వామ్యం ఉందని 2015 ఏప్రిల్ 8న ప్రధాని ప్రకటించి ఏప్రిల్ 10న మాట మార్చినాడు. ఇంత పెద్ద అనుభవం ఉన్న ప్రభుత్వం రంగ సంస్థను కాదని ఏ అనుభవనం, అడ్రస్‌లేని ప్రైవేట్ రంగ సంస్థను ఎందుకు ప్రోత్సహించారు. ప్రభుత్వ రంగ సంస్థ దెబ్బతినే విధంగా, ప్రభుత్వ ఖజానాకు నష్టం కలిగే విధంగానే రాఫెల్ డీల్ జరిగిందనేది యదార్థం. రక్షణ పరికారాలు పొందడంలో పాటించాల్సిన చట్టబద్ధమైన విధానాలను ఎట్టి పరిస్థితుల్లోను ఉపేక్షించరాదని ఉన్నప్పటికీ, ఉద్దేశపూర్వకంగానే ఉపేక్షించినారు. ముఖ్యంగా రక్షణ వ్యవహారాలను పర్యవేక్షించే క్యాబినెట్ ఆమోదం ముందుగా పొందాలి. కాని పొందలేదు. యుద్ధ విమానాల కొనుగోళ్ల ధర ఎంతో బయట పెట్టాలి, కాని చెప్పలేదు. మొత్తంగా ఈ లావాదేవీల్లో పారదర్శకత లోపించింది.

యుపిఎ ప్రభుత్వం 2012 డిసెంబర్ 12న అంతర్జాతీయ వేలం పాటలో ఒక్కొక్క విమానం ధర రు. 526.10 కోట్ల చొప్పున 36 విమానాలకు రు. 18,940 కోట్లకు కొనడం జరిగింది. ఆరు సంవత్సరాలకు ఈ ప్రభుత్వం 36 రాఫెల్ యుద్ధ విమానాలకు 7.5 బిలియన్ యూరోలు అనగా ఒక్కొక్క యుద్ధ విమానం ఖరీదు 1670.70 కోట్లు అంటే మొత్తంగా 60,145 కోట్లకు కొనడం జరిగింది. కేవలం ఈ కొద్ది కాలానికే రు. 41,205 కోట్ల ప్రజా ధనాన్ని అధికంగా ఎందుకు చెల్లించారో ఈ ప్రభుత్వం సమాధానం చెప్పాలి. అత్యంత అభ్యంతరకర విషయమేమంటే డసాల్ట్ ఏవియేషన్ సంస్థ 24 యుద్ధ విమానాలను ఈజిప్టుకు, 24 యుద్ధ విమానాలకు ఖతార్‌కు 2015 లోనే కేవలం

దేశీయం

# ఇదేనా వసుధైక భావన?

*పాలకులు తమ అవకాశవాద రాజకీయాల కోసం అస్సాంలో మత ప్రాతిపదికన ప్రజల మధ్య చిచ్చుపెట్టి విభజించు - పాలించు విధానాన్ని అమలు చేస్తున్నారని అంటున్నారు* **వంగాల సంపత్ రెడ్డి**

అసోం, భారతదేశపు ఈశాన్య రాష్ట్రం. అసోంకు ఉత్తర సరిహద్దులో భూటాన్, అరుణాచల్ ప్రదేశ్, తూర్పున నాగాలాండ్, మణిపూర్ రాష్ట్రాలు, దక్షిణాన మిజోరం, త్రిపుర రాష్ట్రాలు, పశ్చిమాన బంగ్లాదేశ్, మేఘాలయ, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలు ఉన్నాయి. మొదట్లో అస్సాం బెంగాల్ ప్రెసిడెన్సీలో భాగంగా ఉండేది, 1905లో బెంగాల్ విభజన తరువాత 1912లో తూర్పు బెంగాల్, అస్సాం కొత్త రాష్ట్రంలో చేర్చబడింది. 1912లో అస్సాం ప్రావిన్స్ తిరిగి స్థాపించబడింది.

స్వాతంత్ర్యం తరువాత అసోం అరుణాచల్‌ప్రదేశ్, నాగాలాండ్, మిజోరం, మేఘాలయా రాష్ట్రాలుగా విడిపోయింది. మైదానాలు, నదీ లోయలతో కూడిన ప్రాంతం అసోం. అసోంలో ప్రజలు ఎక్కువ సంఖ్యలో గ్రామీణ ప్రాంతాలలో నివసిస్తున్నారు. తేయాకు తోటలు, జూట్, పెట్రోలియం, సహజవాయువులకు అసోం రాష్ట్రం ప్రసిద్ధి.

తేయాకు తోటలలో పనిచేయడానికి బ్రిటిష్ వారి కాలంనుండి ఉపాధి వెతుక్కుంటూ పొట్ట చేత పట్టుకుని బెంగాల్ నుండి, నేపాల్ నుండి, బర్మా నుండి, దేశంలోని నలుమూలల నుండి చాలా మంది అసోంకు వలస వచ్చారు. వలస వచ్చిన వారి శ్రమను అతి చౌకగా కాజేసిన పెట్టుబడిదారులు వలసలను ప్రోత్సహించారు. దానికి పాలకుల అండదండలు ఉన్నాయి. అఖండ భారతంలో ఉమ్మడి బెంగాల్ ఒక భాగం కనుక అప్పుడు వలసల పట్ల ఇప్పుడున్నంత వ్యతిరేకత లేదు. అయినా బెంగాల్ బాబుల పెట్టుబడిదారుల గురించి వారి దుర్మార్గాల గురించి అప్పుడు కూడా చాలా చర్చ జరిగింది.

భారతదేశ విభజన కాలంలో, భారతదేశం సహాయంతో తూర్పు పాకిస్థాన్, బంగ్లాదేశ్ ఏర్పడిన కాలంలో భారతదేశానికి వలసలు వెల్లువెత్తాయి. ఇలా వలస వచ్చిన వారిని విదేశీయులుగానే స్థానికులు పరిగణించడం మొదలు పెట్టారు.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత భారత ప్రజలు తాము రాసుకున్న రాజ్యాంగంలోని 5-11 ప్రకరణలు పౌరుల పౌరసత్వానికి సంబంధించిన పలు విషయాలను వివరిస్తాయి. 1950, జనవరి 26న రాజ్యాంగం ఆమోదించడానికి ముందే 1949, నవంబర్ 26న ఇవి అమలు చేయబడ్డాయి. ఆర్టికల్ 11 చట్టం ద్వారా పౌరసత్వంను నియంత్రించే అధికారం పార్లమెంటుకు ఉంది. 1955లో పౌరసత్వ చట్టం ఆమోదించబడింది.

ఇది 1986, 2003, 2005, 2015లలో సవరించబడింది. అయినా, అసోం ప్రజల సాంఘిక, సాంస్కృతిక ప్రయోజనాలను కాపాడడానికి, పార్లమెంటు 1950లో ది ఇమ్మిగ్రెంట్స్ యాక్ట్‌ను అమలు చేసింది. ఈ చట్టం కింద భారతదేశం వెలుపల నుండి అస్సాంలోకి వచ్చిన వ్యక్తిని తొలగించాలని ఆదేశించింది కేంద్ర ప్రభుత్వం. దీని ప్రకారం మొదటి జాతీయ పౌర రిజిస్టర్‌ను 1951లో రూపొందించారు.

---

7.9 బిలియన్ యూరోలకు అంటే ఒక్క యుద్ధ విమానానికి రు. 1319.80 కోట్ల చొప్పున అమ్మింది. కాని అదే సంవత్సరంలో జరిగిన భారత ఒప్పందంలో ఒక్కో రాఫెల్ యుద్ధ విమానానికి రు. 1670.70 కోట్లు చెల్లించింది. ఈజిప్టు, ఖతార్ దేశాలతో పోలిస్తే భారత్ ఒక్కో యుద్ధ విమానానికి రు. 350.90 కోట్లు అధనంగా చెల్లించింది. అంటే 36 యుద్ధ విమానాలకు రు. 12,632 కోట్లు అధనంగా చెల్లించింది. కొనుగోళ్ల ధరకు సంబంధించి తప్పనిసరిగా కాంట్రాక్టు నెగోషియేషన్, ప్రైస్ నెగోషియేషన్ కమిటీల ద్వారా పాటించాల్సిన కనీసం నిబంధనలను పాటించలేదు. ఈ సందేహాలన్నీ పెద్ద స్కాం జరిగిందన్న విషయాన్ని ధృవీకరిస్తున్నాయి.

ఈ ప్రభుత్వం జాతీయవాదం ముసుగు కప్పుకొని భారతదేశ చరిత్ర, సంస్కృతి, సంప్రదాయాలకు మూలం మేమేనంటూ, దీనికి నిజమైన వారసులుగా నిలబడతామని పడిగట్టు పదాలతో నీతి వాక్యాలను వల్లిస్తుంది. జాతీయ భద్రత ప్రయోజనాలను పణంగా పెడుతూ వాస్తవాలను తొక్కిపట్టి పొంతనలేని వాదనతో ఆత్మ వంచనకు పాల్పడు తున్నది. భారత అంతర్గత భద్రతా నిబంధనల ప్రకారం విదేశీ సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రభుత్వ రంగ సంస్థలకు బదిలీ చేసి బలమైన సంస్థలుగా రూపుదిద్దుకునేందుకు కృషి చేయాలి. మెక్ ఇన్ ఇండియా నినాదం ప్రచారం కోసం కాకుండా ఆచరణలో చూపించాలి. అనుభవం కలిగిన అంతర్జాతీయంగా గుర్తింపు ఉన్న హిందుస్థాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్ ప్రభుత్వ రంగ సంస్థను పక్కనబెట్టి రాజకీయ ప్రయోజనాల కొరకు ఎలాంటి అనుభవం లేని ప్రైవేట్ సంస్థకు ఇంత పెద్ద కాంట్రాక్టును కట్టబెట్టడం ఈ ప్రభుత్వ దిగజారుడు విధానాలుగా అర్థం చేసుకోవాలి.

గొప్పత నిబంధనల పేరుతో అనర్హులకు, ఆశ్రిత పక్షపాతులైన కార్పొరేట్ శక్తులకు దొడ్డిదారిన ప్రయోజనాలను కల్పించి పారదర్శకతకు తూట్లు పొడిచింది. దేశ భద్రత పేరుతో ప్రజా ధనాన్ని దుర్వినియోగం చేస్తూ భద్రతను గాలిలో దీపం చేయడం జరిగింది. నిజానికి ఈ ప్రభుత్వం జాతీయ భద్రత విషయంలో ఎందుకు రాజీపడ్డది? ప్రభుత్వ రంగ సంస్థ హిందుస్థాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్ ప్రయోజనాలను ఎందుకు ఫణంగా పెట్టింది? ఆశ్రిత పెట్టుబడిదారులకు దొడ్డిదారిన ఎందుకు ప్రయోజనాలను కల్పించారన్న విషయాలకు సమాధానం చెప్పాల్సిన అవసరముంది.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ యూనివర్సిటీ)* వీ

తదనంతరం కూడా వలసలు కొనసాగాయి. వలసల వల్ల అసోం జనాభా విపరీతంగా పెరిగింది. అస్సామీ మాట్లాడే వారి సంఖ్య రోజురోజుకూ తగ్గిపోసాగింది. అందువలన 1961లో అప్పటి అసోం ప్రభుత్వం అస్సామీ భాషను తప్పనిసరి చేసింది. దానిని వలసవచ్చిన ప్రజల వ్యతిరేకత మూలంగా ఉపసంహరించుకుంది. చౌకగా శ్రమను కాజేసే ఉద్దేశంతో పెట్టుబడిదారులు వలసవచ్చిన వారికి ఉపాధిని ఇచ్చేవారు. తత్ఫలితంగా స్థానికులకు ఉపాధి దొరకడం కష్టం అయింది. ఈ సందర్భంలో వలస వచ్చిన వారి పట్ల స్థానికులకు వ్యతిరేకత పెరిగింది. తమకు ఉపాధి కల్పించడం కోసం తక్షణమే వలసలను నిరోధించాలని, స్థానికేతరులను పంపించివేయాలని, అక్రమంగా ఉన్న విదేశీయులను వారి స్వదేశానికి పంపించివేయాలని ప్రజలు ఆందోళనలు చేశారు. అదే సమయంలో భారత సైన్యం సహాయంతో తూర్పు పాకిస్థాన్, బంగ్లాదేశ్‌గా అవతరించింది. అ సందర్భంలో భారతదేశం పాకిస్థాన్‌తో యుద్ధం చేసింది. దాని ఫలితంగా లక్షలాది బంగ్లాదేశీయులు శరణార్థులుగా అక్రమంగా అసోంలోకి వచ్చారు. ఈ విధంగా వచ్చిన శరణార్థుల వల్ల అసోంలో నిరుద్యోగం ప్రధాన సమస్యగా మారింది.

బంగ్లాదేశ్ నుంచి అక్రమ వలసదారులు తక్కువ వేతనాలతో నిర్మాణరంగంలో కూలీలుగా, రిక్షా కార్మికులుగా, కూరగాయల అమ్మకందారులుగా ఉద్యోగాల కోసం స్థానిక కార్మికులతో పోటీపడ్డారు. దానివలన వలసదారుల పట్ల తీవ్ర వ్యతిరేకత మొదలైంది. ఆ వ్యతిరేకతతో 1979-1985 మధ్యకాలంలో అసోం స్థానిక ప్రజలు తీవ్రంగా ఉద్యమించారు. దాని ఫలితంగా 1985, ఆగస్టు 15 నాడు అసోం ప్రజలకు, కేంద్ర ప్రభుత్వానికి మధ్య కుదిరిన ఒప్పందం ప్రకారం మార్చ్ 25, 1971 తర్వాత అసోంలోకి వచ్చినవారిని వారి దేశంలోకి పంపించివేస్తారు. అసోం ప్రజల ఉద్యమాలకు నాయకత్వం వహించిన వర్గం 1985లో అసోంలో అధికారంలోకి వచ్చింది. అయినా ప్రజల సమస్యలకు ఒక పరిష్కారం కనుగొనలేకపోయింది. ఉద్యమాల నుంచి ఎదిగిన నాయకత్వం చివరకు పెట్టుబడిదారుల ప్రయోజనాలకు అనుగుణంగా పనిచేసింది. తత్ఫలితంగా ఇవ్వాల్టి వరకు కూడా సమస్య పరిష్కారం కాలేదు.

2011 జనాభా లెక్కల ప్రకారం అస్సామీ మాట్లాడే ప్రజల సంఖ్య క్రమంగా తగ్గిపోతుంది. అధిక సంఖ్యాకులైన హిందువుల సంఖ్య క్రమంగా తగ్గుతుంటే ముస్లింల సంఖ్య క్రమంగా పెరిగింది. దీనిని ఆసరాగా చేసుకొని సంఘ్ పరివార్, దాని అనుబంధ సంస్థలు, భారతీయ జనతా పార్టీ తమ రాజకీయ ప్రయోజనాల కోసం హిందూ మత పరిరక్షణ పేరుతో అసోం ప్రజల మధ్య వైషమ్యాలను పెంచిపోషించాయి. తత్ఫలితంగా సంఘ్ పరివార్ బలపరిచిన భారతీయ జనతా పార్టీ అసోంలో అధికారంలోకి వచ్చింది. దీని ఫలితంగా హిందుత్వ శక్తులు విజృంభిస్తున్నాయి. ఈ సందర్భంలోనే భారత సుప్రీంకోర్టు పర్యవేక్షణలో కేంద్ర ప్రభుత్వం జాతీయ పౌర రిజిస్టర్ డ్రాఫ్టును ప్రచురించింది. దాదాపు మూడు కోట్ల ముప్పై లక్షల మంది దరఖాస్తులను స్వీకరించిన ప్రభుత్వం దాదాపు నలభై లక్షల మంది భారత పౌరులు కాదని తెల్చి చెప్పింది. అభ్యంతరాలను స్వీకరించి ఈ సంవత్సరం చివరి నాటికి తుది జాతీయ పౌర రిజిస్టర్‌ను వెలువరిస్తామని ప్రభుత్వం ప్రకటించింది.

ఈ జాతీయ పౌర రిజిస్టర్ డ్రాఫ్టు వలన మళ్లీ అసోం చర్చల్లోకి వచ్చింది. దేశమంతా చర్చ జరుగుతోంది ఏంటి ఈ జాతీయ పౌర రిజిస్టర్ అని? ఇన్ని లక్షల మంది జాతీయతను రద్దు చేయడమేంటని? ఇంత ఆందోళనలకు కారణం అయిన ఈ రిజిస్థర్ ఏ విలువల వ్యాప్తికి ఇప్పుడు ప్రచురించారని? పాలక వర్గాలు తీసుకుంటున్న అనాలోచిత నిర్ణయాలు అసోం ప్రజలు, అక్రమ వలసదారులుగా ఉన్నారని చెప్పబడుతున్న ప్రజల మధ్య విద్వేషాలను పెంచుతున్నాయి, అంతరాలకు కారణమవుతున్నాయి. అక్రమ వలసలతో తమ నేల మీద తామే పరాయికరణకు గురౌతున్నామన్న ఆందోళనతో పాటు తమ జీవితాల్లోని పేదరికానికి కారణం అక్రమ వలసలేనని భావించిన స్థానిక ప్రజలు అక్రమ వలసదారులను తిరిగి పంపించే రాజకీయ పార్టీలకు ఓటు బ్యాంకుగా మారారు. స్థానిక ప్రజల ఆందోళనలకు పరిష్కారాలు వెతకకపోగా ప్రజల ఆందోళనలను పెంచి పోషిస్తున్నారు. పేదరిక నిర్మూలనకు చర్యలు తీసుకోవడం, ఉపాధి అవకాశాలు పెంచడంలో విఫలమైన పాలకవర్గాలు తమ బలహీనతలను కప్పిపుచ్చుకోవడానికి వైషమ్యాలను రెచ్చగొడుతున్నాయి. ఆ వైషమ్యాలను అసరాగా చేసుకుని అసోంలోని వనరులను కార్పొరేట్ కంపెనీలకు అప్పగించేందుకు, ప్రైవేటీకరించేందుకు పాలక వర్గాలు ఏమైనా ప్రయత్నాలు చేస్తున్నాయా అని అనుమానం వేస్తున్నది.

వసుధైక కుటుంబ భావన, భారత సంస్కృతి అని చెప్పేవాళ్లు పొట్ట చేతబట్టుకుని వచ్చిన అతిథిని సత్కరించే పద్ధతి ఇదేనా? ఆ అతిథి హిందువా, ముస్లిమా అని చూస్తాడా? అఖండ భారతదేశమని ప్రవచించే పాలకవర్గాల హృదయం ఇంత సంకుచితమా? మీరు ప్రవచిస్తున్న అఖండ భారత ప్రజలే కదా! శత్రువునైనా క్షమించి వదలడం ఈ దేశ సంస్కృతి కదా! మరి పాలక వర్గాలకు పొట్ట చేత బట్టుకుని వచ్చిన వారిపై ఎందుకంత ద్వేషం? వారు ఇస్లాం ఉగ్రవాదానికి వెన్నుదన్నుగా ఉంటున్నారనా? ఉన్నారని ఎలా నిర్ధారించారు? ఒకవేళ అలా ఉన్నా కూడా వారిని క్షమించి, సరిదిద్ది ఈ దేశ పౌరులుగా అంగీకరించాల్సిందే. ఎక్కడయితే ఆర్థిక అసమానతలు ఉంటాయో, ఎక్కడైతే మనుషులు వివక్షతలు ఎదుర్కొంటారో, అక్కడ ప్రజా పోరాటాలు ఉంటాయని పాలకులు గుర్తించాలి.

తమకు వత్తాసు పలుకుతున్న పెట్టుబడిదారులకు ప్రయోజనాలు కలిగించే ఉద్దేశంతో ఇంతకాలం చూసి చూడనట్లుగా వ్యవహరించిన పాలక వర్గాలే ఈ సమస్య సృష్టికి కారణం. తాము చేసిన పొరపాట్లను సరిదిద్దుకోవాలి.

పాకిస్థాన్, బంగ్లాదేశ్, ఆఫ్ఘనిస్థాన్ నుంచి వచ్చిన హిందూ, సిక్కు, బౌద్ధ, జైన్, పార్సీ, క్రిస్టియన్ ప్రజలకు పౌరసత్వం ఇవ్వడం కోసం పౌరసత్వ చట్టం-1955ను సవరించడానికి పౌరసత్వం (సవరణ) బిల్లు, 2016 ద్వారా డిసెంబర్ 14, 2014 కు ముందు ప్రవేశించిన వారికి పౌరసత్వం ఇవ్వాలని పాలకవర్గం సంకల్పించడం మతం పేర ప్రజలను విడదీసి వైషమ్యాలను సృష్టించే ప్రయత్నం. అసోంలోని పలు సంస్థలు ప్రతిపాదిత బిల్లుకు వ్యతిరేకంగా పని చేస్తున్నాయి.

మతంతో సంబంధం లేకుండా దేశంలో నివసించే హక్కు ప్రజలకు ఉండాలని, ఈ దేశ పౌరసత్వం కోరుకునే వారికి మతంతో సంబంధం లేకుదా పౌరసత్వం ఇవ్వాలని పౌరసమాజం నిలదీయాలి.

*(రచయిత అధ్యాపకుడు)* వీ

# డొల్ల పాలనలో డొల్ల కంపెనీలు

***వ్యాపారులు తమ అక్రమార్జనను కాపాడుకోవడానికి డొల్ల  కంపెనీలను ఏర్పాటు చేస్తారనీ, ప్రభుత్వాలు ప్రత్యేక విభాగాలను ఏర్పాటు చేసి వీటిని నిరోధించాలనీ అంటున్నారు* డా. గడ్డం లక్ష్మణ్**

ఎక్కడైనా ఒక చిన్న ఆఫీస్‌రూంలో ఏకంగా 114 కంపెనీలు ఉంటాయా? ప్రపంచీకరణ రంగుల ప్రపంచంలో ఉంటాయి మరి! జూబ్లీహిల్స్ రోడ్ నెం. 36లో ఉన్న ఫార్చున్ మోనార్క్ మాల్ కాంప్లెక్స్‌లోని ఒకే రూంలో 114 కంపెనీలు కొలువై ఉన్నాయని కంపెనీల రిజిస్ట్రార్ (రిజిస్ట్రార్ ఆఫ్ కంపెనీస్–ఆర్ఒసి) 2018 జూలై 25న జరిపిన రెయిడింగ్‌లో వెలుగులోకి వచ్చింది. తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ప్రజలకు ఎలాగూ ఇవ్వలేకపోయింది, కనీసం ఈ కంపెనీలకైనా ఒక్కొక్క సంస్థకు ఒక్కో డబుల్ బెడ్‌రూం ఇళ్లు ఇవ్వాల్సి వస్తుందోమో ఆలోచించుకోవాలి.

114 కంపెనీల్లో కేవలం 30 మంది ఉద్యోగస్తులున్నారు. ఇందులో కొంతమంది డైరెక్టర్లుగా కొనసాగుతున్నారు. ఈ కంపెనీలను నడుపుతున్నది మళ్లీ సత్యం రామలింగరాజే. రామలింగరాజు కుటుంబం 1999లో స్థాపించన ఎస్ఆర్ఎస్ఆర్ అడ్వయిజరీ సర్వీసెస్ సంస్థ దీనికి ఆర్థిక వ్యవహారాల సలహాదారు. ఇది కూడా ఒక బోగస్ సంస్థ. వార్షిక ఆస్తి, అప్పుల పట్టికను తయారు చేసి కంపెనీ రిజిస్ట్రార్‌కు నివేదించడం, బోర్డు సమావేశాల్లో తీసుకున్న తీర్మానాలను సమర్పించడం వంటి సేవలను ఈ 114 కంపెనీలకు ఎస్ఆర్ఎస్ఆర్ అడ్వయిజరీ సంస్థ పంపిస్తుంది. ఒక్కొక్క డైరెక్టరు 25 నుంచి 30 కంపెనీలను నిర్వహిస్తున్నారు. కంపెనీల చట్టం ప్రకారం ఒకే వ్యక్తి 20 కంపెనీలకు మించి డైరెక్టరుగా వ్యవహరించడానికి వీలు లేదు. అయినా కొనసాగుతున్నారు. మంచి జీతాలు కూడా పొందుతున్నారు. కంపెనీలంటే కంపెనీలు కావు. చట్టం దృష్టిలో మాత్రమే కంపెనీలు. ఉన్నట్లు కనిపిస్తుందంతే. అందులో ఎలాంటి ఉత్పత్తి కాని, వ్యాపార లావాదేవీలు కాని కొనసాగవు. జరుగుతున్నట్లు భ్రమింపజేస్తాయి. అవి పేపరు మిని కంపెనీలు. ఉత్పత్తి కంపెనీలు. అంత పైపైనే. లోపల మాత్రం అంతా డొల్లే. వాటిని డొల్ల కంపెనీలంటారు.

లోపాయికారి పాలకులున్నంతవరకు ఈ డొల్ల కంపెనీల మనుగడకు ఎలాంటి ముప్పు ఉండదు. ఇంకా అభివృద్ధి చెందుతాయి. ఈ రెయిడ్స్‌పై నివేదికను కంపెనీ వ్యవహారాల మంత్రిత్వ శాఖకు పంపడం, నివేదికను పరిశీలించిన తర్వాత మంత్రిత్వ శాఖ అనుబంధమైన తీవ్ర నేరాల దర్యాప్తు కార్యాలయం (సీరియస్ ఫ్రాడ్ ఇన్వెస్టిగేషన్ ఆఫీస్ – ఎస్ఎఫ్ఐఒ) లోతైన విచారణ జరిపే అవకాశముంది. శిక్షలు పడతాయా అన్నది మాత్రం చెప్పలేని విషయం.

గత సంవత్సరం ఆగస్టులో సెక్యూరిటీస్ ఎక్సేంజ్ బోర్డ్ ఆఫ్ ఇండియా (సెబి) 331 షెల్ (డొల్ల) కంపెనీలపై కఠినమైన చర్యలు తీసుకోవాలని, వాటి షేర్ల క్రయ విక్రయాలను, ఇతర లావాదేవీలను రద్దు చేయాలని ఆదేశాలిచ్చింది. అంతేగాక కంపెనీ వ్యవహారా మంత్రిత్వ శాఖ 2,09,032 అపరాద కంపెనీల రిజిస్ట్రేషన్‌ను రద్దు చేసింది. ఈ చర్యతో దాదాపుగా ఏడువేల కోట్ల రూపయాల మదుపుదార్ల పెట్టుబడి స్థంబించిపోయి చిన్న ముదుపుదార్లు తల్లడిల్లిపోయారు. తప్పు చేసిందొకరు, శిక్ష పడింది మరొకరికి. స్టాక్ మార్కెట్‌లో చిన్న మదుపుదార్లకు రక్షణ కరువైంది.

**డొల్ల కంపెనీ నిర్వచనం ఉందా?**

విచిత్రంగా కంపెనీల చట్టం కాని, సెబి గాని, ఇతరత్రా ఆర్థిక నియంత్రణ సంస్థలు గాని డొల్ల కంపెనీలంటే ఏమిటో సమగ్రంగా నిర్వచించ లేదు. కాని అవి అక్రమాలకు పాల్పడినప్పుడు మాత్రం బినామీ వ్యవహారాల నిరోధక చట్టం 2013 ప్రకారం గాని, అక్రమ ద్రవ్య బదిలీ నిరోధక చట్టం 2002 ప్రకారం గాని, కంపెనీల చట్టం 2013 ప్రకారం గాని నేరస్థ కంపెనీగా పరిగణిస్తుంది.

అయినప్పటికీ ఏ ఉత్పత్తి కార్యకలాపాలు చేపట్టకుండా లేదా వాటితో వ్యవహరించకుండా ఏ ఇతర ఆర్థిక సేవలు అందించకుండా, మెరుగైన వ్యాపార వ్యవహారాలు నిర్వహించకుండా కేవలం అక్రమ ఆర్థిక లావాదేవాల బదిలీల నిమిత్తం, పన్నుల ఎగవేత కోసం, స్టాక్ ఎక్స్చేంజీలను వినియోగించుకుంటూ నల్లధనాన్ని సక్రమంగా మార్చేందుకు ఏర్పాటు చేసుకున్న ఇలాంటి కంపెనీలను డొల్ల కంపెనీలుగా పేర్కొంటారు. ఇవి చట్టం ప్రకారం ఏర్పడిన చట్ట వ్యతిరేక కార్యకలాపాలు నిర్వహించే చట్టబద్ద సంస్థలు.

**డొల్ల కంపెనీల పనితీరు**

ఈ కంపెనీలు నిర్వహించే కార్యకలాపాలు తెలుసుకునేందుకు ఒక ఉదాహరణ తీసుకుందాం. ఒక కంపెనీ 'ఏ' సెబిలో రిజిస్ట్రర్ అయిందనుకుందా. ఈ కంపెనీ పదివేల రూపాయల విలువ చేసే వస్తువులను కొనుగోలు చేసి ఆ విలువను రూపాయలు ఇరవై వేలుగా పెంచి బిల్లు చూయించాలనుకుంటుంది. ఇది ఎట్ల సాధ్యమవుతుంది? ఇందుకు గాను ఇది ఇంకొక షెల్ కంపెనీ 'బి'ని ప్రారంభిస్తుంది. పన్నులు లేని దేశంలో ప్రారంభించడం మరీ సులభం. తర్వాత 'ఏ' కంపెనీ ఆ వస్తువులను 'బి' కంపెనీకి అమ్ముతుంది. మళ్లీ వాటిని తిరిగి ఇరవై వేలకు కొనుగోలు చేస్తుంది. ఆ మేరకు బిల్లును అధికారికంగా చూపెడుతుంది. ఇక్కడ జరిగిన విషయాలేంటంటే కంపెనీ 'బి' అనేదొక డొల్ల కంపెనీ. దాని కంపెనీ 'ఏ' దురుద్దేశంతో ప్రారంభిస్తుంది. వస్తువులు కొనుగోలు చేసింది వాస్తవానికి పదివేల రూపాయలకు మాత్రమే. కాని లెక్కలో కనబడుతున్నది మాత్రం ఇరవై వేల రూపాయలు. ఇలాంటి

ఎన్నో ఆర్థిక వ్యవహారాలు జరిగిపోతుంటాయి. పన్నులు ఎగ్గొడుతుంది.

ఒక కంపెనీ నుంచి మరో కంపెనీకి కోట్ల రూపాయలను బదిలీ చేయడం, చివరికి చివరి కంపెనీ ఆ మొత్తాన్ని తిరిగి చెల్లించలేక పోతున్నానని చెప్పడం, నిధులను బదిలీ చేసిన కంపెనీ ఆ అప్పును రద్దు (రైటాఫ్) చేయడం వంటి చర్యలకు పాల్పడుతున్నాయి.

**ఎదురవుతున్న సమస్యలు**

కంపెనీల చట్టంలో వీటికి సంబంధించిన నిర్వచనం లేకపోవడం వలన ప్రధానంగా నియంత్రణ సమస్య ఎదురవుతుంది. ఒక అధ్యయనం ప్రకారం దేశంలోని మొత్తం 15 లక్షల రిజిస్టరు కంపెనీలలో కేవలం ఆరు లక్షల కంపెనీలు మాత్రమే తమ వార్షిక ఆర్థిక నివేదికలను సమర్పిస్తున్నాయి. అంటే మిగతావన్నీ డొల్ల కంపెనీలుగా పరిగణించాల్సి వస్తుంది. పైగా వీటి అక్రమ కార్యకలాపాలను ప్రత్యక్షంగా నియంత్రించడానికి ప్రత్యేకంగా చట్టాలు లేకపోవడం మరో సమస్య. ఈ సంస్థలు ఏవి చట్ట వ్యతిరేక కలాపాలకు పాల్పడుతున్నాయని నిర్ధారించడం చాలా కష్టతరం. ఎందుకంటే వీటి ఆర్థిక వ్యవహారాల వివరాలు సేకరించే యంత్రాంగం లేకపోవడం మరో తీవ్ర సమస్య.

ఎగవేత, మోసపూరిత ఆర్థిక వ్యవహారాలు నిర్వహించే ఉద్దేశంతో ఏర్పాటు చేసిన ఈ కంపెనీ వాటాలను జారీచేసి మూల ధనాన్ని సేకరిస్తారు. అయితే ఈ షేర్లను మొదట్లో జన బాహ్యుళ్యం కొనుగోలు చేయడానికి ముందుకు రారు. సంస్థతో సంబంధమున్న అతి తక్కువ మంది మాత్రమే తమలో తామే క్రయ విక్రయాలు జరుపుతూ షేర్ల ధరలను కృత్రిమంగా పెరిగేలా చేస్తారు. అంటే చట్టాల కళ్లుగప్పి స్టాక్ మార్కెట్‌లో బహిరంగంగానే వెలిగిపోతారు. ఈ వెలుగును మాత్రమే చూసిన జనం ఆ షేర్ల కొనుగోలు కోసం వెంపర్లాడుతారు. చివరికి భంగపాటుకు గురవుతారు. స్టాక్ మార్కెట్‌లో షేర్లను కొనేముందే జాగ్రత్తగా ఆలోచించి నిర్ణయం తీసుకోవాల్సిందని ఒక ఉచిత సలహా పడేసి చేతులెత్తేస్తున్నాయి. 'సెబి' లాంటి నియంత్రణా సంస్థలు, స్టాక్ మార్కెట్ ఎదుర్కొంటున్న అతిపెద్ద సమస్య ఇది.

**గుర్తించిన ప్రాంతాలు**

డొల్ల కంపెనీల ప్రధాన స్థావరం కలకత్తాగా విచారణ సంస్థలు గుర్తించాయి. గుర్తించబడిన 331 కంపెనీల్లో సగానికి సగం కలకత్తాలోనే కేంద్రీకృతమయ్యాయి. ఇంకా మహారాష్ట్రలో 63, ఢిల్లీలో 35 మిగతావి ఇతర ప్రాంతాలలో వెలిసినట్లు వెల్లడైంది. తాజాగా హైదరాబాద్‌లో కూడా బయటపడ్డాయి.

**చేపట్టిన చర్యలు**

2013లో కంపెనీల చట్టాన్ని సవరించిన తర్వాత ఇలాంటి సంస్థల పైన కఠినతరమైన నిబంధనలను అమలు చేస్తున్నారు. డొల్ల కంపెనీలపై ఎక్కువ దృష్టి సారించారు. కార్పొరేట్ వ్యవహారాల మంత్రిత్వ శాఖ 2017-18 సంవత్సరంలో 2.26 లక్షల కంపెనీలు ఎలాంటి వ్యాపార వ్యవహారాలు నిర్వహిస్తున్నట్లు లేదని నిర్ధారించారు. వాటి షేర్లను ఆర్‌ఓసి రికార్డుల నుంచి తొలగించింది. కాని ఈ కంపెనీల నుంచి ఇన్‌కం టాక్స్ డిపార్టుమెంట్‌కు కోట్ల రూపాయల బకాయిలున్నాయి. కనుక కంపెనీల షేర్లను మళ్లీ రికార్డుల్లో చేరిస్తే తప్ప బకాయిలు వసూలు చేసుకునే అవకాశాలు లేవు. ఇందుకోసం ఇన్‌కం టాక్స్ అధికారులు ఇలాంటి కేసులను గుర్తించి ఆగస్టు 2018లోగా నేషనల్ కంపెనీ లా ట్రిబునల్స్ (ఎన్‌సిఎల్‌టి) కు చెందిన ఆయా శాఖల్లో పిటిషన్లు వేయాలని సెంట్రల్ బోర్డ్ ఆఫ్ డైరెక్ట్ టాక్స్ (సిబిడిటి) ఆదాయ పన్ను శాఖ అధికారులను ఆదేశించింది. ఈ పరిణామం ఆదాయపు పన్ను శాఖను కంపెనీ రిజిస్ట్రారుకు మధ్య సమన్వయం కొరవడడాన్ని ఎత్తి చూపుతుంది.

వాటిని డొల్ల కంపెనీలుగా గుర్తించింది కాని, శిక్షలు విధించే చట్టాలు మాత్రం చేయకపోవడం విచారకరం. దేశంలో ముంబాయి, గుజరాత్, ఆంధ్రప్రదేశ్, తెలంగాణ, తమిళనాడు, బెంగుళూరు, పశ్చిమబెంగాల్ వంటి ప్రదేశాల్లో ఉన్న ఈ సంస్థలపై నిఘా మరింత పెంచాలి. తాజాగా 2018 జూన్ నాటికి దేశంలో 17.79 లక్షల కంపెనీలున్నాయి. అందులో 11.89 లక్షల కంపెనీలు (66 శాతం) మాత్రమే తమ ఖాతాలకు సంబంధించిన రిటర్నులను స్టాక్ ఎక్స్‌చేంజీలో ఎప్పటికప్పుడు సమర్పిస్తున్నాయి.

**మోసపూరిత చర్యలకు శిక్షలు పడాలి**

డొల్ల కంపెనీలపై ప్రస్తుతం చేపడుతున్న ప్రభుత్వ చర్యలు కేవలం అసమగ్రమైన ఆరంభ చర్యలు మాత్రమే. వాటిని పూర్తిగా అరికట్టాల్సిన మరిన్ని కఠిన చర్యలు చేపట్టాలి. చిన్న మదుపుదారులను రక్షించాలి. ఇదుకు గాను తీవ్ర నేరాల దర్యాప్తు కార్యాలయం ఇలాంటి డొల్ల కంపెనీల సమాచార బ్యాంకును సేకరించి కంప్యూటర్‌లో నిల్వ ఉంచాలి. స్తబ్ధ కంపెనీలు, డొల్ల కంపెనీల మధ్య వ్యత్యాసాన్ని కచ్చితంగా గుర్తించాలి. స్థబ్దుగా ఉండే కంపెనీలు డొల్ల కంపెనీలుగా మారకుండా చర్యలు చేపట్టాలి.

ప్రత్యేకంగా డొల్ల కంపెనీలతో మాత్రమే వ్యవహరించడానికి ఉద్దేశించిన ప్రత్యేక చట్టాన్ని రూపొందించాలి. మోసపూరిత చర్యలకు పాల్పడిన వారిని కఠినంగా శిక్షించే విధంగా ఈ చట్టాన్ని రూపొందించాలి. ఆర్‌ఓసిలో రిజిస్టరు కాబడిన ప్రతి కంపెనీ సమాచారం, ఖాతాలతో పాటు సంబంధిత శాఖల్లో సమర్పించాలి.

ఆదాయం ఉన్నా లేకున్నా ఆదాయ పన్ను శాఖకు రిటర్నులను నిషేధించాలి. అన్ని సంబంధిత శాఖల మధ్య సమగ్ర సమన్వయం నెలకొల్పడానికి ఒక శాశ్వత విభాగాన్ని కార్పొరేట్ మంత్రిత్వ శాఖలో ఏర్పాటు చేయాలి. కార్పొరేట్ నిర్మాణ స్వరూపాన్ని సులభతరం చేయాలి. అనుమానిత సంస్థల ఖాతాలపై ఫోరెన్సిక్ ఆడిట్ తప్పనిసరిగా చేయించాలి.

డొల్ల కంపెనీల మెడలు వంచడానికి మొదలు ప్రభుత్వానికి చిత్తశుద్ధి ఉండాలి. ప్రధానంగా లంచాలు ఇవ్వడానికి, పార్టీ ఫండులు అందజేయ డానికే ఇలాంటి సంస్థలు ఉనికిలోకి వస్తున్నాయి కనుక ప్రభుత్వాలు డొల్ల కంపెనీల డోలు దువ్వుతాయా లేక వాటి భరతం పడతాయా అనేది కాలక్రమంలో తేలుతుంది. ఆరంభించిన చర్యల్లో కఠినత్వ మెంతుంటుందో లేదా డొల్లతనం ఎంతుంటుందో ప్రజలు గమనించాలి.

*(రచయిత అధ్యక్షుడు, పౌరహక్కుల సంఘం)* వీ

# 70 ఏళ్ల స్వాతంత్ర్య ఫలాలు ఎవరివి?

***స్వాతంత్ర్యం వచ్చి ఏడు దశాబ్దాలు దాటినా ప్రజలకు నిజమైన స్వాతంత్ర్యం లభించలేదనీ, ఇప్పటికీ మౌలిక అవసరాలు తీరకపోవడం, పేదరికం, అసమానతల మధ్య ప్రజలు జీవిస్తున్నారనీ అంటున్నారు* ఎల్. అరుణ**

'తీరని ప్రాథమిక అవసరాలు, పేదరికం, అసమానతల మధ్య ఏ ప్రజాస్వామ్యమైనా ఎక్కువ కాలం మనలేదు' – నెహ్రూ.

మనం ప్రతినిత్యం ఒక మాట వింటుంటాం. 'మనది ఘనత వహించిన ప్రజాస్వామ్యం' అనే మాట. పాలక వర్గాల అనుకూల కుహన మేధావులు అలసిపోకుండా ఈ ప్రజాస్వామ్యాన్ని పొగుడుతూనే ఉంటారు.

ఇది నిజంగా ప్రజాస్వామ్యమేనా? అని నిశితంగా పరిశీలిస్తే ఇది ధనవంతులు, పెద్ద పెద్ద కార్పొరేట్లకే ప్రజాస్వామ్యమని తేలిపోతుంది. ఒక కఠినమైన వాస్తవం ఏమిటంటే ఎవరి సేద్యంలో ఈ భూమి తడిసి దేశ నిర్మాణమైందో ఆ ప్రజల్ని దోచుకుంటూ, దోపిడీ వర్గాలు పాలక వర్గాలు అనుభవిస్తున్న స్వాతంత్ర్యం. దశాబ్దాలుగా వ్యవస్థీకృతం చేస్తూ వచ్చిన హింసను అహింసగా చలామణి చేస్తున్న స్వాతంత్ర్యం. చిన్నపాటి ప్రశ్నను ధిక్కారాన్ని, సంఘాన్ని, సమరాన్ని అసలు అడగడానికి, ఒక చోట కలుసుకోవడాన్ని కూడా సహించలేని స్వాతంత్ర్యం మనది. ఉఛ్వాస నిశ్వాసలకు పరిమితులు విధించి భయకంపితం చేసి మానవసారాన్ని నిస్సారం చేసే స్వాతంత్ర్యం మనది. అందుకే మహాశ్వేతాదేవి ఈ ప్రజాస్వామ్యాన్ని 'విధ్వంస స్వామ్యం' అన్నారు.

పాలకుల విధ్వంసక విధానాలను ప్రశ్నించే వారికి దేశంలో రక్షణ లేకుండా పోయింది. గోవుకు ఉన్న రక్షణ మనిషి బతుక్కి లేకుండా పోయింది. గోవు జాతీయత, దేశభక్తి, సంస్కృతి పేరుతో రాజకీయాలు నడుస్తున్నాయి. కులం, మతం ఓట్లు రాల్చే సాధనాలుగా మారిపోయాయి. స్వతంత్ర రాజ్యాంగ వ్యవస్థలు (ఉదాహరణకు న్యాయవ్యవస్థ) స్వతంత్రంగా పనిచేసే పరిస్థితి కోల్పోయాయి.

దేశంలో సైన్స్‌పై దాడి జరుగుతోంది. అయినా శాస్త్రవేత్తలు దీనిపై నోరు మెదపలేని స్థితి. కల్బుర్గీ, గోవింద పన్సారే, దభోల్కర్, గౌరీ లంకేశ్ లాంటి హేతువాదులు, మేధావులు, జర్నలిస్టులు హత్యకు గురైనారు. ఈ ఉదంతాలపై దర్యాప్తుల్లో పురోగతి లేకపోవడాన్ని ప్రశ్నిస్తూ దాఖలైన పిటిషన్లను విచారిస్తూ బొంబాయి హైకోర్టు ఘాటుగా స్పందిస్తూ ఇలా వ్యాఖ్యానించింది. 'ఎవరు మాట్లాడలేని, ఎవరు స్వేచ్ఛగా సంచరించలేని ఒక విషాదకర దశను దేశం చూస్తున్నదని' న్యాయ స్థానం మాట్లాడింది. అంటే పరిస్థితి ఎంత దిగజారిందో అర్థం చేసుకోవచ్చు.

దేశంలో జరుగుతున్న ఎన్‌కౌంటర్‌లు, లాకప్ డెత్‌లు, తెంపు లేకుండా మహిళలు, చిన్న పిల్లలపై జరుగుతున్న లైంగిక అత్యాచారాలు మనదేశ ప్రతిష్టతను మసకబారుస్తున్నాయి. డార్విన్ సిద్ధాంతాన్ని తప్పుపడు తున్నారు. పురాతన కాలంలోనే విమానాలు ఉన్నాయిని, ప్లాస్టిక్ సర్జరీలు జరిగాయని, మహాభారత కాలంలోనే ఇంటర్ నెట్ ఉందని మాట్లాడు తున్నారు. ఎలాంటి ఆధారాలు లేకుండా ఇష్టం వచ్చినట్లు పాలకులు మాట్లాడుతూ ఉన్నారు. అయినా ఎవరూ వ్యతిరేకించడం లేదు. శాస్త్రవేత్తలు మౌనం వహిస్తున్నారు. ఎవరైనా మాట్లాడితే వారు దేశ ద్రోహులు, ఉగ్రవాదులని ముద్ర వేస్తున్నారు. ఇలా దేశం తిరోగమిస్తూ ఉంది. ప్రశ్నించడమే నేరమైంది.

స్వాతంత్ర్యం వచ్చి 71 సంవత్సరాలు పూర్తయ్యాయి. ఇప్పటికి సమాజంలో ప్రజల కోణంలో అభివృద్ధి జరిగిందా అంటే లేదని చెప్పాలి. ఈ 70 ఏళ్లుగా మన మువ్వన్నెల జెండా రెపరెపలాడుతూ ఎగురుతూ ఉంది. చెయెత్తి జై కొడుతున్నాం. సెల్యూట్ చేస్తున్నాం. నిండుగా మనసులో గౌరవం నింపుకున్నాం. జాతీయ గీతం ఆలపిస్తున్నాం. సగర్వంగా జాతీయోద్యమం గురించి, భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురు, ఆజాద్, అల్లూరి సీతారామరాజు లాంటి త్యాగధనుల దేశభక్తి గురించి, వారి వీరోచిత పోరాటాల గురించి పిల్లలకు చెపుతున్నాం. ఎంతో సాధించామని, ఇంకెంతో సాధించాల్సినది ఉందని చెప్పుకుంటున్నాం. మిఠాయిలు పంచుకొని మువ్వన్నెల జెండాను గుండెకు హత్తుకొని సంబరపడుతున్నాం.

కాని స్వాతంత్ర్య ఫలాలు అందరికి అందలేదనే విషయం గుర్తుకొస్తే గుండె బరువెక్కుతుంది. పెరుగుతున్న ఆర్థిక అసమానతలు, దేశ సంపదంతా కొద్దిమంది దగ్గర కేంద్రీకృతం కావడం, కోట్లాది మందికి కనీసం ప్రాథమిక అవసరాలు కూడా దక్కని స్థితి. జల్, జంగల్, జమీన్, రోటీ, కపడ, మకాన్, విద్య, వైద్యం, ఉద్యోగం వంటి మౌలిక అవసరాలు ప్రజలకు దక్కలేదు. ఇది మన కళ్లముందు కనిపిస్తున్న దృశ్యం. 70 ఏళ్ల స్వాతంత్ర్య భారతం అంగీకరించాల్సిన చేదు నిజం.

రాజకీయ పార్టీలు మారుతున్నాయి. నాయకులు మారుతున్నారు. కాని ప్రజల బతుకులు మారడం లేదు. సామాన్యుడు బతుకుపోరులో నిత్యం ఓడిపోతూనే ఉన్నాడు. ఇందిరా గాంధీ కాలం నుంచి నేటి నరేంద్ర మోడీ కాలం వరకు నాటి ఇందిరా నినాదం 'గరీబ్ హఠావో' మొదలు నేటి మోడీ నినాదం 'సబ్‌కా సాథ్ సబ్‌కా వికాస్' వరకు ఆకర్షణీయ నినాదాలే తప్ప ప్రజలకు జరిగేదేమీ లేదు.

ప్రపంచంలోనే పోషకాహారం లభించని జనాభా భారతదేశంలోనే అధికంగా ఉన్నదని ఐక్యరాజ్య సమితి ఆహార, వ్యవసాయ సంస్థ తేల్చి చెప్పింది. మన జనాభాలో 14.5 శాతం జనాభాకు పోషకాహారం అందడం లేదని, 19 కోట్ల మంది ప్రతిరోజూ ఆకలితో నిద్రిస్తారని, 5 ఏళ్ల లోపు వయసున్న మన పిల్లలు 21 శాతం మంది తక్కువ బరువుతో, పోషకాహార లోపంతో అంటూ వ్యాధుల బారిన పడుతున్నారని, కొందరు

మరణిస్తున్నారని ఈ సంస్థ గణాంకాలు చెబుతున్నాయి.

ఇక రాష్ట్ర పరిస్థితి చూస్తే 0–5 సంవత్సరాల మధ్యగల 23.82 లక్షల మంది పిల్లల్లో 8.69 లక్షల మంది అంటే 36.48 శాతం పిల్లలు తగిన ఎత్తు, బరువు లేక పోషకాహార లోపంతో గిడసబారి ఉన్నారని మే నెలలో జరిగిన జిల్లా కలెక్టర్ సదస్సు పత్రాలలో పేర్కొన్నారు. మోడీ ప్రభుత్వం శివాజి విగ్రహానికి పెడుతున్న ఖర్చు రు. 3,600 కోట్లు కాగా, పిల్లల పోషకాహారం కోసం పెడుతున్న ఖర్చు రు. 126 కోట్లు. అంటే విగ్రహాలకు ఇస్తున్న ప్రాధాన్యత ఈ దేశ భావి పౌరులకు లేదన్నమాట.

దేశంలో పట్టణ పేదల బతుకులు నానాటికి దుర్భరమవుతున్నాయి. ప్రభుత్వాలు విద్య, ప్రజారోగ్యం, ఉపాధి రంగాలకు తగిన కేటాయింపులు చేయనందున సామాన్య ప్రజలకు నాణ్యమైన విద్య, వైద్యం అందడం లేదు. ప్రపంచ క్షయవ్యాధి మృతుల్లో భారతదేశ వాస్తవ చిత్రం ఆవిష్కృతమవుతుంది.

వాస్తవం ఇది కాగా, ప్రపంచంలో 7వ అతిపెద్ద ఆర్థిక వ్యవస్థగా భారతదేశం ఉందని, దేశంలో అగ్రగామి రాష్ట్రం ఆంధ్రప్రదేశ్ అని ప్రపంచ బ్యాంకు ప్రకటించడాన్ని అటు మోడీ, ఇటు చంద్రబాబు సర్కార్లు గొప్పగా చెప్పుకోవడం చూస్తుంటే 'ఇంట్లో ఈగల మోత బయట పల్లకీల మోత' సామెత చందంగా ఉంది.

నిప్పులు చిమ్ముతూ నింగికి దూసుకుపోతున్న రాకెట్లు, వాయువేగంతో పరుగులెడుతున్న బుల్లెట్ రైళ్లు, వైపై హంగులతో మిరుమిట్లు గొలుపుతున్న ఆకాశ హర్మ్యాలు ప్రధాన మంత్రి నరేంద్ర మోడీ, కేంద్ర మంత్రులు పలుకుతున్న అభివృద్ధి ప్రగల్భాలు ఉత్తర కుమార ప్రగల్భాలేనని గణాంకాలు, సర్వేలు చెబుతున్నాయి. దేశ వాస్తవ ఆర్థిక స్థితి సంక్షోభంలో ఉందని, అంతులేని అరాచకం... తిరోగమనంలో ఆర్థిక వ్యవస్థ, ఆర్థిక నేరస్తులకే 'అచ్చేదిన్' అని దేశంలో మెజారిటీ ప్రజానీకం మనోగతం కూడా ఇదేనని రిజర్వు బ్యాంకు ఇటీవల నిర్వహించిన వినియోగదారుల విశ్వాస సర్వే తేల్చి చెప్పింది.

భారతదేశంలో 69 శాతం ప్రజానీకం గ్రామీణ ప్రాంతాల్లో నివసిస్తున్నారు. 60 శాతం పైగా ప్రజలు మన ఆర్థిక వ్యవస్థకు వెన్నుముక అయిన వ్యవసాయ రంగంపై ఆధారపడి ఉన్నారు. 1991 నుంచి అమలులోకి వచ్చిన ప్రపంచీకరణ (సరళీకరణ) విధానాల వలన వ్యవసాయ రంగం క్రమేపి సంక్షోభంలోనికి నెట్టబడుతుంది. లక్షల సంఖ్యలో రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. దేశం క్రమంగా ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్‌ల కబంధ హస్తాలలోకి కూరుకు పోయింది. ఫలితంగా విదేశీ బహుళజాతి సంస్థలు, మరోవైపు దేశీయ కార్పొరేట్లు రైతును నిలువున దోచేస్తున్నారు. కౌలు దారులు, వ్యవసాయ కూలీలకు పనులు లేక పస్తులతో పొట్ట చేతపట్టుకొని సొంత ఊర్లు వదిలి పట్టణాలకు వలసపోయి అడ్డకూలీలుగా మారి అర్థాకలితో పట్టణ మురికి వాడల్లో కునారిల్లుతున్నారు.

వాస్తవం ఇలా ఉంటే పాలకులు వృద్ధి అంకెల మాయాజాలంతో గారడీలు చేస్తూ ప్రజలో భ్రమలు కల్పిస్తున్నారు. విదేశాల్లో మూలుగుతన్న నల్లధనం వెనక్కి తెచ్చి ప్రజల ఖాతాల్లో 15 లక్షల చొప్పున జమ చేస్తామని, ప్రతి ఏటా 2 కోట్ల మందికి ఉద్యోగాలు ఇస్తామని ఎన్నికలలో వాగ్దానాలు చేసి ఓట్లు దండుకున్నారు.

కాషాయ కూటమి అధికారంలోకి వచ్చాక బడా ఆర్థిక నేరగాళ్లు అయిన విజయమాల్య, నీరవ్ మోడీ వంటి నల్ల కుబేరులను దగ్గరుండి విదేశాలకు పంపారు. ఆదానీ, అంబానీల సేవల్లో మునిగి పోయారు. ఈ వైఫల్యాలను కప్పిపుచ్చు కునేందుకు నినాదాలు రాజేసి, ప్రజల దృష్టిని పక్కదారి పట్టించి పబ్బం గడుపుకునే దుష్ట సంస్కృతిని కొనసాగిస్తున్నారు.

అస్సామీయులను అక్రమ వలసదారులుగా ముద్రవేసి, హిందూ, ముస్లింల మధ్య విద్వేషాన్ని రాజేయడం ద్వారా మోడీ సర్కార్ ఈ ఆర్థిక సంక్షోభ సవాళ్లను కప్పిపుచ్చుకోవాలని చూస్తుంది. కాబట్టి ఈ విద్వేష రాజకీయ కుట్రలను ప్రజలు సమగ్రంగా అర్థం చేసుకోవాలి.

ఈ విషయాలన్ని తెరచి చూస్తే ఈ దేశ ప్రజలకు నిజమైన స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు రాలేదనేది వాస్తవం. నిజానికి భారతదేశం పేద దేశం కాదు కాని, తీరని దారిద్ర్యం అనుభవిస్తున్న పేద ప్రజల దేశం. అపారమైన వనరులు, జీవనదులు, కష్టించి పనిచేసే ప్రజలు ఉండి కూడా ఈ దేశం ఇంత వెనుకబడి ఉండడానికి ప్రధాన కారణం ప్రజలకు రావలసిన రాజకీయం, ఆర్థిక వ్యవస్థలు ఇక్కడ మొదటి నుండి లేకపోవడం ప్రధాన కారణం.

ప్రజలకు రావలసిన ప్రజా ప్రత్యామ్నాయ రాజకీయాలు ఇక్కడ అభివృద్ధి కావాలి. ప్రగతిశీలక శక్తులు, చోదకశక్తులైన రైతాంగం, కార్మిక, విద్యార్థి శక్తులను ఒక్కతాటి మీదకు తెచ్చి, ప్రజల్ని ఎడ్యుకేట్ చేసుకొని, మరో నూతన స్వాతంత్ర్య పోరాటం ద్వారా మనిషిని మనిషి దోచుకోని, వ్యక్తిగత తావులేని నవ భారత్‌ను నిర్మించుకోవాలి.

*(రచయిత సామాజిక కార్యకర్త)*

వీ

## వచ్చే సంచికలలో...

- **పెట్టుబడిదారీ ఉత్పత్తి-శ్రమదోపిడీ-మార్కెట్ సంక్షోభం - రమేష్ పట్నాయక్**
- **పాలకవర్గం అణచివేతలో స్త్రీ లోకం - డా. కత్తి పద్మారావు**
- **కేంద్రం నీరు కారుస్తున్న సమాచార హక్కు చట్టం - చిమ్మె జాన్ బర్నబాస్**
- **స్వార్థ రాజకీయ ప్రయోజనాల కోసమే బోయలను ఎస్‌టిల్లోకి చేర్చే నిర్ణయం - రామారావు దొర**

# మతోన్మాద విస్తరణ - ప్రగతివాదుల దౌర్బల్యం

*మోడీ పాలనా కాలంలో ప్రత్యేకంగా, అంతకు ముందు నుంచీ మొత్తంగా విస్తరిస్తున్న మతోన్మాదాన్ని అడ్డుకోవడంలో ప్రగతివాదుల వైఫల్యాన్ని వివరిస్తున్నారు* **బి.ఎస్.రాజు**

మన దేశంలో మత్తు పదార్థాలకు కొదవలేదు. చుట్ట, బీడీ, సిగరెట్, గుట్కా, సారా, విస్కీ బ్రాందీ, గంజాయి, మార్జువానా, ఎల్ఎస్డి ఇలా తెలిసిన, తెలియని పేర్లతో ఎన్నో మత్తు పదార్థాల బారినపడి ఈ దేశం నిషాలో జోగుతోంది. ఈ మత్తుకు ఎన్నోకొన్ని లెక్కలున్నాయి. ఈ నిషా లోతు, విస్తృతి సమాజ స్పృహలో ఉన్నవే !

ఇవికాక అసలు సమాజ స్పృహలో లేని, సమాజాన్ని పట్టిపీడిస్తున్న భయంకర మత్తు పదార్థాలు చాలానే ఉన్నాయి. ఇవి సామాజిక క్షేత్రంలో వేళ్లూనుకుని, ఊడలు దిగి, జడలువిప్పుకుని, చిలవలుపలవలుగా విస్తరించి ఉన్నాయి. వీటి విషపు గాలులు యావత్ సమాజాన్ని ఆవరించి, మానవ మేధస్సును కుంచించి, కుళ్లగొట్టి పిప్పిచేస్తున్నాయి. అసలు హేతుబద్ధ ఆలోచననే సమూలంగా హరించి వేస్తున్నాయి.

ఏమిటీ విష, మత్తుపదార్థాలు? ప్రధానంగా చెప్పుకోవాల్సినవి– ఒకటి – దైవ, మత, జాతిభావనలు. ఈ భావనల నుండి పుట్టుకొచ్చిన, ఇంకా నిరంతరం పుట్టుకొస్తున్న మూఢనమ్మకాలు, సంప్రదాయాలు, కట్టుబాట్లు. రెండు – కులవ్యవస్థ, అగ్రకుల పెత్తనం, అంటరానితనం, సామాజిక అసమానతలు. మూడు – ఆర్థిక దోపిడీ, ఆర్థిక అసమానత, పీడన, హింస, దౌర్జన్యం. నాలుగు – పురుషాధిక్యత, పురుషాహంకారం, వివక్ష, అణచివేత, లైంగిక ఉన్మాదం. ఐదు – బూటకపు ఎన్నికల రాజకీయం. ఆరు – సరుకుల ఆరాధన. ఏడు: పర్యావరణ పరిరక్షణా రాహిత్యం. ఎనిమిది – సమిష్టి జీవన రాహిత్యం.

మానవ సమాజం తన పరిణామక్రమంలో అత్యంత ఆదిమ దశ నుండి అతీత శక్తులను, దైవభావనను, దైవరూపాలను, పలు ఆధ్యాత్మిక చింతనలను, మతాలను సృష్టించుకుంటూ, పెంచి పోషించుకుంటూ వచ్చింది. అజ్ఞానపు చీకటి యుగాలు దాటుకొని విజ్ఞానపు వెలుగులో ప్రవేశించింది. అయితే, శాస్త్ర సాంకేతిక వైజ్ఞానిక వెల్లువలో ఉరకలెత్తుతున్న నేటి ఆధునిక మానవునికన్నా, వీటి వెలుగులు ప్రసరించని అంధయుగపు మానవుడే మంచి సామాజికుడు, పర్యావరణహితుడు, నీతిమంతుడు అని చెప్పాల్సిన స్థితికి ఇప్పటి మానవ సమాజం దిగజారింది.

ఇప్పుడు నడుస్తున్నది మరో అంధయుగం. ప్రపంచం ఈ అంధ యుగపు ఊబిలో కూరుకుపోయి ఉంది. భారతదేశం ఈ అంధకారానికి, అహంకారానికి పరాకాష్టగ నిలుస్తున్నది. ఈ స్థితిని ఫాసిజమని, సామ్రాజ్యవాదమని, ఎల్లలులేని పెట్టుబడి దోపిడీ విస్తరణ అని, ప్రపంచీకరణ అని నిర్వచిస్తున్నారు. ఇటువంటి నిర్వచనాలు చెప్పేవారు మార్క్సిస్టులుగానో, సోషలిస్టులుగానో, కమ్యూనిస్టులుగానో, మావోయిస్టులుగానో పిలవబడుతున్నారు. ఇంకా లౌకికవాదులు, ప్రజాస్వామ్యవాదులు, ప్రజాస్వామ్య పరిరక్షకులు, సామాజిక శాంతి స్థాపకులు, సర్వమత సమతుల్యతా వాదులు, ఇలా చాలా సామాజిక బృందాలు ఎవరి రీతిలో వారు ఈ అంధయుగ లక్షణాలను నిర్వచిస్తూ ఉంటారు.

ఇపుడు దేశంలో కొనసాగుతున్న అంధయుగాన్ని ఆర్ఎస్ఎస్ శాసిస్తోంది. అన్ని లౌకిక ప్రజాస్వామిక సామాజిక సూత్రాలను, నీతినియమాలను, నిర్వచనాలను పూర్వపక్షం చేసి యావత్ సమాజంపై సనాతన పుచ్చు పురాణ కుళ్లు కషాయాన్ని తిరగదోడి కొత్త నిర్వచనాలతో చొప్పించి విస్తృత పర్చడంలో ఆర్ఎస్ఎస్ విజయం సాధించింది.

ఈ విజయం ఎవరిపై సాధించింది? ప్రగతిశీల శక్తులమని చెప్పుకునే కమ్యూనిస్టులు, హేతువాదులు, నిరీశ్వరవాదులు, లౌకికవాదులు, శాస్త్రీయ ఆలోచనగల బుద్ధిజీవులపై ఈ విజయం సాధించింది. ఇప్పుడది తనజెండా ఎగరేసి, తన ఎజెండాను జాతి నియమాలుగా నిర్ణయించింది. ఈ నియమాలు పాటించనివారు, వాటిని ధిక్కరించేవారు దేశద్రోహులని, వారికి ఈ భూమ్మీద బతికుండే అర్హత లేదని ప్రకటించింది. ఈ నీతిని ఆచరణలో అమలుచేస్తోంది. రాముణ్ణి, దేవుణ్ణి కాదనేవాడు దేశద్రోహి. గోవును పూజించనివాడు, గోవును రక్షించనివాడు హిందుమత ద్రోహి. ఈ దేశం హిందువులది. ఇక్కడ అంతా హిందువులే. ఏ మతంపేరుతో వారిపుడు జీవిస్తున్నా, వారంతా ఒకనాటి హిందువులే! ఇతర మతాల్లోనికి బలవంతంగా మార్చబడ్డవారే! అంచేత ఈ దేశ పౌరులుగా వారంతా మనగలగాలంటే వారు తిరిగి హిందువులు కావలసిందే! లేదా దేశం వదిలి పోవాల్సిందే!

ఇటువంటి స్థితిలో 72వ పంద్రాగస్టు వచ్చింది. వస్తూనే దేశమంతా సరుకుల డిస్కౌంట్ అమ్మకాల సంరంభ దుంధుభి మోగించింది. వార్తాపత్రికల ముద్రణాయంత్రాలు అమ్మక ప్రకటనలు ముద్రించి ముద్రించి అలసిపోయాయి. మీడియా ప్రకటనల రాబడి వరదలెత్తింది. జనం క్రెడిట్ కార్డులు గీకి, గీకి సోలిపోయారు. అమెజాన్లు, ఫ్లిప్కార్టు, బిగ్ బజార్లు, రిలయన్స్ మాల్లు, ఆన్లైన్ వాణిజ్యం కన్స్యూమర్ల, కొనుగోలుదార్ల మెదళ్లలో మత్తుసూదులు గుచ్చి జేబులు మెత్తగా కత్తిరించేశాయి. వ్యాపారపు తెలివితేటల్ని, పెట్టుబడి నైపుణ్యాన్ని మేళవించి సరుకుల కొనుగోళ్లే 'గొప్ప దేశభక్తి' అనే నూతన నిర్వ చనాన్ని ప్రజల మెదళ్లలో ముద్రించాయి. 'సరుకుల ఆరాధన, భగవదారాధన కన్నా మిన్న' అనే వినియోగ సత్యాన్ని గుర్తింపచేసి ప్రజలను ఉన్నత ఆధ్యాత్మిక తలానికి ఎత్తడం ఏం! మాటలా మరి?

అలనాటి ఆదిశంకరుడు, రామానుజుడు, మహమ్మదు, జీసస్, గురుగోబింద్ వంటి ప్రవక్తలు ప్రసాదించలేని ముక్తిని ఆధునిక సరుకుల శాస్త్రులు ప్రజలకు సిద్ధింప చేశారు. రాబోయే రోజుల్లో దేశంలో మరింతగా వెల్లువెత్తే సరకుల సునామీకి ఈ 72వ పంద్రాగస్టు కచ్చితమైన సూచిక

అనొచ్చు. ఈ డబ్భై రెండేళ్ల స్వతంత్ర భారతావని సాధించిన ఘన విజయాల్లో ఇదొకటని ఈ దేశ పౌరులుగా, భరతమాత బిడ్డలుగా, మనమంతా 72 అంగుళాల ఛాతీలను సగర్వంగా ప్రదర్శించవచ్చు.

ఈ డబ్భైరెండేళ్లల్లో దేశం సాధించిన ఆర్థిక ప్రగతి మాటెట్లున్నా, దైవభక్తి, మతభక్తి అంబరాన్ని దాటి పైపైకి దూసుకుపోతున్నాయి. సరుకుల ఆరాధన, దైవారాధన ఒకదానితో ఒకటి పోటీపడుతూ ఉరకలెత్తుతున్నాయి. భద్రంగా ఇళ్లల్లో స్థిరపడి గౌరవంగా పూజలందుకుంటూ ఉండిన హిందూ దేవుళ్లు, దేవతలు బజార్లకు ఈడ్చబడి ఊరేగింపు సంత సరుకులుగా మార్చబడ్డారు. ఇళ్ల పెరళ్లలో ప్రేమనందుకున్న గోవు, ఓట్ల రాజకీయ చదరంగంలో కాషాయ హిందుత్వ గోసంరక్షక హింసా క్రీడకు బ్రాండ్ ఎంబాసిడర్గా మారిపోయింది. ఊళ్లల్లో గౌరవస్థానం పొందిన రాముడు ఓట్ల సంపాదనకు, అధికార సాధనకు వారధి అయ్యాడు. సాఫ్ట్‌వేర్, డిజిటల్, మొబైల్ టెక్నాలజీ, సోషల్ మీడియాల వెల్లువతో సమానత్వ సామాజిక విప్లవం అడుగంటి పోయింది. సామ్రాజ్యవాద పెట్టుబడి-మతం-రివిజనిజం ఉమ్మడి కుట్రలకు ప్రపంచ వ్యాప్తంగా కమ్యూనిస్టు శక్తులు కుదేలైపోయాయి. మార్క్స్ ప్రవచించిన కార్మికవర్గ విప్లవాలు వీగిపోయాయి. చివరికి, ఈ దేశంలో కమ్యూనిస్టు పార్టీలు బోనమెత్తక తప్పని స్థితికి నెట్టబడ్డారు. నెట్టబడ్డారా? లేక, దిగజారి బోనమెత్తేరా?

ఈ దేశంలో విప్లవం తీసుకొస్తామని పనిచేసిన నక్సల్బరీ పోరాట శక్తులు దైవం, మతం, రాముడు, దేవుళ్లు, గోమాత, అమ్మోర్లు, జాతర్లు, చేతబడుల మూఢనమ్మకాలు, మనుధర్మ కట్టుబాట్ల నుండి జనాన్ని ఈషణ్మాత్రం కూడా విముక్తి గావించలేకపోయారు సరికదా, తమ ప్రాబల్య ప్రాంతాలను కూడా కాపాడుకోలేని దుస్థితిలోపడి, కాషాయ సేనల పాదాక్రాంతం చేయడానికే దోహదపడ్డాయి.

ఇవ్వాళ దేశంలో ఏవో కొన్ని ఆదివాసి ప్రాంతాలకు పరిమితమై సాయుధ పోరాటం కొనసాగిస్తున్న మావోయిస్టు కమ్యూనిస్టు పార్టీ ఇదివరలో చాలా రాష్ట్రాల్లో ప్రభలంగానే ఉండేది. అప్పటి తన ప్రాబల్య ప్రాంతాలను ఇప్పుడు గమనిస్తే, అక్కడెక్కడా వారు సంచరించిన జాడలు, ఉద్యమస్ఫూర్తి, ప్రజల జీవన విధానంపై వారి ప్రభావం పెద్దగా కనిపించదు. దైవ-మత సంబంధిత విషయాల్లోగాని, కట్టుబాట్లు, ఆచార వ్యవహారాల్లోగాని, మనుధర్మ వ్యవస్థ పట్టులో గాని, వారు సంచరించని ఇతర ప్రాంతాలతో పోల్చుకుని చూస్తే పెద్దగా వ్యత్యాసమేమీ కనపడదు.

అక్కడక్కడా భూసంబంధాల్లో ఒకింత మార్పు జరిగిందనే చెప్పాలి గాని, మొత్తానికి అర్ధ శతాబ్దపు ఉద్యమ ప్రస్థానంలో వారు దేశం మొత్తంలో తీసుకొచ్చిన సామాజిక సాంస్కృతిక మార్పు అంతంత మాత్రమే! ఈ విషయంలో ఇతర కమ్యూనిస్టుల సరసనే వీరూ నిలబడి ఉండడం మనకు అగుపించే ఓ యదార్థ దృశ్యం.

కపట-కుహనా హిందుత్వ దుర్నీతిని, అభాండ చరిత్ర వక్రీకరణను ఎండగడుతున్న ఆర్యసామాజికుడైన స్వామి అగ్నివేశ్ పాటి ధైర్య సాహసాలు, నిజాయితీ కూడా కమ్యూనిస్టు పార్టీలకు కరువయ్యా యంటే వీరి స్థితిని ఏమని అర్థం చేసుకోవాలి? మన సమాజాన్ని హేతు రహిత భావజాలం, సమాజ ఆలోచనా ఆకాశాన్ని వక్రీకరణ కారుమేఘాలతో కాషాయమూకలు కమ్ముకు రావడానికి కారణం, ప్రజారాసుల్లో కమ్యూనిస్టుల సాంస్కృతిక విద్యా, విజ్ఞాన ప్రచార అలసత్వం, బలహీనత, దౌర్బల్యం కారణం కాదా?

హేతువాదుల, రేషనిస్టుల తలలు తెగిపడుతుంటే, అగ్నివేశ్ వంటి వారిని నడిబజారులో ఈడ్చిఈడ్చి తన్నితే కమ్యూనిస్టుల, దళిత శక్తుల, హేతువాదుల కార్యక్రమం ఏమైనట్లు? వాళ్ల ఐక్యత ఎటుపోయినట్లు? దెబ్బకు దెబ్బతీయాల్సిన సమయంలో వీరంతా చేష్టలుడిగి కాషాయ మూకల ఆగడాలకు తలొగ్గి తోకలు ముడిచినట్లేనా?

నిత్యం ఆదివాసులను చంపుతూ వారి శవాలను గుట్టలుగా పోస్తూ, దేశ వనరులను కొల్లగొట్టే దమనకాండను, దోపిడీని, విస్తృత సమాజం ఎదిరించే తీరిదేనా? అనునిత్యం దళితులు, మైనారిటీలు, మహిళలు ఎదుర్కొంటున్న హింస, అత్యాచారాలు, లైంగిక దాడులను అడ్డుకునే తీరిదేనా? ప్రగతిశీల శక్తుల దౌర్బల్యమే కాషాయశక్తుల విజృంభణకు కారణం కాదా?

కాషాయమూకల ఫాసిస్టు దమనకాండను, ప్రమాదకర తిరోగమన దూకుడును బహుముఖంగా ఎదుర్కొని ఓడించడమే దేశంలో ప్రగతిశీల శక్తులన్నిటి ప్రథమ కర్తవ్యమని, ఉమ్మడి లక్ష్యమని గుర్తించ నిరాకరిస్తే ప్రగతిశీల శక్తుల ఓటమి, కాషాయ విజయం ఖాయం.

ఈ కర్తవ్యాన్ని కేవలం పార్లమెంటరీ ఓట్ల రాజకీయానికే కుదించి వేయడం అత్యంత ప్రమాదకరమని కూడా ఈ శక్తులన్నీ గ్రహించాలి. కాషాయీకరణకు వ్యతిరేకంగా దేశవ్యాప్త ఉద్యమం, విస్తృత ప్రచారం పలు రూపాల్లో చేపట్టవలసిన అగత్యం అనునిత్యం ప్రగతిశీల శక్తుల తలుపులు తడుతుంటే, ఈ శక్తులు మందకోడిగా, స్తబ్దుగా ఊడిపోవడం విచారకరం. కాషాయీకరణకు వ్యతిరేకంగా విస్తృత ప్రచారం, దేశవ్యాప్త ఉద్యమం పెద్ద ఎత్తున చేపట్టడం ద్వారానే ప్రగతిశీల శక్తుల పునరేకీకరణ జరిగి హిందుత్వ శక్తులను నిలువరించడం సాధ్యమవుతుంది.

ఆగస్టు 10న, ఆంధ్రజ్యోతి దినపత్రికలో 'జై లవకుశ' అనే శీర్షికతో ఓ కథనం అచ్చయ్యింది. ఇంజనీరింగ్ విద్యనభ్యసించి, మంచి ఉద్యోగాలు సంపాదించుకుని, రామనామ జపాన్ని, సంకీర్తనలను, వేదవిజ్ఞాన వ్యాప్తిని జీవిత ధ్యేయంగా ఎంచుకుని, ప్రచారం చేస్తున్న ఇద్దరి అన్నదమ్ముల వైనమే ఈ కథనం. 20వ పడిలోనే ఉద్యోగాలను త్యజించి, ఈ మహోత్కృష్ట కార్యాన్ని స్వీకరించడం తమకెంతో ఆత్మసంతృప్తినిస్తున్నదని ఆ లవకుశులు చెబుతున్నారు. కొంచెం లోతుగా ఆలోచిస్తేగాని వీరెన్నుకున్న భగవత్కార్యం వెనుక ఉన్న చోదకశక్తి గోచరించదు. వీళ్లు చదువుకున్నది కేశవ మెమోరియల్ విద్యా సంస్థల్లో. ఆ సంస్థ నడిపించే ఇంజనీరింగ్ కాలేజీలో. ఇటువంటి రామనామ జప సంకీర్తనల ప్రచారం వెనుక బయటకు తెలియని ఆర్ఎస్ఎస్ హిందుత్వ భావవ్యాప్తి పథసైనిక నిర్మాణం, పటిష్ఠ వ్యూహం పనిచేస్తూ ఉంటాయి.

రామాయణ కావ్యంలో వేయితలల రావణాసురుని కల్పన రామరాజ్య విస్తరణలో భాగమైతే, ఇప్పటి ఆర్ఎస్ఎస్ నిజరూపం వేయితలల బ్రాహ్మణ్య మనుధర్మం. మనకు కనిపించేది ఆర్ఎస్ఎస్ ఒకే ముఖం, ఒకే శిరస్సు. మనకు కనిపించని, వెయ్యి ముఖాలు, మెదళ్లు బ్రాహ్మణ్య మనువాద భావజాలాన్ని సమాజం నరనరాల్లో చొప్పించే నీతిని ఇవి రచిస్తూ నిర్వహిస్తూ ఉంటాయి. డా. రామ పునియానీ, డా. గౌహర్ రజా వంటి వైజ్ఞానికులు, సామాజిక హితులు ఆర్.ఎస్.ఎస్ లోగుట్టును, బూటక కుహనా జాతీయతను శాస్త్రీయంగా బహిర్గత పరుస్తూ, ఎండగడుతూ ప్రజల్లో ప్రచారం చేస్తున్నారు.

స్వామీ అగ్నివేశ్ కాషాయ వస్త్రాలు ధరించి ఆర్ఎస్ఎస్, మోడీల హిందుత్వను ఎండగట్టడంలో ప్రమాదాన్ని గుర్తించడంవల్లే కాషాయ మూకలు ఆయన మీద దాడిచేశారు. ఇటువంటి కాషాయ వ్యతిరేక ప్రచార, ప్రతిఘటనాత్మక శక్తులను తుదముట్టించడానికి ప్రత్యేక

విభాగాలను స్థాపించి, హంతక ముఠాలకు తర్ఫీదు ఇచ్చి ప్రణాళికా బద్ధంగా హిట్ లిస్టులు తయారు చేసుకుని హిందుత్వ వ్యతిరేక శక్తులను ఏరిపారేసే కార్యక్రమం తెరవెనక నుండి నడిపిస్తున్నది ఆర్ఎస్ఎస్.

ఈ చాణక్యమంతా బయటపడుతూనే ఉన్నా అధికార పగ్గాలు గుప్పిట పట్టారు. కాబట్టి వాళ్ల హంతక ముఠాలకు, అత్యాచార మానవ మృగాలకు శిక్షలు పడవు. వాళ్లు సర్వ విధాలా కాపాడబడతారు. కమ్యూనిస్టులన్నా, హేతువాదులన్నా, రేషనలిస్టులన్నా, ఆఖరికి సంస్కరణవాదులన్నా ఆర్ఎస్ఎస్‌కు బద్ధ శత్రుత్వం ఎందుకంటే వీళ్లంతా ప్రశ్నలు లేవనెత్తుతారు. కాబట్టి మనుధర్మాన్ని, సనాతన విధానాలను, పుక్కిట పురాణాలను ప్రశ్నించడం వారి దృష్టిలో అత్యంత పెద్దనేరం. కాబట్టి ప్రశ్నించేవారు బతికి ఉండరాదు. అందుకే వారి నిర్మూలనా వ్యూహాలు.

ఇక్కడ ప్రధానంగా హిందుత్వ శక్తుల ఎజెండాపై మాట్లాడుతున్నా, అన్ని మతాల మూలం, సారం, బుద్ధి ఒక్కటే! 'మతాచార్యుడి మొహం మీదనే ఓ మహానుభావా! నీవేమీ తప్పులకు అతీతుడవు కాదు, దోషరహితుడవు కావు అని చెప్పగలిగిన ధీశాలులకు, ధిక్కార స్వరాలకు ఈ ప్రపంచం ఎంతో రుణపడి ఉంది. ప్రతి అభ్యుదయ సమాజం ఈ ధిక్కార స్వరాలకు ఇవ్వాల్సిన గౌరవం గురించి నాకు చింత లేదు. నేను, హిందువులచే తాము ఈ దేశపు రోగగ్రస్థులమని, జబ్బు మనుషులమని, వారి జబ్బు దేశంలో ఇతర పౌరుల ఆరోగ్య ఆహ్లాద జీవనానికి ప్రమాదకరంగా మారిందని గ్రహింపచేస్తే అదే నాకు పెద్ద సంతృప్తి' అని డాక్టర్. బాబాసాహెబ్ అంబేడ్కర్, తన 'కుల నిర్మూలన' గ్రంథానికి, 1937 ముద్రణకు రాసిన ముందుమాట ముగింపు వాక్యాలు ఇక్కడ గుర్తుచేసు కోవాలి.

'మతం అణచివేయబడుతున్న జీవి నిట్టూర్పు, హృదయంలేని ప్రపంచం యొక్క హృదయం, పశుప్రాయమైన పరిస్థితుల ఆత్మ. మతం ప్రజలకు మత్తుమందు' అన్న కార్ల్ మార్క్స్ మహనీయుని మాటలు అభివృద్ధి కాముకులకు చిరపరిచితమే! మతం మత్తుమందని మార్క్స్ మెత్తగా, సౌమ్యంగా అన్నాడుగాని, నిజానికి అది కేన్సర్ కన్నా భయంకరమైన జబ్బని, మానవ హరితను హరించివేసే చీడ–పీడని ఇప్పుడు మనదేశ ప్రజల నిత్యానుభవంలోనికి వచ్చినా, తరతరాల మత్తు దించుకోవడానికి జరపాల్సిన కృషి మిగిలే ఉంది.

ఈ సందర్భంగా, వీక్షణం మాసపత్రిక సెప్టెంబర్ సంచిక సంపాదకీయ వ్యాసంలోని ముగింపు పంక్తులను; ఇదే సంచికలో 'బస్తర్‌లో భూ సంబంధాలు–4' అనే వ్యాసంలోని ఆఖరి పలుకులను ఇక్కడ ఉటంకించి, ఈ వ్యాసం ముగిస్తాను.

"ఈ అబద్ధాల, అహంకారాల, దౌర్జన్యాల, హంతక భావజాలాల వ్యాప్తిని ప్రభావాన్ని, అధికారాన్ని శక్తివంతంగా ఎలా ప్రతిఘటించగల మనేదే ఇవాళ్టి సవాల్. ఈ సవాలును ప్రగతిశీల శక్తులు సక్రమంగా స్వీకరించలేకపోతే హిట్లర్ నాటి జర్మనీ భారతదేశంలో పునరావృత మవుతుంది.

హిట్లర్ పునరాగమనం భారత సమాజంలో ఇప్పటికే ప్రారంభమైంది. దాన్ని మధ్యదారిలో అడ్డుకోగలమా, జర్మన్ ప్రజలు (నిజానికి యావత్ ప్రపంచ ప్రజలు అనాలి!) అనుభవించిన దారుణ మారణకాండలను, బీభత్సాన్ని పునర్జీవిస్తామా అనేది ఇవాళ ఎవరికీ వాళ్లం జవాబు చెప్పుకోవాల్సిన ప్రశ్న".

"బస్తర్‌లోని ఆదివాసి ప్రజానీకం ఒకవైపు ప్రకృతి నియమాలను అర్థం చేసుకుని దాని నుండి తమ అవసరాలనెన్నింటినో తీర్చుకుంటు న్నప్పటికీ, జనతన సర్కార్ల నేతృత్వంలో ఉత్పత్తి అనే సామూహిక భౌతిక కార్యాచరణలో శాస్త్రీయ దృక్పథం కొరవడిన కారణంగా సంకుచితత్వానికి లోనవుతూ అజ్ఞానంతో, భయంతో మూఢనమ్మకాల నుండి, అంధ విశ్వాసాల నుండి, తెగ కట్టుబాట్ల నుండి బయటపడలేక పోతున్నారు. గత మూడు దశాబ్దాలకు పైగా భూమి, భుక్తి, విముక్తి కోసం; జల్, జంగిల్, జమీన్‌పై సర్వాధికారాలు మావేనంటూ ఉద్యమిస్తున్న నూతన శక్తులు కాలం చెల్లిన తెగ కట్టుబాట్లను తెంచకుండా, వాటిని సంస్కరించ కుండా, తమ ఉనికికే ప్రమాదంగా తయారైన కార్పొరేట్ ఉగ్రవాదాన్ని ఎదిరిస్తూ స్వయం ప్రతిపత్తి దిశగా సాగే సామ్రాజ్యవాద, భూస్వామ్య వ్యతిరేక నూతన ప్రజాస్వామిక విప్లవంలో పురోగతిని సాధించలేరు".

ఈ వాక్యాలు ఆదివాసి పోరాటాలకు, సమాజాలకు ఎంతగా వర్తిస్తాయో, అంతకన్నా మిన్నగా ఈ దేశపు సమస్త ప్రజలకు వర్తిస్తాయి. మతాలు, అంతర్జాతీయ పెట్టుబడి, సామ్రాజ్యవాదం ఎత్తే సరికొత్త ఎత్తుగడలకు ధీటుగా యావత్ భారతదేశంలో ప్రగతిశీల శక్తులన్నీ సామ్రాజ్యవాదపు ఆయువుపట్లన్నిటిపై బహుముఖంగా పోరాటం సలపకపోతే మానవాళికి మిగిలేది పెను తిరోగమన విషాదమే!

*(రచయిత శ్రామిక నేస్తం సంపాదకులు)*

వీ

*తెలుగు సాహిత్యంలోని ముఖ్యమైన కాల్పనిక, ఇతర రచనలను ఇంగ్లిష్ ప్రపంచానికి పరిచయం చేయాలని హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ఆశిస్తున్నది. తెలుగు నుంచి ఇంగ్లిష్ లోకి సమర్థంగా అనువాదం చేయగల అనువాదకుల కోసం ఎదురు చూస్తున్నది. అదే సమయంలో ఇంగ్లిష్ నుంచి తెలుగులోకి అనువాదం చేసే వారి అవసరం హైదరాబాద్ బుక్ ట్రస్ట్‌కు ఎప్పుడూ ఉంటుంది. తెలుగు సాహిత్యపు ఇంగ్లిష్ అనువాదాలను ప్రచురించే ప్రచురణకర్తల కోసం మా అన్వేషణలో గతంలో కొన్ని ఫలించాయి. వై. సత్యనారాయణ పుస్తకం 'మై ఫాదర్ బాలయ్య', కొండపల్లి కోటేశ్వరమ్మ 'నిర్జన వారధి'కి అనువాదం 'షార్ప్ నైఫ్ ఆఫ్ మెమరీ' ప్రచురితమయ్యాయి. త్వరలోనే పి. సత్యవతి కథా సంపుటం 'హియర్ అయామ్', బి. అనురాధ 'జైలు కథల' సంపుటం ఇంగ్లిష్‌లో వెలువడనున్నాయి. ప్రస్తుతం బి. విజయభారతి రాసిన వ్యాసాలు, పురాణాలపై మరోచూపు ఇంగ్లిష్‌లోకి అనువదించే ప్రయత్నం జరుగుతున్నది. ఈ ప్రయత్నాలన్నిటిలోనూ మీ సహకారాన్ని ఆశిస్తున్నాం.*

*ఆసక్తి ఉన్నవారు hyderabadbooktrust@gmail.com లేదా gitaramaswamy@yahoo.com* కు రాయవచ్చు

**– గీతా రామస్వామి**
**హైదరాబాద్ బుక్ ట్రస్ట్**

# పాలస్తీనా దురాక్రమణకే యూదు రాజ్యచట్టం

*సామ్రాజ్యవాద అమెరికా అండతో సాగుతున్న ఇజ్రాయిల్ దురాక్రమణ చర్యలను వ్యతిరేకిస్తూ, పాలస్తీనా న్యాయమైన పోరాటానికి అండగా నిలవకపోతే మరో ప్రపంచ యుద్ధం వచ్చే అవకాశం ఉందని హెచ్చరిస్తున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

రెండో ప్రపంచ యుద్ధకాలంలోని మారణకాండ వల్ల యూదులపై సానుభూతి ఏర్పడింది. నవంబర్ 29, 1947న ఐక్యరాజ్యసమితి తీర్మానం 181 ననుసరించి పాలస్తీనా భూభాగాన్ని పాలస్తీనా, ఇజ్రాయిల్‌గా విభజిస్తూ తీర్మానించింది. జెరూసలెం మాత్రం అంతర్జాతీయ స్వయం ప్రతిపత్తిగల నగరంగా ఉంటుంది. ఐరాస తీర్మానాన్ని అరబ్బులు తిరస్కరించారు. అరబ్బులు ఇజ్రాయిల్‌పై దాడికి దిగి ఓడిపోయారు.

1948లో యూదులు ఆటోమన్ రాజ్యంలోని కొంత భాగంలో ఇజ్రాయిల్ పేరిట స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నారు. దీన్ని ఆసరాగా చేసుకొని పశ్చిమాసియాలో బ్రిటన్, అమెరికా సామ్రాజ్యవాదులు పాలస్తీనా భూభాగంలో 1948 మే 18న యూదు రాజ్యాన్ని సృష్టించి రావణకాష్టం రగిల్చారు. పాలస్తీనాలోకి యూదులను పథకం ప్రకారం తరలించడానికి బ్రిటన్, అమెరికాలు ప్రోత్సహించాయి. చివరకు అరబ్బుల జనాభా తగ్గి ప్రపంచ పటంలో పాలస్తీనా పటం స్థానే ఇజ్రాయిల్ అవతరించింది.

1948కి ముందే ఒక పథకం ప్రకారం ప్రపంచంలోని వివిధ ప్రాంతాల నుంచి తరలించిన యూదులు, సామ్రాజ్యవాద దేశాల ఆయుధాలు, అండదండలతో ఇజ్రాయిలీ సాయుధమూకలు పాలస్తీనా ప్రాంతాలను ఆక్రమించుకున్నాయి. వ్యతిరేకించిన లక్షలాది మంది అరబ్బులను వారి నివాస ప్రాంతాల నుంచి తరిమివేశాయి. పాలస్తీనా ప్రభుత్వాన్ని, పాలనను అస్థిరపరిచి మొత్తం ప్రాంతాన్ని ఒక నిర్బంధ శిబిరంగా మార్చివేసింది. అప్పటి నుంచి పాలస్తీనా ప్రాంతాలను ఒక్కొక్కటిగా ఆక్రమించుకుంటూ జనాభారీత్యా వాటి రూపురేఖలనే మార్చి వేసి అవి కూడా యూదు ప్రాంతాలేనంటూ వాటిని కూడా తమకు అప్పగించాల్సిందే అని చెబుతోంది. తమ పౌరులకు రక్షణ పేరుతో ఆక్రమిత ప్రాంతాలలో యూదుల శాశ్వత నివాసాలను ఏర్పాటు చేసింది.

అరబ్బులు, ఇజ్రాయిల్‌కు మధ్య 1949లో జరిగిన యుద్ధంలో జెరూసలెంలోని పశ్చిమ ప్రాంతాన్ని ఇజ్రాయిల్ ఆక్రమించుకొంది. తూర్పు ప్రాంతాన్ని జోర్డాన్ వశపర్చుకుంది. అప్పటి నుంచి పాలస్తీనా కుంపటి రగులుతూనే ఉన్నది. జెరూసలేంను స్వతంత్ర అంతర్జాతీయ నగరంగా ఉంటుందని ఐరాస ప్రకటించింది. అయినా 1950లో ఇజ్రాయిల్ జెరూసలేం పశ్చిమ భాగాన్ని రాజధానిగా ప్రకటించుకుంది. అయితే ఐక్యరాజ్య సమితి, పాశ్చాత్య దేశాల ఒత్తిడితో ఇజ్రాయిల్ తొలుత జెరూసలెం పై ప్రత్యేక దృష్టి పెట్టలేదు. ఇక్కడ పవిత్ర స్థలాలపై ఎవరికీ నియంత్రణ లేకపోవడమే తమకు కలిసి వస్తుందని భావించి ప్రత్యామ్నాయ రాజధానిపై దృష్టి నిలిపింది. చాలా దేశాలు టెల్ అవీవ్‌లో రాయబార కార్యాలయాలను ఏర్పాటు చేసుకున్నాయి.

జెరూసలేంపై పట్టుకోసం 1967లో యుద్ధం జరగగా, ఇజ్రాయిల్ మరోసారి అరబ్ సైన్యాన్ని ఓడించింది. గాజా స్ట్రిప్‌ను, ఈజిప్ట్ నుంచి సినాయ్ ద్వీపకల్పాన్ని, జోర్డాన్ నుంచి వెస్ట్‌బ్యాంకును, తూర్పు జెరూసలేంతోపాటు సిరియా నుంచి గోలన్ హైట్స్‌ను స్వాధీనం చేసుకుంది. తర్వాత చారిత్రక ప్రాధాన్యత రీత్యా జెరూసలేం వైపు మొగ్గి 1980లో ఆ నగరాన్ని తమ రాజధానిగా ప్రకటిస్తూ చట్టం చేసుకుంది. ట్రంప్ పశ్చిమాసియా విధానం పాత సమస్యలను పరిష్కరించకపోగా కొత్త సంక్షోభాలను సృష్టిస్తోంది. ఇజ్రాయిల్‌లోని యూదు అతివాదవర్గాన్ని రెచ్చగొట్టి సంక్షోభాన్ని ఎగదోయడం కూడా ట్రంప్ నిర్వాకమే. సౌదీ అరేబియాలో రాజకీయ కల్లోలం, లెబనాన్‌లో ఉద్రిక్తతలు, యెమెన్‌లో ఘర్షణలు, సౌదీ కూటమికి, ఖతార్‌కు మధ్య వైషమ్యాలు, వీటన్నింటి వెనుక అమెరికానే ఉంది.

గాజా నది పశ్చిమ గట్టు, తూర్పు జెరూసలెం, సిరియా నుంచి ఆక్రమించుకున్న గోలన్ గుట్టలలో గత ఐదు దశాబ్దాలలో యూదుల నివాసాలను లక్షా 60 వేల నుంచి ఆరు లక్షలకు పెంచింది. గాజా ప్రాంతం నుంచి ఇజ్రాయిల్ సైన్యాన్ని ఉపసంహరించి పాలస్తీనా స్వయంపాలిత ప్రభుత్వానికి నామమాత్రంగా అప్పగించినప్పటికీ దాన్నొక బహిరంగ జైలుగా మార్చివేసింది. దాన్నుంచి బయటకు పోవాలన్నా, ఎవరైనా లోపలికి రావాలన్నా ఇజ్రాయిల్ అనుమతి తీసుకోవాల్సిందే. పాలస్తీనా విముక్తి ఉద్యమంలో గాజాకు ఒక ప్రత్యేకత ఉంది. అన్ని రకాల ఉద్యమాలు, పిఎల్ఓ అధినేత యాసర్ అరాఫత్ ఇక్కడ పుట్టిన వ్యక్తే. తిరుగుబాటు, అన్యాయాన్ని ప్రతిఘటించటం ఆ గడ్డలోనే ఉంది. తాజా పరిస్థితికి వస్తే అనేక పార్టీలు, సంస్థలు వాటి అనుబంధాలకు అతీతంగా ఒక ప్రజా ఉద్యమంగా గత మే 18 నుంచి జెరూసలేం పాలస్తీనియన్లదే అని ఎలుగెత్తి చాటుతూ ప్రదర్శనలు చేస్తున్నారు.

భారీగా చమురు నిల్వలున్న ధనిక దేశం సౌదీ అరేబియా సహా అనేక అరబ్ దేశాలతో అమెరికాకు సత్సంబంధాలున్నా, పాలస్తీనా వివాదంలో ఇజ్రాయిల్‌కే మద్దతుగా నిలవడానికి పలు కారణాలున్నాయి. అమెరికా ప్రజల్లో ఈ యూదు రాజ్యమంటే సానుభూతి ఎక్కువ. ఇజ్రాయిల్‌లో కన్నా అమెరికాలోనే యూదు జనాభా ఎక్కువ. అక్కడి యూదు లాబీ పలుకుబడి ప్రభుత్వ విభాగాలన్నింటికీ విస్తరించింది. మరోవైపు పూర్వపు సోవియట్ యూనియన్‌తో కొనసాగిన ప్రచ్ఛన్న యుద్ధం పరిణామాలు కూడా అమెరికా ఇజ్రాయిల్ వైపు మొగ్గేలా చేశాయి. భౌగోళిక రాజకీయాల్లో భాగంగా పశ్చిమాసియాలో సోవియట్ యూనియన్ ప్రభావానికి అడ్డుకట్ట వేయడానికి ఇజ్రాయిల్‌ను సాధనంగా వాడుకోవాలన్న అమెరికా నిర్ణయం యూదు రాజ్యానికి కలిసొచ్చింది. 1973లో పొరుగు అరబ్ రాజ్యాలు చేసిన మెరుపుదాడి నుంచి ఇజ్రాయిల్‌ను కాపాడడంలో అమెరికా కీలక పాత్ర పోషించింది. అప్పటి నుంచి అమెరికా–ఇజ్రాయిల్ బంధం బలపడింది.

ఈ నేపథ్యంలోనే ఇజ్రాయిల్ పార్లమెంటు (నెస్సెట్) ప్రతిపక్షాల

నిరసనల మధ్య అత్యంత ప్రమాదకరమైన జాతి రాజ్య ('నేషనల్-స్టేట్') చట్టాన్ని జూలై 19న ఆమోదించింది. జాతిరాజ్యం అంటే నిర్దిష్టంగా చెప్పాలంటే, ఒక విభిన్న సంస్కృతి లేదా నిర్దిష్ట జాతి/భాషకు సంబంధించిన ప్రజా సమూహం ఒక ప్రాంతంలో తమదైన రాజ్యాన్ని, రాజ్యాంగాన్ని ఏర్పరచుకోవడమని అర్థం. ఈ చట్టంతో యూదు జాతీయులకే ఇజ్రాయిల్ దేశంలో సర్వహక్కులు సంక్రమిస్తున్నాయి. ఇతర జాతీయులు, మతస్తులు రెండవ శ్రేణి పౌరుల హోదాకు దిగజారుతారు. యూదుయేతర జాతి నిర్మూలనకు ఇది ప్రాతిపదిక కల్పించడమే కాకుండా ప్రాథమికమైన సమానత్వ హక్కును బాహాటంగా కాలరాస్తుంది. మానవ హక్కులను, మైనారిటీల హక్కులకు సంబంధించిన అంతర్జాతీయ చట్టాలను, న్యాయ నియమాలను తుంగలో తొక్కింది. ఇంతవరకు ఇజ్రాయిల్ చేసిన చట్టాల్లోకెల్లా ఇది అత్యంత అమానుషమైనది.

యూదురాజ్య ప్రతిపాదన 2014 ప్రాంతంలోనే వెలుగు చూసింది. తాజాగా ఇప్పుడు కార్యరూపం దాల్చింది. అతి కష్టం మీద బిల్లు పార్లమెంట్ ఆమోదం పొందింది. మొత్తం 120 మంది సభ్యులు గల సభలో 62-55 బొటాబొటి మెజార్టీతో అది ఆమోదం పొందడం గమనార్హం. నెతన్యాహూ సంకీర్ణ ప్రభుత్వంలోని పార్టీల మధ్య ఈ చట్టం పట్ల ఏకాభిప్రాయం లేదు. అసలు నెతన్యాహూ సొంత పార్టీలోనే విభేదాలు ఉన్నాయి. ప్రధాన ప్రతిపక్షమైన లేబర్ పార్టీ వ్యతిరేకించింది. విపక్ష నాయకుడు హెర్జోగ్, అరబ్ పార్టీకి చెందిన నాయకుడు ఒడెష్ తమ నిరసన వ్యక్తం చేశారు. ఇది అరబ్బుల పట్ల వివక్ష చూపడమేనని, దీనివల్ల వారు ద్వితీయశ్రేణి పౌరులుగా మిగిలిపోతారని అంటూ ఒడెష్ బిల్లు ప్రతులను సభలో చించివేశారు.

ఈ చట్టం పశ్చిమాసియా సంక్షోభాన్ని మరింత సంక్లిష్టంగా మార్చే ప్రమాదం ఉంది. యూదుయేతర జాతి నిర్మూలనకిది బాటలు పరుస్తుంది. దీని ప్రకారం హిబ్రూ మాత్రమే అధికార భాష. అరబిక్ భాష అధికార హోదాను కోల్పోతుంది. యూదు రాజ్యంలో యూదులే ప్రథమ పౌరులు, యూదేతరులందరూ ద్వితీయశ్రేణి పౌరులుగా చూపించే వివక్షపూరిత చట్టం ఇది. ప్రాథమిక సమానత్వ హక్కును బాహాటంగా కాలరాయడమే. దీంతో పాలస్తీనియన్లు తమ మాతృభూమిని కోల్పోవలసి వస్తుందనే చేదు నిజాన్ని జీర్ణించుకోవడం కష్టం. ఇప్పటికే ఇజ్రాయిల్‌లో నివసిస్తున్న అరబ్బులు అనేక కష్టనష్టాలు ఎదుర్కొంటున్నారు. విద్య, వైద్యం, నివాసం, ఉద్యోగంలో వివక్షకు గురవుతున్న పాలస్తీనియన్లు మరింత దయనీయ స్థితిలోకి నెట్టివేయబడుతారు. ఇప్పుడు వారి పరిస్థితి పెనం మీద నుంచి పొయ్యిలో పడినట్లవుతుంది.

ఇజ్రాయిల్ జనాభా 88 లక్షలు కాగా, వీరిలో 74.7 శాతం యూదులు, 17.7 శాతం అరబ్‌లు, 2 శాతం క్రైస్తవులు, మిగతా ఇతర జాతులు ఉన్నాయి. 20శాతానికి పైగా ఉన్న యూదుయేతరులను ముఖ్యంగా పాలస్తీనియన్లను లక్ష్యంగా చేసుకొని సాగుతున్న దాడులు మరింత ముమ్మరమయ్యే ప్రమాదం ఉంది. జెరూసలెం నగరం పూర్తిగా ఇజ్రాయిల్ రాజధాని అని ఈ చట్టం స్పష్టం చేస్తున్నది. యూదుల నివాసాలను వృద్ధి చేయడం జాతీయ విలువగా ఈ కొత్త చట్టం పేర్కొంటున్నది. అర్ధ శతాబ్ద కాలంలో అక్రమంగా ఆక్రమించిన పాలస్తీనా భూభాగాల గురించి ఎవరూ ప్రశ్నించకూడదని కూడా ఈ చట్టం పేర్కొంది. ఈ ఆక్రమిత ప్రాంతాల్లోకి యూదులను తరలించి నివాసాలు ఏర్పాటు చేయవచ్చు. దీనిపై అరబ్బులు హైకోర్టును ఆశ్రయించడానికి వీలుండదు. తమపై దాడులు చేసినా సరే, ఇజ్రాయిల్ సైనికులపై ఫిర్యాదు చేసే అవకాశం కూడా ఉండదు. ఇప్పటికే విద్య, వైద్యం, నివాసం, ఉద్యోగాల్లో వివక్షతకు గురవుతున్న పాలస్తీనియన్లు మరింత దయనీయ స్థితిలోకి నెట్టబడేందుకు దారితీస్తుంది. సొంత గడ్డపైనే పాలస్తీనియన్లు రెండో తరగతి పౌరులుగా బతకాల్సి రావడం దారుణం.

దేశ అధ్యక్షుడు రెవెన్ రివ్లిన్, అటార్నీ జనరల్ సైతం అభ్యంతరం వ్యక్తం చేశారు. దీనివల్ల అంతర్జాతీయంగా దేశ ప్రతిష్ఠ దెబ్బతింటుందని, ప్రత్యర్థులకు ఆయుధంగా మారుతుందని లికుడ్ పార్టీకే చెందిన అధ్యక్షుడు రివ్లిన్ అన్నారు. న్యాయ సమీక్షకు ఇది నిలబడదన్నది అటార్నీ జనరల్ అభిప్రాయం. ప్రస్తుతం నెతన్యాహూ ప్రాతినిధ్యం వహిస్తున్న లికుడ్ పార్టీ వ్యవస్థాపకుడు, మాజీ ప్రధాని మెనాచెమ్ బెగిన్ కుమారుడు బెన్నీ బెగిన్ దీనిని వ్యతిరేకిస్తున్నారు. ఇజ్రాయిల్ ప్రభుత్వ నిర్ణయం జాతి, మతవిచక్షణను చాటుతుందని అరబ్ దేశాలు, ఐరోపా సంఘం ఆందోళన వ్యక్తం చేశాయి. యూదులు, అరబ్బుల మధ్య సారూప్యతలు లేవు. ఆచార వ్యవహారాలు, సంస్కృతీ సంప్రదాయాలు, భాష తదితర వ్యవహారాల్లో స్పష్టమైన తేడాలున్నాయి. అరబ్బులది ప్రత్యేక అస్తిత్వం.

పార్లమెంట్‌లో చర్చ సందర్భంగా నెతన్యాహు చేసిన ప్రసంగం యూదులను రెచ్చగొట్టేలా ఉంది. 'ఇది యూదుల దేశం. ఇది మన భాష, ఇది మన జెండా, ఇది మన జాతీయగీతం. మనలను అస్థిర పరచేందుకు కొందరు ప్రయత్నిస్తున్నారు. అందుకే ఈ నిర్ణయం తీసుకున్నాం. ఇజ్రాయిల్ వర్ధిల్లాలి' అన్న ఆయన ఉద్వేగపూరిత మాటల్లో దేశం మీద ప్రేమ కన్నా రాజకీయమే ఎక్కువగా కనపడుతోంది. ఈ చట్టం ద్వారా జాతీయ గీతం, చిహ్నాలు, పతకాలను కొత్తగా రూపొందించారు. మానవ, మైనార్టీ హక్కులకు సంబంధించిన అంతర్జాతీయ చట్టాలను, న్యాయనిబంధనలను నిస్సిగ్గుగా తోసిరాజంటూ ఇంతటి దుర్మార్గమైన చట్టం చేసిన ఇజ్రాయిల్‌ను అంతర్జాతీయ సమాజం ఖండించకపోవడం దారుణం. యూదులు, అరబ్బులు, జుడాయిస్టులు-ఈ మూడు మతాలకు చెందిన ప్రసిద్ధ ప్రార్థనా స్థలాలు జెరూసలేంలో ఉన్నందున దీన్ని అంతర్జాతీయ నగరంగా ఐరాస పరిగణించింది. 1980లో ఐక్య జెరూసలెం ఏర్పాటుకు ఇజ్రాయిల్ ప్రయత్నించగా ఐరాస జోక్యం చేసుకొని తుది పరిష్కారం జరిగే వరకూ తూర్పు జెరూసలెం స్వతంత్ర ప్రాంతంగా ఉంటుందని పేర్కొంది.

ప్రస్తుతం సంకీర్ణ ప్రభుత్వానికి నెతన్యాహూ సారథ్యం వహిస్తున్నారు. సొంతబలం లేక సంకీర్ణంలోని పార్టీలతో ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. పార్లమెంట్‌లోని మొత్తం 120 స్థానాలకు 2015లో జరిగిన ఎన్నికల్లో నెతన్యాహు 'లికుడ్' పార్టీ కేవలం 30 సీట్లు, 23.40 శాతం ఓట్లు మాత్రమే వచ్చాయి. ఫలితంగా తప్పనిసరై మిత్రుల మద్దతుతో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయవలసి వచ్చింది. నెతన్యాహు పాలనా సంతృప్తికరంగా లేదు. తాజాగా ఆయన టెలికామ్ కుంభకోణంలో ఇరుక్కున్నారు. అవినీతిలో ఇరుక్కుపోయిన నెతన్యాహుకు జాతి ఉన్మాదాన్ని రెచ్చగొట్టడమే ఏకైక మార్గంగా కనిపించింది. నెతన్యాహు భార్య షారాపై అవినీతి కేసులో విచారణ సాగుతున్నది. ఇజ్రాయిల్ ఆర్థిక సంక్షోభం ఎదుర్కొంటున్నది. కాబట్టి జాతి ఉన్మాదాన్ని రెచ్చగొట్టే చర్యలకు దిగుతున్నారు.

ఇజ్రాయిల్ ప్రభుత్వం తీసుకొచ్చిన దుర్మార్గ 'యూదు రాజ్య చట్టాన్ని' వ్యతిరేకిస్తూ రద్దు చేయాలని డిమాండ్ చేస్తూ రాజధాని నగరం టెల్ అవివ్‌లో ఆగస్టు 11న లక్షలాది మంది ప్రజలు ప్రదర్శనలు చేశారు. అరబ్బులు నిర్వహించిన ప్రదర్శనలో వారికి మద్దతుగా యూదు ప్రజలు కూడ వేలాదిగా ఆందోళనలో పాల్గొనడం విశేషం. నెతన్యాహు జాత్యహంకారాన్ని ఖండిస్తూ యూదులు, పాలస్తీనియన్లు ఏకతాటిపై నిలబడి పోరాడటం ఇదే మొదటిసారి. ఇజ్రాయిల్ పౌరలందరిని

సమానంగా చూడాలని యూదులు డిమాండ్ చేయడం ఆహ్వానించదగిన పరిణామం. ప్రజల మనోభావాలకు వ్యతిరేకంగా నడుస్తుందని ప్రజలు నినదించారు. చట్టం రాకముందు హిబ్రూ, అరబ్బీ భాషలు రెండు సమాన హోదాతో అధికార భాషలుగా ఉండేవి. పౌరులందరికి సమాన హక్కులు ఉండేవి. ఈ చట్టం వలన యూదూయేతరులు ద్వితీయశ్రేణి పౌరులుగా మారారు.

గడచిన ఏడు దశాబ్దాలుగా ఇజ్రాయిల్ అక్రమంగా ఆక్రమించుకున్న పాలస్తీనా భూభాగలన్నిటికీ 'జాతీయ విలువ' కల్పించి, ఇజ్రాయిల్ రాజ్యంలో భాగంగా పేర్కొంటున్న ఈ చట్టం అప్రజాస్వామికమైనదని పౌరులు వాపోతున్నారు. నిరంకుశమైన ఈ చట్టాన్ని వ్యతిరేకిస్తూ డ్రూజ్‌లు కూడ ఆందోళన చేపట్టారు. ఇజ్రాయిల్ జనాభాలో వీరు 2 శాతం ఉన్నారు. 'ఈ చట్టం మాకు వ్యతిరేకమైనది. అరబిక్ భాషకు వ్యతిరేకమైనది. శాంతికి, ఈ నేల భవితకు వ్యతిరేకమైనది. మేము ఈ భూమి అసలైన హక్కుదార్లం' అని పాలస్తీనా ఆందోళనకారులు గట్టిగా చెబుతున్నారు. నిర్దిష్టమైన బిల్లును నిరసిస్తూనే, ఇతర రాజకీయ, ఆర్థిక అంశాలు కూడ ఇందులో ఉన్నాయని ప్రదర్శన కారులు పేర్కొన్నారు.

2016లో అమెరికా అధ్యక్ష ఎన్నికల ప్రచారం సందర్భంగా చేసిన వాగ్దానం మేరకు అధ్యక్షుడు ట్రంప్ 2018 మార్చిలో జెరూసలెంను ఇజ్రాయిల్ రాజధానిగా గుర్తిస్తున్నట్లు ఆయన ప్రకటించారు. ఇది ఐరాస తీర్మానాన్ని తిరస్కరించడమే. పాలస్తీనా సమస్య రగులుతున్నంతకాలం పశ్చిమాసియాలో శాంతి నెలకొనే అవకాశం శూన్యమే. ఇజ్రాయిల్‌లో స్థిరపడిన యూదులను వెళ్లగొట్టడం ఆచరణలో సాధ్యం కాదనీ, అట్లాగని పాలస్తీనా ప్రజలను వారి మాతృభూమిని వదులుకొమ్మని చెప్పడం భావ్యం కాదనీ మధ్యేమార్గంగా రెండు రాజ్యాల పరిష్కారం అనే ప్రతిపాదన ఒకటి 1974లో ఐ.రా.స తెచ్చింది. ఇజ్రాయిల్ ఉనికిని పాలస్తీనా వారు ఆమోదించాలి. గాజా, వెస్ట్‌బ్యాంక్ ప్రాంతాలను కలుపుకొని పాలస్తీనా రాజ్యం ఏర్పాటు చేయాలనేది ఈ వాదన చేసేవారి ప్రతిపాదన. అయితే ఆచరణలో దీనిని ఏ విధంగా అమలు చేయాలన్న దానిపై భిన్నాభిప్రాయా లున్నాయి. ఈ ప్రతిపాదనకు మద్దతు పెరుగుతున్న తరుణంలో ఇజ్రాయిల్ దుందుడుకు ధోరణి మళ్లీ వివాదాస్పద చిచ్చును రాజేసింది.

పశ్చిమాసియాలో ఏకైక ప్రజాస్వామ్య దేశమైన ఇజ్రాయిల్‌తో అమెరికా బంధం సైద్ధాంతికమేగాక, బలమైన ఆర్థిక బంధం కూడా. నిండా కోటి జనాభా లేని ఈ చిన్న దేశానికి అమెరికా సైనిక సాయం 118 బిలియన్ డాలర్లు దాటిపోయింది. అంటే సగటున ఏటా మూడు బిలియన్ డాలర్ల (సుమారు రు. 19.000 కోట్లు) మేర అమెరికా నుంచి అందుతున్నాయి. అసలు ఐక్యరాజ్యసమితి భద్రతామండలిలో అమెరికా వీటో చేసిన తీర్మాణాల్లో సగానికిపైగా ఇజ్రాయిల్‌ను అభిశంసిస్తూ చేసినవే. దీనిని బట్టి ఈ రెండు దేశాల మధ్య బంధం ఎంత గాఢమైందో అంచనా వేయొచ్చు. అసలు అమెరికా తోడ్పాటు లేకుండా అరబ్ దేశాల మధ్య ఇజ్రాయిల్ ఉనికి సాధ్యమయ్యేది కాదు. పాలస్తీనా భూభాగంలో యూదులకు స్థిర నివాసాల ఏర్పాటు, ఇరాన్ వంటి అంశాలపై ఒబామా, ఇజ్రాయెల్ ప్రధాని బెంజమన్ నెతన్యాహు మధ్య ప్రకటనల యుద్ధం సాగింది. 2017లో ట్రంప్ అమెరికా అధ్యక్షుడు అయ్యాక ఇజ్రాయిల్ రెచ్చిపోతోంది.

జాతీ మతాలకతీతంగా పౌరులందరికీ సమాన హక్కులు ఉండాలన్న ఆధునిక రాజ్య లక్షణానికి భిన్నంగా ఇజ్రాయిల్‌ను జాతి రాజ్యంగా ప్రకటించుకోవడం వెనుక అమెరికా వెన్నుదన్ను పుష్కలంగా ఉంది. చమురు సమృద్ధిగా లభించే పశ్చిమాసియాపై పట్టు సంపాదించేందుకు ఇజ్రాయిల్‌కు అమెరికా పూర్తి మద్దతు పలుకుతోంది. సౌదీ అరేబియా, ఇతర చమురు సంపన్న రాచరిక ప్రభుత్వాలను కలుపుకొని ఇజ్రాయిల్‌ను బలోపేతం చేయడం ద్వారా ఇరాన్ ప్రాబల్యానికి చెక్ పెట్టాలనేది అమెరికా వ్యూహం. ఈ కొత్త చట్టం ద్వారా స్వతంత్ర పాలస్తీనా ఏర్పాటును అడ్డుకోవడం, తద్వారా పశ్చిమాసియాలో కొత్త ఘర్షణలను ప్రేరేపించడం ద్వారా లబ్ది పొందాలని అమెరికా భావిస్తోంది. ఇప్పటికే పాలస్తీనియన్లపై అనేక దాడులు జరుగుతున్నాయి. పాలస్తీనియులను శరణార్థులుగా మార్చి, తన రాజకీయ ప్రయోజనాల కోసం వారిపై మరింత జాత్యంహకార దాష్టీకానికి పాల్పడేందుకు నెతన్యాహు దక్షిణ పక్ష శక్తులకు ఈ చట్టం మరింత అవకాశం కల్పిస్తోంది.

జాతి వివక్షత, ఉన్మాదాన్ని రెచ్చగొట్టడం ద్వారా ఎన్నికల్లో లబ్దిపొందే ప్రయత్నాలు ప్రపంచవ్యాపితంగా ఊపందుకుంటున్నాయి. అమెరికాలో ట్రంప్ అనుసరించిన ఈ ఎత్తుగడలనే అనేక దేశాల్లో మితవాద పాలకవర్గాలు ఎంచుకొంటున్నాయి. తాజాగా ఇజ్రాయిల్‌లోని నెతన్యాహు ప్రభుత్వం జాతి ఉన్మాదాన్ని రెచ్చగొట్టే చర్యలకు దిగడం ద్వారా నవంబరులో జరిగే ఎన్నికల్లో విజయం సాధించాలనే దుర్మార్గవ్యూహంతో ముందుకు కదులుతోంది. వచ్చే ఏడాది జరగనున్న ఎన్నికలను దృష్టిలో పెట్టుకుని ఆయన ఈ నిర్ణయం తీసుకున్నారన్న అభిప్రాయం రాజకీయ వర్గాల్లో వ్యక్తమవుతోంది. దీనివల్ల మెజారిటీ ప్రజలైన యూదుల్లో జాతీయభావనను రగిలించి తద్వారా రాజకీయంగా లబ్ది పొందాలన్నది ఆయన వ్యూహం.

ఒకవైపు వాణిజ్య యుద్ధం, మరోవైపు ఉత్తర కొరియా, సిరియా, ఇరాన్‌లపై యుద్ధ సన్నాహాలు చేస్తున్న ట్రంప్ అండతోనే ఇజ్రాయిల్ అధ్యక్షుడు నెతన్యాహు అహంకార ధోరణి పెరిగిపోతోంది. అంతర్జాతీయ న్యాయ సూత్రాలను, ఐరాస తీర్మాణాలను దేనిని ట్రంప్, నెతన్యాహులు ఖాతరు చేయడం లేదు. పాలస్తీనీయున్లను స్వంత భూమి నుండి తరిమి వేయాలని నెతన్యాహు ప్రయత్నిస్తుంటే, మరోవైపు ట్రంప్ ఇజ్రాయిల్‌లోని యూదు అతివాద వర్గాన్ని రెచ్చగొట్టి పశ్చిమాసియాలో సంక్షోభాన్ని సృష్టిస్తున్నాడు. అంతర్జాతీయ వ్యవస్థలు అతలాకుతలం అవుతున్నాయి.

1948లో ఇజ్రాయిల్ ఆవిర్భవించినప్పుడు పశ్చిమ దేశాల తరహాలో ప్రజాస్వామ్య వ్యవస్థను నెలకొల్పాలని, ఉదారవాద విధానాలు అవలంభించాలని, ప్రతి ఒక్కరికీ సమాన హక్కులు, అవకాశాలు ఉండాలని దేశ నిర్మాతలు భావించారు. మతాన్ని వారు విస్మరించ నప్పటికీ, మతరాజ్యంగా చూడాలని ఎంత మాత్రం అభిలాషించలేదు.

దేశహితాన్ని దృష్టిలో పెట్టుకుని కాకుండా, రాజకీయ కోణంలో ఆలోచించడం అలవాటైన నాయకులకు వాస్తవాలు పట్టవు. అంతర్జాతీయ సంస్థల నియమ నిబంధనలు, తీర్మాణాలు కూడా పట్టవు. నెతన్యాహు అదే పరిస్థితిలో ఉన్నారు! యూదు జాత్యహంకార ఇజ్రాయిల్ పాలకులను అడ్డుపెట్టుకొని భౌగోళికాధిపత్యాన్ని సుస్థిరం చేసుకునేందుకు అమెరికా వేస్తున్న ఎత్తుగడలను ప్రపంచ ప్రజలు చిత్తు చేయకపోతే అంతర్జాతీయ సమాజం మరిన్ని రక్తసిక్త యుద్ధాల్లో కూరుకుపోయే ప్రమాదం ఉంది. ఈ నేపథ్యంలో అంతర్జాతీయ సమాజం పాలస్తీనీయన్ల న్యాయమైన పోరాటానికి అండగా నిలువాలి. అమెరికా సామ్రాజ్యవాద దుందుడుకు చర్యలకు కళ్లెం వేయకపోతే మరో ప్రపంచ యుద్ధం వచ్చినా ఆశ్చర్యపోనవసరం లేదు.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# ఇమ్రాన్‌ఖాన్ అడుగులు ఎటువైపు?

*పాకిస్తాన్‌లో మతఛాందసవాదం, సైన్యం, అమెరికాలదే మొత్తం పెత్తనమనీ, ఎన్నికల ద్వారా గెలిచే నాయకులు కేవలం వారి చెప్పుచేతుల్లో నడిచే అధికారులేననీ, ఈ మొత్తంలో ప్రజలు తీవ్రంగా నష్టపోతున్నారనీ అంటున్నారు* **బైరెడ్డి సతీష్**

పాకిస్తాన్‌లో ఎపుడైన ఎన్నికలు జరిగితే ప్రయోజనాలు ఉండే దేశాలతో పాటు భారతదేశంలోనూ అమితాసక్తి కనపడుతుంది. ఎన్నికలకే పరిమితమైన ప్రజాస్వామ్యంలో అవికూడా జరుగుతాయో లేదో అనే రాజకీయ అనిశ్చిత పరిస్థితులే సాధారణంగా నెలకొనే పాకిస్తాన్‌లో ఆర్మీ పడగనీడలో ఆ తతంగం జరగడమూ సహజంగానే అంతటా ఆసక్తిని రేకెత్తిస్తుంది.

పాకిస్తాన్ ఏర్పడినినాటి నుండి పేరుకే పార్లమెంటరీ పంథాలో ఎన్నికలు జరిగినప్పటికీ ఆర్మీదే అసలు అధికారమంతా. ఎన్నికైన ప్రభుత్వాల కంటే సైనిక తిరుగుబాటు పేరుతో ఆర్మీలోని ఆధిపత్య వర్గాలు నడిపిన ప్రభుత్వాలే ఎక్కువ కాలం నిలబడ్డాయి. పాకిస్తాన్ సమాజాన్ని ముఖ్యంగా మూడు 'ఎ'లు నడిపిస్తాయంటారు! అల్లా, ఆర్మీ, అమెరికా. అక్కడి ఏ పరిణామం ఈ శక్తుల ప్రమేయం లేకుండా ఏమాత్రం జరిగే అవకాశం లేదు. అల్లా పేరుతో అంతర్గతంగా ఉండే మత ఛాందస శక్తులు, ఆయుధాలు చేతుల్లో ఉన్న ఆర్మీ, అంతర్జాతీయంగా అమెరికా మొత్తంగా ఆ దేశ రాజకీయ వ్యవస్థను నిర్దేశించడమే కాకుండా ప్రతి రంగాన్ని శాసిస్తున్నాయి. పేరుకు 'సార్వభౌమాధికార' రాజ్యమే అయినా తన భూభాగంలోకి అమెరికా అక్రమంగా చొచ్చుకువచ్చి లాడెన్‌ను లాగేసుకుపోయినా పల్లెత్తు మాట అనలేని దైన్యస్థితి పాకిస్తాన్‌ది. ఆ దేశ ఆర్థిక విధానాలేమోగాని విదేశాంగ విధానాలు మాత్రం ఆర్మీ ఆమోదం లేకుండా అడుగు ముందుకు పడలేవు.

పాకిస్తాన్‌కు అంతర్జాతీయంగా అందే ఆర్థిక సహాయంలో సింహభాగం అమెరికా నుండే అందుతుంది. ఆఫ్ఘనిస్థాన్‌లో అమెరికా చేస్తున్న అక్రమ యుద్ధానికి వెన్నుదన్నుగా నిలవడానికి, ఇతర ఇస్లామిక్ దేశాలతో కయ్యానికి కాలుదువ్వుతున్న అమెరికాకి, పాక్ పక్కన్నే ఉన్న చైనాను నిలువరించడానికి వ్యూహాత్మక భౌగోళిక రాజకీయ ప్రయోజనాల కోసం ఆ దేశాన్ని ఎంత వీలైతే అంతగా వాడుకుంటున్నది అమెరికా. అక్కడ ఉన్నది 'పౌర' ప్రభుత్వమా, ఆర్మీ అధికారమా అన్నది తనకనవసరం! తన ప్రయోజనాలు నెరవేర్చుకోవడమే ప్రధానం. ఆ ప్రయోజనాల కనుగుణంగా మాత్రమే పౌర హక్కులు, ప్రజాస్వామ్యం అనే మాటల్ని అపుడపుడు అమెరికా వల్లెవేస్తుంది. మరోవైపు పాకిస్తాన్‌లోని మత ఛాందస వర్గాలకు వారి అస్థిత్వం కోసం భారత్ బూచి, కశ్మీర్ స్వతంత్ర పోరాటమూ కావాలి. భారతదేశంలో ఎట్లాగైతే కశ్మీర్ భారత్ అంతర్భాగమని నినదిస్తేనే దేశభక్తులుగా లేబుల్ వేసే హిందూ మతోన్మాద సంస్థలున్నట్లే, పాక్‌లోనూ కశ్మీర్‌ను భారత్ నుండి విముక్తి చేద్దాం అనే నినాదంలో భాగస్వామ్యం అయితేనే అక్కడి ఇస్లామిక్ ఛాందస సంస్థలు దేశభక్తులుగా ముద్రలు వేస్తాయి. రెండు దేశాల్లోని రెండు మతాల ఛాందస వర్గాలు కశ్మీర్‌ను మతపరమైన అంశంగా గుర్తిస్తూ అసలు కశ్మీర్‌లో జీవించే ప్రజలందరి విముక్తి అంశంగా గుర్తించ నిరాకరిస్తున్నారు.

రెండు దేశాల పాలకవర్గాలు ఆ పేరుతో 'దేశభక్తి'ని రగిలించి ఓట్ల రూపంలోకి మార్చుకోవడం అలవాటుగా మారిపోయింది. మరోవైపు పాకిస్తాన్‌లో ఇప్పటివరకు అధికారం వెలగబెట్టిన 'పౌర' ప్రభుత్వాలన్నీ పచ్చిగా అవినీతిలో కూరుకొని పోవడం ప్రజల ఆకాంక్షలను గాలికి వదిలేయండతో ఆర్మీ పని మరింత సులువవుతున్నది. మత ఛాందస వర్గాల ప్రచారం, కశ్మీర్‌ను భారత్ నుండి విముక్తి చెందించే సత్తా పాక్ ఆర్మీకి మాత్రమే ఉందన్న ప్రచారం ఆ దేశంలో బలంగా ఉండడంతో ప్రజలు ఆర్మీని అధికంగా ఆదరిస్తున్న మాట నిజమే!

ఈ నేపథ్యంలో ప్రత్యక్ష ఎన్నికల ద్వారా ఎన్నికైన పాకిస్తాన్ ముస్లీం లీగ్ (నవాజ్) నవాజ్ షరీఫ్ నాయకత్వంలోని ప్రభుత్వాన్ని పడగొట్టే కుట్రలో భాగంగా పాకిస్తాన్ ఆర్మీ షరీఫ్‌పై అవినీతి అభియోగాలు, పనామా పేపర్స్ లీకేజీ, అక్రమ ఆస్తుల పేరుతో అవినీతి వ్యతిరేక కోర్టులో దోషిగా నిలబెట్టి యుద్ధ ప్రాతిపదికన నేర నిరూపణ కావించింది. ప్రజా ప్రయోజనాలున్న మరే ఇతర కేసుల్లోనూ పెద్దగా స్పందించని పాకిస్తాన్ న్యాయవ్యవస్థ ఆర్మీ స్వప్రయోజనాలు, ఒత్తిడితో చాలా 'చొరవ'తో పనిచేసి మరీ నవాజ్ షరీఫ్‌ను పదవీచ్యుతున్ని చేయడమే కాకుండా భవిష్యత్తులో మరే రాజకీయ పదవికి అర్హుడు కాదని, భవిష్యత్తులో ఏ ముప్పు ఎదురు కాకుండా జాగ్రత్త పడింది ఆర్మీ.

ఇటీవలి కాలంలో ప్రభుత్వ నిర్వహణ, విదేశాంగ వ్యవహారాల విషయాల్లో ఆర్మీ జోక్యం, అమెరికా జోక్యాన్ని షరీఫ్ కొంతమేరకు అడ్డుకున్నందుకే ఈ తతంగమంతా జరిగిందని ప్రపంచమంతా విశ్వసిస్తున్నది. సరిగ్గా ఈ సమయంలోనే ప్రస్తుత ప్రభుత్వ పదవి కాలం ముగియడం ఎన్నికలు సమీపించడంతో పరిస్థితులను మొత్తంగా ఆర్మీ తనకు అనుకూలంగా మార్చుకున్నది. తన ప్రమేయంలేని మరో పౌర ప్రభుత్వాన్ని ఏ మాత్రం నిలబెట్టే, కొనసాగించే అసలు మొత్తంగా ఎన్నికయ్యే అవకాశమే లేకుండా అందివచ్చిన ఏ అవకాశాన్ని వదులుకోకుండా అన్నీ తానై ఎన్నికల తతంగాన్ని నడిపించింది.

ప్రపంచంలోనే ఆరవ అతిపెద్ద మిలటరీ వ్యవస్థ ఉన్న పాకిస్తాన్‌లో ఆర్మీలోని ఉన్నత పదవులన్నీ దాదాపుగా పాకిస్తాన్‌లోని ఉన్నత వర్గాల నుండి వచ్చినవారితోనే నిండిపోతాయి. ప్రభుత్వ ఆస్తులుగా పరిగణించబడే స్థిరాస్తులు ప్రత్యేకించి విలువైన భూములు ప్రధానంగా పట్టణ, నగర ప్రాంతాలలో సగానికిపైగా మిలటరీ ఆధీనంలోనే ఉన్నాయి.

అక్కడి ఆధిపత్య శక్తులు, ఆస్తికర వర్గాలు వ్యవస్థపైన ఆధిపత్యాన్ని, అధికారాన్ని నిలబెట్టుకోవడం కోసం రాజకీయాల మార్గమే కాకుండా మిలటరీ మార్గాన్ని ఎంచుకొని ఉన్నత పదవుల్లోకి ఎగబాకి ఆస్తుల్ని, అధికారాన్ని నిలుపుకోవడమే కాకుండా దేశ'రక్షకులు'గా పేరుతెచ్చు కుంటూనే అవినీతి బురద అంటకుండానే మరిన్ని ఆస్తుల్ని పోగేసుకుంటున్నారు. ఈ వర్గాలకు అక్కడి మతఛాందస సంస్థల తోడ్పాటు అనివార్యమవుతున్నది. ఎన్‌జిఓల పేరుతో, స్వచ్ఛంద సంస్థల పేరుతో ఈ మతోన్మాద సంస్థలు ఆర్థిక వనరుల కోసం ఆర్మీ సహకారాన్ని తీసుకుంటాయి. మరోవైపు పాలకవర్గ పార్టీల్లో పదవీ వెంపర్లాట ఉన్నవాళ్లంత ఆర్మీ కరుణా కటాక్షాల కోసం నిరంతర ప్రదక్షణలు ఎలాగూ చేస్తూనే ఉంటారు.

సరిగ్గా ఈ నేపథ్యంలోనే గత జూలై 25న సాధారణ ఎన్నికలను ఆర్మీ కనుసన్నల్లో పాకిస్తాన్ ఎన్నికల సంఘం నిర్వహించింది. ఈ ఎన్నికల్లో ప్రపంచ దృష్టిని ఆకర్షించింది రాజకీయ నాయకుడిగా మారిన పాకిస్తాన్ క్రికెట్ జట్టు మాజీ కెప్టెన్ ఇమ్రాన్‌ఖాన్. 1992లో ప్రపంచ కప్‌ను గెలవడం ద్వారానూ వ్యక్తిగత జీవితంలోని పరిణామాల ద్వారా చాలా పాపులర్ అయిన ఖాన్ పాకిస్తాన్ తెహ్రిక్ ఇన్సాఫ్ (పిటిఐ) పార్టీని స్థాపించి రెండు దశాబ్దాలుగా అధికార పీఠానికి చేరుకోవాలని తాపత్రయ పడుతున్నాడు. యువతను సమీకరించి మతోన్మాత సంస్థలతో కలిసి అధికార పక్షానికి వ్యతిరేకంగా అవినీతి వ్యతిరేక ఉద్యమం అంటూ అనేక ర్యాలీలతో ఇటీవలి కాలంలో మరింత చురుకైన పాత్ర పోషించాడు.

ఇప్పటి వరకు ప్రభుత్వాలను ఏర్పరిచిన బెనజీర్ భుట్టో పార్టి అయిన పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ, నవాజ్‌షరీఫ్ పాకిస్తాన్ ముస్లీం లీగ్‌లను అవినీతి పార్టీలుగా ఆర్మీ ఆ దేశంలోని మత సంస్థల, పౌర సంస్థల ద్వారా ముద్ర వేయించడంలో సఫలమైంది. ఏదో ఒక చోట ఆర్మీకి సహించని లేదా ఆర్మీతో ప్రమేయం లేకుండా కీలక నిర్ణయాలు ఈ రెండు పార్టీలు తీసుకోవడంతో కన్నెర్ర చేసిన మిలటరీ బాస్‌లు వాటిని ఈ ఎన్నికల ద్వారా అడ్డు తొలగించుకోవడానికి అందివచ్చిన ఆయుధం ఇమ్రాన్‌ఖాన్.

ఆర్మీది, ఇమ్రాన్‌ది ఒకే నినాదం కావడం, మతఛాందస వర్గాల మద్దతు కూడా పుష్కలంగా ఉండడంతో ఆర్మీ తన వ్యూహాలను సమర్థవంతంగా విజయవంతంగా అమలు పరిచింది. ఎన్నికలకు ముందుగానే ప్రజాభిప్రాయాన్ని పెద్దఎత్తున మలిచే పనిలో ఆర్మీ అక్కడి మీడియాను కట్టడి చేసింది. జియో టెలివిజన్, డాన్ లాంటి మీడియా సంస్థలపైన తీవ్ర ఒత్తిడి తీసుకురావడమే కాకుండా, ఆర్మీ వ్యతిరేక, ఖాన్ వ్యతిరేక అభిప్రాయాన్ని బయటికి రాకుండా అడ్డుకున్నది. ప్రత్యక్ష ప్రసారాలను పూర్తిగా అనధికారికంగా నిషేధించింది.

అనేక మత సంస్థలను, 'అతివాద' సంస్థలుగా, వ్యక్తులుగా ముద్రపడిన వారందరిని కూడకట్టి పరిస్థితిని ఇమ్రాన్‌ఖాన్‌కు అనుకూలమయ్యేలా వ్యవహరించింది. మిగతా పార్టీల్లోని నాయకులను బెదిరించి ఆ పార్టీలకు రాజీనామా చేసి ఇమ్రాన్‌ఖాన్ నాయకత్వంలోని పిటిఐలో చేరేలా తీవ్ర ఒత్తిడి చేసింది. ఇలా చేరిన వారిలో ఇమ్రాన్‌ఖాన్ వ్యతిరేకించిన, అవినీతి పరులుగా ముద్రపడిన నాయకులుండడం విశేషం. పాపం ఖాన్! ఆర్మీ ఒత్తిడి ఎంత ఉందంటే తను వ్యతిరేకించిన వారిని సైతం పార్టీలోకి చేర్చుకొని మరీ టికెట్లు ఇవ్వాల్సి వచ్చింది.

మరోవైపు 'నయా పాకిస్తాన్' నిర్మాణం, ఇస్లామిక్ సంక్షేమం రాజ్యం, అవినీతి వ్యతిరేక పాలన వంటి నినాదాలతో గత ప్రభుత్వాల వైఫల్యం, ప్రజల ఆక్రోశాన్ని ఇమ్రాన్‌ఖాన్ పార్టీ సొమ్ము చేసుకోగలిగింది. పది మిలియన్ల ఉద్యోగాలు కల్పిస్తామని, సిద్ధాంత రాద్ధాంతాలు కాకుండా అభివృద్ధికి పాటుపడుతామని చెబుతూనే మత ఛాందస వర్గాలను ఆకర్షించేందుకు మత దూషణల వ్యతిరేక చట్టాలను మరింత కట్టుదిట్టం చేస్తామని కూడా ప్రకటించాడు. దీనికి తోడు అనేక చోట్ల అమెరికా, ఇండియా వ్యతిరేక ప్రకటనలు, సౌదీ అరేబియా అనుకూల ప్రకటనలతో మరింతగా ఆకర్షించే ప్రయత్నం చేశాడు.

మహమ్మదీయులను ముస్లీమేతరులుగా ప్రకటించిన పాకిస్తాన్ రాజ్యాంగ రెండవ సవరణని మార్చే ఉద్దేశ్యం లేదని ప్రకటించడం ఆ దేశ మెజారిటీ మత ఓట్లను రాబట్టేందుకే అనేది సుస్పష్టం. అనేక చోట్ల షియాలను లక్ష్యంగా చేసుకొని కూడా ప్రకటనలు వెలుబడ్డాయి. మొక్కుబడిగా ప్రభుత్వ నిర్వహణలో ఆర్మీ పాత్ర ఉండదని చెబుతూ వచ్చాడు. తాలీబాన్‌లతో చర్చలు జరపాలని చెప్పడం, మత సంస్థలను వెనుకేసుకొని రావడం ద్వారా 'తాలీబాన్ ఖాన్' గా కూడా ప్రసిద్ధుడయ్యాడు. దీనికి తోడు భూస్వామ్య, ఆధిపత్యవర్గాల మద్దతు ఆయనకే ఉంది. ఇస్లామిక్ దేశాలలోనే అతిపెద్ద ఆర్మీ అయిన పాకిస్తాన్‌లో 3,71,000 ఆర్మీ బలగాలను మోహరించి ఈ ఎన్నికలను నిర్వహించారు. అనేక సర్వేలు చెప్పినట్టుగానే కేవలం 50.3 శాతం పోలింగ్ నమోదైన ఈ ఎన్నికల్లో ఇమ్రాన్‌ఖాన్ నాయకత్వంలోని పిటిఐ 270 సీట్లు కలిగిన శాసన వ్యవస్థలో 116 సీట్లతో పూర్తి మెజార్టీ కాకపోయినా అతిపెద్ద పార్టీగా అవతరించి సంకీర్ణ ప్రభుత్వాన్ని ఏర్పరిచింది. 64 సీట్లల్లో నవాజ్‌పార్టీ, 43 సీట్లల్లో పిపిపితో పాటు స్వతంత్రులు, చిన్నా చితక పార్టీలు ఇతర సీట్లను స్వాధీనం చేసుకున్నాయి. నవాజ్‌షరీఫ్ పార్టీ బలంగా ఉన్న పంజాబ్ ప్రావిన్స్‌లో సహితం పిటిఐ ఆధిక్యతను కనబరిచింది.

ప్రపంచమంతా అనుమానించినట్టుగానే పాకిస్తాన్ చరిత్రలోనే అత్యంత అవకతవకలు జరిగిన ఎన్నికలని, పోలింగ్ బూతుల్లో విధుల నిర్వహణ పేరిట సైన్యం రిగ్గింగుకు పాల్పడిందని మిగతా పార్టీలన్నీ ఈ ఫలితాలను గుర్తించబోమంటూ ప్రకటించాయి.

గత ఎన్నికల్లో పెద్దఎత్తున అక్రమాలు, రిగ్గింగు జరిగిందని ఆరోపించిన ఇమ్రాన్ ఈసారి చాలా సజావుగా జరిగాయని కితాబివ్వడం విశేషం. ఈ ఎన్నికలు జరిగిన తీరును, ఫలితాలను తానూ విశ్వసించడం లేదని అమెరికా సహితం ప్రకటించడం గమనార్హం. ఎన్నికలు జరిగిన తీరు, ఫలితాలపై భారత ప్రభుత్వం పెద్దగా స్పందించకపోయినా ఏర్పడిన ప్రభుత్వం భారత్‌తో ఎలా వ్యవహరిస్తుందనే అంశంపైనే ప్రధానంగా విశ్లేషణలు, ఊహాగానాలు కొనసాగుతున్నాయి.

ప్రపంచ జనాభాలో 2.63 శాతంతో, 20 కోట్ల 12 లక్షల జనాభాతో ఆరవ స్థానం కలిగిన పాకిస్తాన్ 50 శాతం కంటే ఎక్కువ నిరక్షరాస్యతను కలిగి ఉన్నది. 40 శాతం జనాభా నగరాల్లో ఉన్నది. పాక్ మారుమూల ప్రాంతాలు ప్రత్యేకించి పర్వత ప్రాంతాలు ముస్లిం గిరిజన తెగలతో నిండిపోయి ఉన్నది. గ్రామీణ జనాభాలో విపరీతమైన పేదరికం తాండవిస్తున్నది. 44 శాతం పిల్లల్లో పోషక ఆహారం లభించక ఎదుగుదల

# ఆర్‌ఎస్‌ఎస్ 'గర్భ సంస్కార్'

*ప్రజలు సాంకేతికతవైపు మళ్లకుండా నిత్యం ఆచార సంప్రదాయాల పేరుతో మూఢ విశ్వాసాల్లో ఉంచే ప్రయత్నంలో భాగంగా వచ్చిందే ఆర్‌ఎస్‌ఎస్ గర్భ సంస్కార్ అంటున్నారు* **వై.ఎచ్.కె. మోహన్‌రావు**

క్రీ.శ. 1293లో అల్లా ఉద్దీన్ ఖిల్జీ దక్షిణా పథాన దేవగిరి (ఇప్పటి దౌలతాబాద్) రాజ్యంపై దండెత్తి కోటను ముట్టడించిన తరుణంలో మహారాజు రామ దేవరావు కోటకు సమీపంలో వెలిసిన దేవాలయానికి దైవదర్శనం చేసుకునేందుకు వెళ్లాడు. సాక్షాత్ మహారాజే దేవాలయానికి విచ్చేసినందున అర్చకుడు ప్రత్యేక పూజలు ప్రారంభించాడు. ఈ క్రమంలోనే యువరాజు శంకర దేవుడు అంతకు పూర్వమే మరో శత్రు రాజ్య సైన్యంపై ప్రధాన సైన్యంతో యుద్ధానికి వెళ్లాడు. ఈలోగా 8 వేల సైనిక బలగాలతో ఖిల్జీ కోటను చుట్టుముట్టాడు.

కోటలో ఉన్న రక్షక దళాలకు దశాదిశ నిర్దేశించేవారు, యుద్ధ ప్రణాళికలను రచించేవారు కరువై చేతులుడిగి పోయారు. పూజలు అర్ధాంతరంగా విడిచి వెళ్లడం శుభప్రదం కాదని మహారాజుకు పూజారి ఉచిత సలహా పడేశాడు. తీరా పూజ ముగిసి రాజావారు తాపీగా చేరుకునే సమయానికి కోట ఖిల్జీ వశమైంది.

దేవాలయంలోని దేవుడు రామదేవరావు ప్రార్థనలైతే పుచ్చుకున్నాడు, కానీ రాజ్యం శత్రుపరం కాకుండా నిలువరించింది లేదు. ఈ చారిత్రక కథనాన్ని ఇప్పటికిప్పుడు మనం తెలుసుకోవాల్సిన అగత్యం ఏంటి? మీ ప్రశ్న సహేతుకమైనదే!

పై కథకు పూర్వ రంగమేమంటే! గత కొద్దిరోజులుగా ఆర్‌ఎస్‌ఎస్ సంస్థ గర్భ సంస్కార్ పేరిట ఒక బృహత్తర ప్రచార కార్యక్రమం ప్రారంభించింది. ఈ కార్యక్రమ లక్ష్యమేమంటే తాము రూపొందించిన పది సిడిలను గర్భవతులు వింటే, వారికి మన్మథుని అందం, శివాజీ శౌర్యం, ఆర్యభట మేధస్సు కలగలిసిన సంతానాన్ని పొందుతారట. సిడిలకు ప్రత్యామ్నాయంగా ముద్రించిన పుస్తకాలను కూడా సిద్ధం చేసింది. చదువకలిగిన వారికి చదువుకొనే సదుపాయం కూడా కల్పించింది ఆర్‌ఎస్‌ఎస్. కొన్ని సంస్కృత మంత్రాలకు బాణీలు సమకూర్చి గీతాలుగా సిడిలను రూపొందించి వదిలింది ఆ సంస్థ. ప్రస్తుతం సిడిలను, పుస్తకాలను మన ప్రధాని నరేంద్రమోడీ స్వరాష్ట్రమైన గుజరాత్‌ను ప్రయోగాత్మకం చేసుకుని విక్రయిస్తుంది.

అయితే ఈ సిడిలు, పుస్తకాల ఫలితాలను విశ్వాసాలకు అంటగట్టి ప్రజలను కట్టడిచేసే పనిలో ఆర్‌ఎస్‌ఎస్ నిరంతర కసరత్తు మొదలెట్టింది. అభిమన్యుడు సుభద్ర గర్భంలో ఉన్నప్పుడు తండ్రి అర్జునుని వలన ఒక యుద్ధ ప్రక్రియ అయిన పద్మవ్యూహాన్ని ఛేదించుకుని వెళ్లే అవగాహన తెచ్చుకున్నాడు.

ఈ సిడిలకు, పుస్తకాలకు ప్రమాణం మహాభారత ఇతిహాసమట. సదరు ప్రచారంలోని హేతుబద్ధతని ఏమాత్రం పరిశీలన చేయకుండా ప్రజలు వీటిని స్వీకరిస్తారో! లేదో! వేచి చూడాల్సి ఉంది.

---

నిలిచిపోయింది. 25 లక్షల మంది పిల్లలు బడిబయటే ఉండిపోయారు. జిడిపిలో కేవలం 3 శాతం మాత్రమే విద్య, వైద్యంపై ఖర్చుపెడుతున్నారు. పొరుగు దేశాలను శత్రు దేశాల సాకుతో రక్షణ వ్యయాన్ని ప్రతియేటా పెద్ద ఎత్తున పెంచుతున్నారు.

అతిపెద్ద మహిళా కార్మిక శక్తి కలిగి ఉన్న దేశాల్లో పాకిస్తాన్ ఒకటి. అయినప్పటికీ విద్య, వైద్య రంగంలో మహిళల పట్ల తీవ్రమైన వివక్షతతో పాటు మత సంబంధ, సంప్రదాయ కట్టుబాట్లతో విపరీతమైన అణిచివేత అమలవుతున్నది. పట్టణ, నగర ప్రాంతాల్లో ఆర్థికంగా ఎదిగిన వర్గం అన్ని అవకాశాలను అందిపుచ్చుకుంటూ ఉంటే నిరుపేద గ్రామీణ ప్రజల్ని మతోన్మాద సంస్థలు చేరదీస్తున్నాయి. పాత పార్టీలు చెడ్డవని, కొత్త పార్టీలు గొప్పవని కాదుకాని ఏ పార్టీ ప్రజల ఆకాంక్షల్ని నిజమైన ఎజెండాగా పెట్టుకోలేదు. వారిలో బలహీనతల్నీ, భయాల్ని పెంచిపోషించి ప్రయోజనాలను నెరవేర్చుకోవడమే తప్ప నిజమైన ప్రజా పక్షపాత ఎజెండా ఏ పార్టీకీ లేదు.

ఒక పార్టీ వైఫల్యం మరో పార్టీకి లాభిస్తున్నది. కాకపోతే ఆర్మీ అండదండలున్న పార్టీలు, సలామ్ చేసే పార్టీలు కాస్త ఎక్కువ కాలం ప్రభుత్వాల్ని నడపగలవు తప్ప ఏదో మొత్తంగా పాక్ ప్రజా జీవితంలో పెను మార్పులు తీసుకొస్తాయని అనుకోలేం.

పాకిస్తాన్ మత పునాదులపై ఏర్పడడం, అనేక చారిత్రిక కారణాలతో పాటు పాలక వర్గాల ప్రయోజనాల కోసం పాక్ సమాజంలో మత ఛాందస పునాదులు బలంగా ఉన్న మాట నిజం. పాకిస్తాన్‌లోని కులీన శ్రేణులు మతాన్ని మోసే భారం నుండి తప్పించుకునే స్థితిలో ఉన్నారు. సాధారణ, నిరుపేదవర్గమంతా మతాన్ని భుజానికెత్తుకోవాల్సిన స్థితికి నెట్టివేయబడుతున్నారు. మతం దోపిడీ సాధనంగా అత్యంత శక్తివంతంగా ప్రపంచమంతా పనిచేస్తున్నట్టే పాకిస్తాన్‌లోనూ పనిచేస్తున్నది.

ప్రగతిశీల గొంతుకలు ఉన్నప్పటికినీ అవి అత్యంత బలహీనంగా ఉండటం, అత్యంత పాశవిక నిర్బంధకాండను, హత్యాకాండను ఎదుర్కోవాల్సి రావడం మూలంగా వాటి ప్రభావం పాకిస్తాన్ సమాజంలో తక్కువే అయినప్పటికీ చారిత్రిక అనివార్యంగా ఏదో ఒక రోజు అక్కడి శ్రమజీవులు ప్రజా విముక్తికై ప్రగతిశీల ఉద్యమ జెండాను ఎగురేస్తారని ఆశిద్దాం.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

ప్రపంచం విజ్ఞానం వైపు పరుగులు తీస్తుంటే భారతీయ సమాజం ఇప్పటికీ మూఢవిశ్వాసాల చిక్కుముడుల నుండి వెలుపలికి రాలేక పోతోంది. మరీ ముఖ్యంగా కేంద్రంలో 2014లో ఏర్పడిన బలోపేత బిజెపి ప్రభుత్వం ఈ నమ్మకాలు మరింత చిక్కగా విస్తరించడానికి వేదికగా మారింది. బిజెపి బలగాలు, అనుబంధ శ్రేణులు ప్రజలను మరింతగా మూఢత్వ మార్గంలోకి మళ్లించే యత్నాలు తీవ్రమయ్యాయి.

ఇప్పటికే లెక్కకు మించిన మూఢవిశ్వాసాల వలలో మనం ఉన్నాం. ఈ నమ్మకాల మత్తులో జోగుతుంది జనత. అకాల మృత్యు హరణం/ సర్వవ్యాధి నిరావణం/సమస్త పాపక్షయం/మహావిష్ణు పాదోదకం/ప్రీత్యర్థ శుభం. ఈ మంత్రం అర్చనానంతరం దేవాలయంలో భక్తుడు తీర్థం పుచ్చుకునే సందర్భంలో అర్చకుడు వల్లిస్తుంటాడు. ఈ తీర్థం తీసుకున్న వారందరికీ అకాల మృత్యువు దూరమై, సర్వరోగాలు నివారణ అవుతాయా! మనం ఆలోచన చేసిందెపుడు! సమస్త పాపాలు హరిస్తాయా! లేదో! నిరూపించలేని అంశం. ప్రమాణాలకు సరితూగే విషయాలు అకాల మృత్యువు, సర్వరోగాలు మాత్రమే. బహుశా ఒకశాతం కూడా నిజంకాదు.

ఈ మంత్ర భావంలోని మరో అంశమేమిటంటే! ఇది శాతాలకు సంబంధించిన సంగతి కాదు. డోలోఫర్ మాత్రను తీసుకుంటే ఎవరికైనా టెంపరేచర్ ఎలాగైతే నియంత్రణలోకి వస్తుందో అదే విధంగా తీర్థం పుచ్చుకున్న వారందరికీ మృత్యువు, వ్యాధులు దూరం కావాలి. అవుతున్నాయా! అదే విధంగా గరుఢ పురాణం ఆలకించినా, మృత్యుంజయ మంత్రం జపించినా కూడా అకాల మృత్యువు నుండి విముక్తి చెందుతారని పురాణ ప్రతీతి.

ఈ నేపథ్యమే సంవత్సరం క్రితం చలనచిత్ర నటీనటులు వరుసపెట్టి అకాలంగా తనువు చాలిస్తున్నారని, అదేదో అశుభమంటూ ఆ రంగం పెద్దలు హైదరాబాద్ ఫిలం నగర్‌లోని దేవాలయంలో మృత్యుంజయ మహాయాగం నిర్వహించారు. యాగానంతరం టపీమని వెళ్లిపోవడం నిలిచిపోయిందా! మనకు ఫలితాలతో, వాస్తవాలతో నిమిత్తమేముంది. గొర్రె పోకడలు అనుసరించడమే ఆనవాయితీ. పూజలు, యాగాలు, యజ్ఞాలు, అభిషేకాలతో ఫలితాలను పొందితే వైద్య శాస్త్రాలు, వైద్యశాలలు, శస్త్ర చికిత్సలు, శాస్త్రవేత్తలు, వైద్య పరిశోధనలు రోజుల తరబడి రేయింబవళ్లు జుట్టు పీక్కోవడాలెందుకు? రోగం రాగానే రోగి వైద్యశాలపై దృష్టి మార్చాల్సిన అవసరం ఏముంది?

విశ్వాసాలు బలంగా ప్రచారం చేస్తున్న వాళ్లు కూడా రుగ్మతలు బాపుకోవడానికి ఆసుపత్రి వైపే అడుగులు వేస్తున్నారన్నది విస్మరించలేని వాస్తవం. దేవాలయానికి వెళ్లి తీర్థ ప్రసాదాలతో సరిపెట్టరు. మంత్రాలే రోగాలను బాపితే వైద్యులందరూ మృత్యుంజయ మంత్రం, గరుఢ పురాణం అధ్యయనం చేసి కంఠతా పెట్టుకుని ధారణ చేస్తుంటే సరిపోతుంది.

గుండె మార్పిడి, కాలేయ మార్పిడి, మూత్ర పిండాల మార్పిడి వంటి కీలక చికిత్సలతో వైద్యం విజ్ఞాన శిఖరాలవైపు విప్లవాత్మకంగా పయనిస్తుంటే మంత్రాలు, యంత్రాలు, తాయెత్తలంటూ మన మతపెద్దలు ఇంకొంత ముందుకెళ్లి గర్భ సంస్కార్, హృదయ సంస్కార్ అనే కొత్త పల్లవి అందుకోవడం జాతిని అజ్ఞానాంధ కారంలోకి మళ్లించే యత్నం మినహా మరొకటి కాదు. నిత్య నిరూపణకు రాని విషయ ప్రచారం గావించడానికి అలావాటు పడిన సిద్ధాంతకర్తలు మోసానికి పులిమిన మరో వర్ణమే ఈ గర్భ సంస్కార్ ప్రచార ప్రక్రియ.

రామాయణంలోని సుందరకాండ భాగాన్ని వల్లెవేస్తే చోరికి గురైన సొత్తును తిరిగి పొందుతారట. చోరీలను గురించి ఇక పోలీసు స్టేషన్‌కు వెళ్లి ఫిర్యాదు చేయనవసరమేదీ లేదు. ఇంటి యజమాని, లేకపోతే సొత్తు యజమాని పారాయణం చేసుకుంటూ కూర్చుంటే సరిపోతుందేమో! అట్లా గాకుండా రక్షకభటులు, అధికారులు కూడా సుందరకాండ పారాయణం చేయాలంటారేమో! చోరుల కోసం వారాలు, నెలల తరబడి ప్రయాసలు, పట్టుకుని ఉతకడాలు, కసరత్తులు వీటితో పనేలేదు. సిసి కెమెరాలు, వేలి ముద్రల సేకరణ, పోలీసు కుక్కల వాసనల ప్రక్రియలు శుద్ధ నిరర్థకమేమో! ఎంతటి గుడ్డి నమ్మకాలండీ!

గర్భంలో కొలువైన శివుల సంగతి సరే, భూమ్మీద పడిన వారికి ఫలితాన్ని ఇవ్వదా! ఈ మంత్ర రాజం. లక్షలు ఖర్చు చేసే తల్లిదండ్రులు, రాత్రి పగలుకు తేడా తెలియకుండా విద్యార్థులను రుబ్బురోలులో వేసితిప్పే కార్పొరేట్ విద్యా సంస్థలు ఎందుకండీ! ఇంతటి ఆయాసం తట్టుకోలేక ఆత్మహత్యలకు పాల్పడి ఉసురుతీసుకుంటున్నారు విద్యార్థులు.

చూస్తూనే ఉన్నాం కదా! అధిగమించడానికి మంత్రాలు చదువుకుంటూ కూర్చుంటే సరిపోతుందేమో! ఇంత ప్రయాస పడినా విద్యార్థుల ర్యాంకుల్లో ఎంతెంత వ్యత్యాసం కనిపిస్తుంది. బాసర సరస్వతి ఆలయంలో విద్యాభ్యాసం చేయిస్తే చదువులో బాగా రానిస్తారు. వసంత పంచమినాడు సరస్వతీ పూజతో మేధావులవుతారు. నిజంగా ఇలా చేసినవారు అవుతున్నారా/అనవసరం. అలాంటి దుష్ట ఆలోచన చేయకూడదంటారు మన వైశిష్టులు.

విశ్లేషణ, విచారణ, శోధన పనికేరావు. అమ్మో! దోషం. ఇట్లా ఉంది మన సమాజతీరు. పుష్కరాల్లో మునకలేస్తే కోట్ల జన్మల పాపాలు పరిహారమౌతాయి. పూర్ణ ఆరోగ్యం ప్రాప్తిస్తుంది అని ప్రచారం. ఆరోగ్యం ప్రాప్తించడమేమో, రోగాలు అంటుకుంటాయని వైద్యులు నెత్తినోరు బాదుకున్నారు. అయినా మనం లక్ష్యపెట్టం. ఉద్రేకపడి 28 ప్రాణాలను గోదావరి పుష్కరాలకు బలిపెట్టాం. ప్రాణాలు నిలుపవలసిన పుష్కరాలు ఆయువు కబళించడమేమిటి? అడగవద్దు. మతద్రోహి, ఆపై దేశ, దైవ ద్రోహి అని కూడా ముద్రవేస్తారు.

నాకు తెలిసిన ఒక పౌరోహితుడున్నాడు. చాలా నిష్ఠా గరిష్టుడు. ఆచారాలు, సాంప్రదాయాలు నిక్కచ్చిగా పాటించే వ్యక్తి. బ్రహ్మ ముహూర్త వేళకే మేల్కొని అనుష్టానం పాటిస్తాడు. ఏరోజూ పూజలు, వ్రతాలు చేస్తుంటాడు. చేయిస్తాడు. తను అంగీకరించిన పూజలు, వ్రతాలు ముగిసేవరకు ఏ వేళైనా సరే ముద్ద ముట్టడు. చెప్పాలంటే వృత్తి ధర్మం పాటించడంలో విలువలతో వ్యవహరించేవాడు.

ఇదే కొంపముంచింది. వేళకు ఆహారం లేకపోవడం మూలంగా యాభై దాటకుండానే రెండు కిడ్నీలు కోల్పోయాడు. నెలల వ్యవధిలోనే చికిత్స నిమిత్తం సుమారు రు. 10 లక్షలు హారతి కర్పూరంలా తగల బడింది. బాధ భరించలేక నాగార్జున సాగర్ కాల్వలోకి దూకి ఆత్మహత్యకు పాల్పడ్డాడు. ఆత్మహత్యలు మహా పాతకమని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. తెలిసినవాడే ఎందుకు ఈ అకృత్యానికి పాల్పడినట్లు? ఆయనను ఈ దైవారాధనలు ఎందుకు రక్షించలేకపోయినట్లు? ప్రశ్నించకూడదు సుమా!

శత్రువులపై విజయం పొందడానికి సుదర్శన యాగం నిర్వహించమని పండితులు చెపుతుంటారు. పరస్పర శత్రువులిరువురూ ఈ యాగం చేస్తే విజయం ఎవరిని వరిస్తుంది. ప్రశ్నించకూడదు. తప్పు. నాస్తికత్వం, హేతుతత్వం అని దాడులు కూడా చేస్తారు గ్రంథ స్వాములు.

మనకు ఏనాడో బ్రహ్మాస్త్రం, పాశుపతాస్త్రం, వాయవ్యాస్త్రం, నాగాస్త్రం ఇత్యాది అస్త్రాలనేకం ఉన్నాయి. ఈ బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించే రాముడు రావణుని సంహరించాడు. కురుక్షేత్ర మహా సంగ్రామం సందర్భంలో గురుద్రోణ పుత్రుడు అశ్వత్థామ మంత్రించి చదివిన బ్రహ్మాస్త్రం అభిమన్యు భార్య ఉత్తర గర్భంలోని పరిపక్కానికి రాసి పిండాన్ని దూసిపడేసింది. ఎట్టి పరిస్థితుల్లో లక్ష్యాన్ని చేరుకోవడం ఈ అస్త్రం ప్రాశిస్త్యం. బాగానే ఉంది, నమ్ముదాం. తరచూ సరిహద్దు ఉల్లంఘనలకు పాల్పడి చీకటి దాడులు, మెరుపు దాడులు చేస్తూ శిబిరాల్లోని మన సైనికులను, సాధారణ పౌరులను బలిగొంటున్న పాకిస్తాన్ సైనికులపై వీటిలో ఏ ఒక్క అస్త్రాన్నైనా ప్రయోగించి శత్రు వర్గాల పీచమనచరేంది?

గతంలో 9 ఏళ్ల చంద్రబాబు పాలనలో వరుసగా ఐదేళ్లు రాష్ట్ర వ్యాప్తంగా వర్షాలు మృగ్యమై రాష్ట్రం తీవ్ర దుర్భిక్ష్యాన్ని చవిచూసింది. అదిగతం. ఇప్పుడు మళ్లీ ఆయన పాలనలోనే ఉంది విభజిత ఏపి. మూడేళ్లుగా సాధారణ వర్షపాతానికి తక్కువై ప్రాజెక్టుల రిజర్వాయర్లు నిండుకుంటున్నాయి. సాగునీరు రాక మాగాణి భూములన్నీ బీళ్లుగా మారాయి. ఒక్క వారుణాస్త్రాన్ని సంధించి రాష్ట్రాన్ని వర్షాలతో ముంచెత్తవచ్చు కదా! అడగకూడదు. అడ్డదిడ్డం అంటారు. వితండవాదన అవుతుంది.

ఎప్పటి నుండో నేనో సందేహాత్మకుడనై ఉన్నాను. ఈ భూమిపై చాలా దేశాలలో మైనస్ డిగ్రీల శీతోష్ణ స్థితి కలిగిన ప్రాంతాలున్నాయి. పాపం అక్కడి ప్రజలు ఆ చలికి నానా యాతనలు అనుభవిస్తున్నారు. జీవనం గడ్డుగా ఉంటుంది. ఇంటి నుండి వెలుపలికి వెళ్లాలంటేనే ఎంతో జాగ్రత్త వహించవలసి ఉంటుంది. ఈ ప్రాంతాలన్నింటినీ సమశీతలానికి చేర్చే మంత్రాలు, యాగాలు, యజ్ఞాలు, అర్చనలు ఉంటే గొప్పగా ఉండేది.

నార్వే దేశంలో రోజులో కేవలం 53 నిమిషాలు మాత్రమే చీకటి అలుముకుంటుంది. మిగిలిన 23 గంటలూ సూర్యుడు తిష్టవేసుకునే ఉంటాడు. అక్కడి ప్రజలు సమయం ప్రకారం నిద్రపోతూ విశ్రాంతి పొందుతారట. భారత్ మాదిరిగా ఆ దేశానికి కూడా 12 గంటలు పగలు, 12 గంటలు రాత్రి మార్పు చెందే విధంగా ఏమైనా అర్చనలుంటే ఆ దేశస్థులు సంతోషిస్తారు.

మంత్రాలు, యాగాలు, యజ్ఞాలు, అర్చనలు, పూజలు ఏ విధంగా లబ్ధి చేకూరుస్తాయో ప్రచారం గావించే వర్గీయుల ఆచరణలో ఈ భావనలు అగుపించవు. నా దృష్టికి వచ్చిన ఒక ఆధ్యాత్మిక కార్యక్రమాన్ని ఇందుకు ఉదాహరణగా మీ ముందుకు తెస్తాను. ఇటీవల జరిగిన హనుమజ్జయంతి ఉత్సవాలను పురస్కరించుకొని 12 నదుల తీర్థకలశాల ప్రదర్శనొకటి చూశాను. సుమారు రెండు కిలోమీటర్ల పొడవునా ఈ ప్రదర్శన నడిచింది. ఇందులో రెండు వేల ఏడు వందల మంది మహిళా భక్తులు కలశాలను శిరస్సుపై ధరించి వెళ్లారు. ఈ కలశాల తీర్థాలన్నీ కలగలిపి ఆంజనేయస్వామి విగ్రహానికి అభిషేకం నొనరించారు.

ఈ దైవ కార్యక్రమంలో పాల్గొనడం ద్వారా మోక్ష, పుణ్యాలు ప్రాప్తిస్తాయని గొంతెత్తి ప్రచారం గావించే వైదిక కుటుంబాల స్త్రీలు మాత్రం ఈ 2700 మంది భక్తురాండ్రలో ఒక్కరూ అగుపించలేదు. అంటే ఇక్కడ మనకు వచ్చే సందేహాలేమంటే! మోక్షం, పుణ్యం ఆయా బ్రాహ్మణ కుటుంబాల వనితలకు అవసరం ఉండదా! మరొకటేందంటే! నారీలోకానికి పరిమితమైన ఈ కార్యక్రమం పురుషులను ఎందుకు భాగస్వామ్య మొనరించలేదు? పురుషులకు మోక్ష, పుణ్యాలు ఆవశ్యకత ఉండదా! పుణ్య తీర్థాల కలశాలు పురుషులకెందుకు పనికిరావు. సమాధానం లేని సంశయాలు.

ఇటువంటి సందేహాలు ఎవరికీ రాకూడదు. ఇటువంటి సంశయాలు ఎవరికి వచ్చినా, అది నాస్తికవాదం హేతువాదం అవుతుంది. సంస్కృతి, ఆచారాలకు గొడ్డలిపెట్టు అవుతుంది. అంతకన్నా కూడా అది జాతిద్రోహ మవుతుంది. అసలు మనం ఎక్కడున్నాం. ఎటు ప్రయాణిస్తున్నాం. ఎంతకాలం ఈ ధోరణి. అభివృద్ధికర మార్గంలో ప్రయాణిస్తున్నామా. తిరోగమనంలోకి జారుకుంటున్నామా.

ప్రపంచ దేశాలనేకం వైజ్ఞానికంగా పరుగులు పెడుతుంటే, మనం విశ్వాసాల మూకుడులో పేలాల్లా వేగుతున్నాం. రాజ్యాంగం ఒకవైపు డప్పుకొట్టి చెపుతున్నా మన పాలకుల వైఖరిలో ఏమాత్రం మార్పు రావడం లేదు. విద్యా, సామాజిక, రాజకీయ, పాలనా వ్యవస్థలలో పరిశోధనల దిశవైపు తలతిప్పే యోచనే చేయడం లేదు. ప్రయత్నాలే లేనిచోట ఫలితాలు ఎట్లా ఆశించగలం. ఆలోచనే చేయని నేలలో ఆచరణ ఎట్లా కోరుకుంటాం.

నేటికీ మన చదువులన్నీ గుమస్తాగిరి విధానంలోనే నడుస్తున్నాయి. బట్టీయంలో విషయాన్ని ముక్కున పెట్టుకెళ్లి కాగితాలు నింపే పరీక్షా విధానమే పరిఢవిల్లుతుంది. శోధన, సాధన మార్గాలే లేవు. సాఫ్ట్‌వేర్ అయినా, హార్డ్‌వేర్ అయినా గుమస్తా స్థానాలే దక్కుతున్నాయి. ఇతరులెవరో కనుగొని రూపొందించిన వస్తువులనే వినియోగించుకుంటూ పరాన్న బుక్కుల్లా మారిపోతూ కూడా, మనమే గొప్పంటూ తొడలు గొట్టి, మీసాలు మెలేస్తున్నాం. ఈ నేపథ్యంలో ఇప్పుడు ప్రచారంలోకి వచ్చిన 'గర్భ సంస్కార్' అంధ విశ్వాసమే అవుతుంది.

*(రచయిత గౌరవాధ్యక్షులు, గుంటూరు జిల్లా రచయితల సంఘం)* వీ

*పాఠకులు ఫిర్యాదులు, సమాచారం కోసం వీక్షణం కార్యాలయానికి పనిదినాల్లో ఉదయం 10:30 నుండి సాయంత్రం 6.00 గంటలలోగా స్వయంగా లేదా ఫోన్ ద్వారా సంప్రదించవచ్చు. మిగతా సమయాల్లో ఫోన్ చేస్తే అది ఫ్యాక్స్‌లోకి వెళ్లి మీకు జవాబు రాదు. అప్పుడు మీరు ఫోన్ ఎత్తికూడా మాట్లడడంలేదని అనుకునే అవకాశం ఉంది. ఇది గమనించగలరు. – సం.*

# కొత్త యంత్రాలు ఎలా ప్రవేశిస్తాయి?

***కార్మికుల శారీరక శ్రమ, మేధావుల మేధస్సు, శాస్త్రవేత్తల నూతన ఆవిష్కరణలు అన్నీ పెట్టుబడిదారీ సమాజంలో లాభాల కొరకేననీ, ఈ దశలో కొత్త యంత్రాల ఆవిష్కరణ ఈ లాభాలను ఇంకా పెంచేందుకేననీ అంటున్నారు వి.వెంకట్రావు***

ఒక యజమాని లేని కంపెనీ ఉంది. అందులో ఒక వంద మంది కార్మికులు రోజుకి ఎనిమిది గంటల చొప్పున అందరూ సమానంగా పని చేస్తున్నారు. అయితే...ఇంకా తక్కువ పని గంటల్లో అదే ఉత్పత్తిని తయారు చెయ్యడం ఎలా? వారానికో, రెండు వారాలకో అందరూ ఒక పెద్ద హాల్లో కూర్చొని చర్చించుకుంటారు. అందరి ఆలోచనలూ, అనుభవాలూ ఒక దగ్గర పెట్టి చర్చిస్తారు. చేస్తున్న పనిలో ప్రమాదాలు వస్తే ఎలా నివారించుకోవాలి.

ఇంకా సులువైన పద్ధతులు ఏమైనా ఉన్నాయా? పనిగంటలు ఇంకా ఎలా తగ్గించుకోవాలి? చేస్తున్న యంత్రాలకి రిపేర్లు వస్తే ఎలా బాగుచేసుకోవాలి? అక్కడ యంత్రాలకి రిపేర్లు వస్తే, ఇంజనీర్లు వేరేగా ఉండరు. వాళ్లు కూడా అక్కడ కార్మికుల్లో భాగస్తులే. అందుకే అందరి ఆలోచనలూ ఒకచోట చేరాయి. అలాంటి సందర్భాలలోనే అనేక మంచి విషయాలు తెలుస్తాయి. అలాంటి ఆలోచనల నుండే కొత్త యంత్రాలు ప్రవేశిస్తాయి. ఇది సహజమైన పద్ధతి. కొత్త యంత్రాలు ఇలాగే సమాజంలోకి రావాలి. సహజమైన, న్యాయమైన మార్గం ఇది. అయితే ఇది సుదీర్ఘమైన కల.

అయితే పెట్టుబడిదారీ సమాజాల్లో సహజమైన మార్గం ఏదీ ఉండదు. అంతా తల్లకిందుల గానే ఉంటుంది. కానీ... ఇక్కడ కూడా కొత్త యంత్రాలు ప్రవేశిస్తూనే ఉంటాయి. ఎలా ప్రవేశిస్తాయి? దేశం సాంకేతికంగా బాగా వెనకబడిపోయింది కాబట్టి, దాన్ని ముందుకు తీసుకువెళ్లాలి కాబట్టి, కొత్త యంత్రాలని ప్రవేశపెడతారా? అవి ప్రభుత్వపరంగా జరిగే ప్రయత్నాలు. ఇక్కడ చర్చ అదికాదు. పెట్టుబడికి... యంత్రాలను ప్రవేశపెట్టక తప్పని, అనివార్య పరిస్థితులు ఎదురవుతాయి. ఏమిటా అనివార్య పరిస్థితులు? ఆ విషయాలను చర్చించడమే ఈ వ్యాసం ఉద్దేశం.

అన్నీ వస్తువులకీ ప్రతినిధిగా సబ్బుని తీసుకుందాం. సబ్బులు తయారు చేసే కంపెనీ ఉందనుకుందాం. అందులో ఒక వందమంది పని చేస్తున్నారు. రోజుకి ఐదువేల సబ్బులు తయారవుతున్నాయి. ఇవన్నీ ఉదాహరణ కోసం లెక్కలే. ఏ వస్తువు తయారవ్వాలన్నా...ముడి పదార్థాలూ, పనిముట్లూ, కార్మికులు ఉండాలి. ఇక్కడ మనం ఉత్పాదక శ్రామికుల గురించే మాట్లాడుతున్నాం. ఆఫీసుల్లో పనిచేసే అనుత్పాదక శ్రామికుల గురించి మాట్లాడడం లేదు.

రోజూ సబ్బులు తయారవుతుండడం, తయారయిన సబ్బులన్నీ, అమ్ముడయి పోతుండడం, లాభాలు వస్తుండడం... ఇలా కాలం జరిగిపోతూ ఉంటే ఏ గొడవా ఉండదు. కానీ... సరుకుల అమ్మకాలనేవి అంత సులువుగా అమ్ముడైపోవు. ఈ అమ్మకాల కోసం డిస్కౌంట్లూ, ఒకటి కొంటే ఒకటి ఫ్రీలు ఇలాంటివి చాలా ఉంటాయి. దానికి తగిన తిప్పలు దానికి ఉంటాయి. అది అలా ఉంటే...పోటీగా ఇతర పెట్టుబడిదార్లు కూడా ఉంటారు. మన మొదటి పెట్టుబడిదారుడి లాభాలు చూసి ముచ్చటపడి, వాళ్లూ తయారు చేయిస్తారు. అలాగే మరికొందరు, కొత్త, కొత్త కంపెనీలు ప్రారంభిస్తారు. ఆ సబ్బులూ, ఈ సబ్బులూ అన్ని రకాల సబ్బులూ మార్కెట్లో ఉంటాయి.

దాంతో సబ్బుల అమ్మకాలు కచ్చితంగా మందగిస్తాయి. ఎందుకు మందగిస్తాయి అంటే... ప్రజలు అవసరం మేరకే కొంటారు గానీ... అవసరాన్ని మించి కొనరు. ఒక కుటుంబానికి నెలకు ఐదు సబ్బులు అవసరం అనుకుందాం. అయిదే కొంటారు. ఆ కంపెనీ కాకపోతే, మరో కంపెనీ, అదీ కాకపోతే మూడో కంపెనీ. అంతే తప్ప, నెలకి ఆరేడు సబ్బులు కొనరు.

ఒకవేళ ఏ సినిమా తార అయినా 'నా ఒంటి నిగనిగలకి పలానా సబ్బే కారణం' అని ప్రకటనల్లో ఇచ్చినా...ఒంటి మీద బట్టలు లేని ఆ సినిమా తార ఒంపుసొంపుల్ని చూసి ముచ్చట పడి, మరో సబ్బు ఎగస్ట్రా కొన్నా మరుసటి నెల తగ్గించి కొంటారు. ఏ సరుకుల అమ్మకలకైనా ఒక పరిమితి ఉంటుంది. అది ఆ దేశ జనాభా అవసరాల్ని బట్టి ఉంటుంది.

అయితే పెట్టుబడిదారీ కంపెనీలకి ఈ దేశం ఆ దేశం అని ఉండదు. ఎక్కడ అమ్మకాలు ఉంటే అక్కడకి వెళ్తాయి. కుదరదు గానీ, కుదిరితే.. చంద్ర మండలం మీద అమ్మకాలు ఉంటే.. అక్కడకి కూడా వెళ్తాయి. అయితే ప్రపంచ జనాభాకి మాత్రం పరిమితి ఉండదా? జనాభాకి పరిమితి ఎక్కడైనా ఉంటుంది. కాబట్టి అమ్మకాలు ఒక దగ్గర ఆగిపోతాయి. పెట్టుబడిదారీ వ్యవస్థలో సరుకుల ఉత్పత్తికి ప్లానింగు ఉండదు.

ఆయా సరుకులన్నీ ఒక దానితో ఒకటి ఘర్షణ పడుతూ, పోటీ పడుతుంటాయి. ఇక్కడ అంతా ఎవరి మార్కెట్ వెతుకులాట వాళ్లదే. ఎవరి అమ్మకాల తాపత్రయాలు వాళ్లవే. 'మిగతా వాళ్ల సంగతి మనకి అనవసరం. మనం ఎలా అమ్మకాలు పెంచుకోవాలి' అని ఆలోచిస్తారు.

అలాంటి సందర్భాలలో ఒక ఆలోచన వస్తుంది. మిగతా సబ్బుల కన్నా కాస్త ధర తగ్గించడం. ధర తగ్గిస్తే అమ్మకాలు పెరిగే మాట నిజమే. కానీ... ధర తగ్గించడం ఎలా? నాణ్యత తగ్గిస్తే ధర తగ్గుతుంది. కానీ... నాణ్యత తగ్గడం వలన అమ్మకాలు కూడా తగ్గుతాయి. సమస్య మళ్లీ మొదటికొస్తుంది. అది కాదు మార్గం. నాణ్యతని అలాగే ఉంచి, మిగతా

సబ్బుల కన్నా కాస్త ధర తగ్గించడం ఎలా? లాభాలు తగ్గించుకుంటే కూడా ధర తగ్గుతుంది. కానీ...అది అస్సలు ఇష్టం ఉండదు. భాషలో అతనికి నచ్చని ఒకే ఒక్క వాక్యం 'లాభాలు తగ్గించుకోవడం' కాబట్టి, అక్కడ మాత్రం అస్సలు రాజీ ఉండదు.

మరి ఎలా? సరుకు తయారికి అవసరమైన ఇతర ఖర్చుల గురించి ఆలోచిస్తాడు. మొదటిది ముడి పదార్థాలు... అది తగ్గించడం కుదరదు. రెండు శ్రమ పరికరాలు అదీ తగ్గించడం కుదరదు. వీటి ధరల్లో హెచ్చు తగ్గులు వస్తే... సబ్బు ధర కూడా హెచ్చుతగ్గులు వస్తుంది. అయినా, అది అన్ని కంపెనీలకూ వర్తిస్తుంది. ఇక మూడోది. కార్మికుల జీతాలు. అవి తగ్గించాలి. తగ్గిస్తే మంచిదే. కానీ కార్మికులు ఒప్పుకోరు. ఇప్పటికే సమ్మెలూ, ధర్నాలూ, వినతిపత్రాలూ అంటున్నారు. ఇలాంటప్పుడు జీతాలు పెంచకపోతే పెంచకపోవచ్చు గానీ... తగ్గించడం మాత్రం కుదరదు.

అదే జీతాలతో, అదే పని గంటలతో... ఎక్కువ ఉత్పత్తి సాధించ గలిగితే... రోజుకి ఐదువేల సబ్బులు తయారయ్యే పని గంటల కాలంలో పది వేల సబ్బులు తయారయితే.. అప్పుడు సగటున ఒక్కో సబ్బు ఉత్పత్తి ధర తగ్గుతుంది. దాన్నిబట్టి అమ్మకం ధర కూడా తగ్గుతుంది. అప్పుడు ఇతర కంపెనీల కన్నా, కాస్త తక్కువ రేటుకి ఇవ్వవచ్చు. అలా ఉత్పత్తి పెరిగితే... లాభాలు తగ్గవు, పైగా పెరుగుతాయి కూడా. ఇదీ ఆలోచన. అలాంటి ఆలోచనల నుండి పుట్టుకొచ్చినవే కొత్త యంత్రాలు.

కొత్త యంత్రాల రాక వలన పెట్టుబడిదారుడికి రెండు లాభాలు. ఒకటి ఉత్పత్తి పెరుగుతుంది. అవే పని గంటలు కాబట్టి, జీతాలు ఎక్కువ ఇవ్వనక్కరలేదు. సగటున ఉత్పత్తి ధర తగ్గుతుంది కాబట్టి, అమ్మకం రేటు తగ్గించవచ్చు. అందువల్ల అమ్మకాలు పెరుగుతాయి. రెండు కార్మికులు గతంలో పని చేసినంత మంది అక్కరలేదు. దానివలన తక్కువ మంది కార్మికులతోనే ఎక్కువ ఉత్పత్తి సాధించవచ్చు. అందువల్ల లాభాలు మరింత పెరుగుతాయి. అయితే కొత్త యంత్రం రాక వలన దాని నిర్వహణా, దాని మీద పని చెయ్యడం కార్మికునకు కొత్త కాబట్టి, కొంత ట్రైనింగ్ కూడా అవసరం అవుతాయి. దాని వలన ఖర్చు పెరుగుతుంది. అంతే కాకుండా అదనపు పెట్టుబడి కూడా అవసరమవుతుంది. కానీ..అది కొంత కాలం మాత్రమే.

యంత్రాలను పెట్టుకోవడం వలన, యంత్రాలు ధర్నాలు చెయ్యవు. జీతాలు పెంచమనీ, సెలవలు కావాలనీ అడగవు. అదనపు పనికి అదనపు జీతం అడగవు. నోరుమూసుకొని స్విచ్ నొక్కితే తిరుగుతాయి. కాబట్టి యంత్రలవైపే మొగ్గుతాడు. వాటి నిర్వహణకు అదనపు భారం అయినా, పెరిగిన ఉత్పత్తి వలన రాబోతున్న లాభాలతో పోలిస్తే, ఈ ఖర్చులు లెక్కలోనివి కావు.

అయితే...ఈ మాత్రం తెలివితేటలు ఇతర కంపెనీ యజమానులకు లేవా? అంటే, ఉంటాయి గానీ.. కొన్నాళ్లపాటు అమ్మకాలు పెరుగుతాయి కదా!

ఇక్కడ మనం విషయాన్ని అర్థం చేసుకోవడానికి, ఐదువేల సబ్బుల ఉత్పత్తి, పదివేలుకి పెరిగింది అని అంటున్నాం గానీ...వాస్తవానికి అది ఇంకా ఎక్కువగా ఉంటుంది. యంత్రాలరాక వలన ఉత్పత్తి ఎలా పెరిగిందో, కార్మికుల సంఖ్య ఎలా తగ్గిందో ఈ కొటేషన్ చూడండి.

'మాన్యుఫాక్చర్ శ్రమ విభజనతో, 10 మంది మనుషులు, ఒక రోజులో, 48 వేల కుట్టు సూదులు చేసేవారు. అంటే, ఒక్కొక్క మనిషీ సుమారుగా రోజుకి 5 వేల సూదులు. తర్వాత కాలంలో వచ్చిన సూదుల్ని తయారుచేసే యంత్రం (నీడిల్ మేకింగ్ మెషిన్) 11 గంటల పని దినంలో, 1 లక్షా 45వేల సూదులు చేస్తుంది. అలాంటి యంత్రాన్ని నాలుగింటిని చిన్నపిల్లవాడు కూడా నడపవచ్చు.

అంటే, ఆ మిషన్ మీద, ఒక మనిషి రోజుకి దాదాపు 6లక్షల సూదులు చెయ్యవచ్చు. ఒక మనిషి రోజుకి 5 వేలు ఎక్కడా! 6 లక్షలు ఎక్కడ! ఉత్పాదక శక్తి 120 రెట్లు పెరిగింది.' (కాపిటల్, పేజి నెం,394, రంగనాయకమ్మ పరిచయం)

మరొక ఉదాహరణ – '1778లో జిన్నింగు మిషను కనిపెట్టారు. అంతకు పూర్వం, ఒక పౌను పత్తి నుండి గింజ తీయడానికి సగటున ఒక మనిషికి, ఒక రోజంతా పట్టేది. కానీ, జిన్నింగు యంత్రం వచ్చిన తర్వాత, దానితో ఒక నీగ్రో స్త్రీ రోజుకు వంద కిలోల పత్తి నుండి గింజలు తీసి శుభ్రమైన దూదిని తయారు చేయగలదు. అప్పటి నుండి జిన్నింగ్ యంత్రపు సామర్థ్యాన్ని ఇంకా పెంపొందించడం జరుగుతూ వచ్చింది.' (కాపిటల్, మొదటి భాగం 278, 279, అరవిందా పబ్లిషర్స్)

ఈ రెండు కొటేషన్ల వలన ఏం తెలుస్తుంది అంటే...వస్తు ఉత్పత్తి అనేక రెట్లు పెరుగుతుంది. అదే సమయంలో కార్మికశక్తి తగ్గుతున్నది. సగటున వస్తువు ధర తగ్గుతుంది.

'సరుకును చౌకగా ఉత్పత్తిని చేయడం కోసమే యంత్రాలను ఉపయోగించడమనే లక్ష్యానికి ఈ విధంగా పరిమితులున్నాయి. ఒక యంత్రాన్ని ప్రవేశపెట్టినందు వల్ల తొలగించబడిన శ్రామిక శక్తికంటే, తక్కువ శ్రామిక శక్తితోనే ఆ యంత్రం ఉత్పత్తి చేయగలిగి ఉండాలి.' (కాపిటల్ మొదటి భాగం, అరవింద్ పబ్లిషర్స్, పేజీ నెం. 280)

ఇక్కడ తక్కువ శ్రామిక శక్తి అంటే.. తక్కువ మంది కార్మికులతోనే పూర్తి ఉత్పత్తి గానీ...అంతకంటే ఎక్కువ ఉత్పత్తి గానీ సాధించగలిగి ఉండాలి. ఈ మాటలకి అర్థం... ఒక కొత్త యంత్రం తీసుకురావడం వలన ఎంత మంది కార్మికులనైతే తొలగిస్తాడో, అంత మంది చేతులతో చెయ్యడం వలన లేదా చిన్న శ్రమ పరికరాల మీద ఎంత సరుకును ఉత్పత్తి చెయ్యగలుగుతారో, అంత సరుకుని లేదా అంత కంటే ఎక్కువ సరుకుని ఉత్పత్తి చెయ్యగలిగినప్పుడు మాత్రమే కొత్త యంత్రాన్ని తెప్పిస్తాడు. అలా కాకపోతే కొత్త యంత్రం జోలికి పోడు.

ఇక్కడ ఒక విషయం ఆలోచించాలి. పెట్టుబడిదారుడుకి ఇలాంటి పరిస్థితులు ఎదురవ్వకపోతే...అంటే వస్తువు ధరని తగ్గించే మార్గం మరో విధంగా ఎదురయ్యిందనుకుందాం. అప్పుడు కొత్త యంత్రాల రాక జరగదా...? జరగదు. ఉదాహరణకి కార్మికులకు ఇస్తున్న జీతాలు సగం తగ్గించాడనుకుందాం. దానికి కార్మికులు కూడా ఒప్పుకున్నారనుకుందాం. అప్పుడు కూడా ఉత్పత్తి ధర తగ్గి, వస్తువు ధర తగ్గుతుంది. అలా అయితే... కొత్త యంత్రాల పని అస్సలు పెట్టుకోడు. ఆ తలనొప్పి అంతా పడలేదు.

కానీ...వాస్తవంగా అలా జరగదు. ఎందుకంటే... కార్మికుల జీతాలు ఎప్పుడూ అంతంత మాత్రం గానే ఉంటాయి. అయితే.. పెంచకపోవచ్చు గానీ తగ్గించడం మాత్రం కుదరదు. అరుదుగా జీతాల్లో కోతలు కూడా ఉండవచ్చు.

అయితే పెట్టుబడిదారుడుకి, అస్సలు జీతాలు తీసుకోకుండా పనిచేస్తే సంతోషమే. కానీ... మనుషులు బతకాలి కదా! అందుకే ఆ మాత్రం జీతాలు ఇవ్వక తప్పదు. మానవ శ్రమ అత్యంత చవకగా దొరికే సందర్భాలలో నూతన ఆవిష్కరణలు ఆగిపోయి...ఆలస్యం అయిన సందర్భాలు కూడా చరిత్రలో జరిగాయి.

ఈ కొటేషన్ చూడండి – 'అమెరికన్లు రాళ్లను పగలగొట్టే యంత్రాలను కనిపెట్టారు. ఇంగ్లండు ఆ యంత్రాలను ఉపయోగించుకోలేదు. ఎందుకంటే, ఆ పని కోసం వినియోగపడే వ్యవసాయ కార్మికునికి, శ్రమని తక్కువ కాలం ఉపయోగించుకొని, తక్కువ ప్రతిఫలం పెట్టుబడిదారు చెల్లిస్తాడు. అందువల్ల అలాంటి శ్రామికునికి బదులుగా యంత్రాన్ని ప్రవేశపెట్టటం వలన పెట్టుబడిదారునకి ఉత్పత్తి వ్యయం అధికమౌతుంది.

ఇంగ్లండ్‌లో కాలవలో పడవలను లాగడానికి గుర్రాలకు బదులు స్త్రీలను ఉపయోగించడం ఇప్పటికీ కొన్ని సందర్భాలలో జరుగుతూనే ఉంది. ఎందుకంటే, గుర్రాన్నిగాని, యంత్రాన్ని గాని తయారు చేయడానికి అయ్యే ఖర్చు ఇంత అని తెలుస్తుంది. కాని, అధిక జనాభాగా ఉన్న స్త్రీలను ఆ పనికి ఉపయోగించు కోవడం చాలా చవుక. యంత్రాలకు నిలయమైన ఇంగ్లాండులో కంటే, ఎక్కువ సిగ్గు చేటయిన విధంగా మానవ శ్రమశక్తిని, అత్యంత శోచనీయంగా ఉపయోగించుకోవడం మరెక్కడా చూడం.' (కాపిటల్, మొదటి భాగం, పేజి 281,282, అరవిందా పబ్లిషర్స్)

ఇక్కడ జరిగినదేమిటి రాళ్లను పగలగొట్టే యంత్రాలు పరిచయం అయినా సరే, దాన్ని ఉపయోగించుకోలేదు. ఎందుకంటే.... చవుకగా మానవ శ్రమ దొరుకుతున్నది. మరొక ఉదాహరణ. ఆవిరి యంత్రం ఎవరు కనిపెట్టారు? అంటే జేమ్స్ వాట్ అని చిన్న పిల్లవాడిని అడిగినా చెబుతాడు. గానీ...ఈ కొటేషన్ చుడండి.

'జేమ్స్ వాట్ కంటే 20 ఏండ్లు ముందే, ఇవాన్ పోల్జు నావ్ అనే రష్యన్ ప్రగ్యా శాలి, మరొక రకమైన ఆవిరి యంత్రాన్ని సృష్టించినాడు. ఆ యంత్రం బాగానే పనిచేసేది. కానీ దాస్య వృత్తి అమలులో ఉండిన ఆనాటి రష్యాలో, శారీరక శ్రమ చౌకగా ఉండేది. కాబట్టి, అనేక సంవత్సరాలు గడిచిన తర్వాత గానీ అక్కడ ఆవిరి యంత్రం వ్యాప్తిలోకి రాలేదు.' (ఆధునిక చరిత్ర, ప్రగతి ప్రచురణలు, పేజి నెం,76)

ఇక్కడ జరిగినదేమిటి? ఆవిరి యంత్రం ఇరవై ఏళ్ల ముందే కనిపెట్టారు. కానీ... అంత మంచి రవాణా సాధనం. మానవ శ్రమనూ, జంతు శ్రమనూ విపరీతంగా తగ్గించిన సాధనం, ఇరవై ఏళ్లు మరుగున పడిపోయింది. ఎందుకంటే పెట్టుబడిదారుడి దృష్టిలో బానిస అయినా ఒకటే, జంతువు అయినా ఒక్కటే, యంత్రం అయినా ఒక్కటే. అతనికి కావలసింది సగటున వస్తువు ధర తగ్గడం.

వెతికి చూస్తే చరిత్రలో ఇలాంటి సంఘటనలు అనేకం ఉంటాయి. కొన్ని సంవత్సరాల పాటు నూతన ఆవిష్కరణలు ఆగిపోవడానికీ, ఆవిష్కరింపబడడానికి కూడా పెట్టుబడిదారీ వ్యవస్థే కారణం. దానికి కావలసింది మానవ క్షేమం కాదు. లాభాల క్షేమం. కార్మికుల జీతాల తోనూ, కనీస సౌకర్యాలతోనూ వాళ్లకు పనిలేదు. వాళ్లకు కావలసింది లాభాలూ... లాభాలూ... లాభాలూ...

18వ శతాబ్దంలో ఇంగ్లాండ్‌లో బొగ్గు గని కార్మికులు గని తవ్వుతుండగా హఠాత్తుగా పెద్ద పేలుడు సంభవించి 94 మంది చనిపోయారు. కారణం భూమి లోపలి పొరల్లో మిథేన్ అనే విషవాయువు విడుదల అయ్యి, దానికి కొవ్వొత్తి మంట తగిలి పేలుడు సంభవించిందని కనుకొన్నారు. ప్రాణ భయం వలన కార్మికులు ఎవ్వరు గని తవ్వమని అన్నారు అలాంటి సందర్భంలో బొగ్గు గని యజమానులు హంఫ్రి డేవి అనే శాస్త్రగ్నుడితో విషయాన్ని చెబితే అతను ప్రమాద రహితమైన దీపాన్ని కనుగొన్నాడు. ఆ దీపాన్ని డేవీ దీపం'(డెవిస్ లాంప్) అనేవారు. (నిప్పు కథ పేజీ నెం,63,64)

అంటే దీని అర్థం పెట్టుబడి దారులు కొన్ని అనివార్య పరిస్థితుల్లోనే నూతన ఆవిష్కరణలను ప్రోత్సహిస్తారు. అలా కాకుండా దేశం సాంకేతికంగా వెనకబడి ఉందని ప్రభుత్వం కొంత మంది శాస్త్రగ్నులను ప్రోత్సహిస్తుంది. అలాంటి వాళ్లకు పెద్ద జీతాలూ, ఇతర సౌకర్యాలు ఏర్పరుస్తుంది. అలా కూడా కొత్త ఆవిష్కరణలు జరుగుతాయి. అంతే కాకుండా కొంతమంది వ్యక్తిగత ఆసక్తి కొద్ది ప్రయోగాలు చేస్తారు. మేడం క్యూరీ దంపతులు నిరుపేద తనం అనుభవిస్తూ కూడా ఫిజిక్స్‌లో ఎన్నో కొత్తవి కనుగొన్నారు. అయితే ఇక్కడ గమనించవలసింది ఏమిటంటే... ఎవరు ఎలా కనుగొన్నా పెట్టుబడిదారీ సమాజాల్లో అవన్నీ పెట్టుబడుదారులకు అనుకూలంగానే ఉంటాయి. వాటిమీద హక్కులన్నీ పెట్టుబడి దారులకే వెళ్తాయి.

పుట్టు చెముడు అయిన తన తండ్రి మీద ప్రేమతో, చెవిటి మిషన్ కనిపెడదామని, అర్ధరాత్రి స్మశానంలోకి వెళ్లి, పాతి పెట్టిన శవాన్ని వెలికి తీసి, అనేక ప్రయోగాలు చేసాడు. ఆ ప్రయత్నంలో చెవిటిమిషన్ కనుక్కోలేకపోయాడు గానీ...టెలిఫోన్ కనుగొన్నాడు. అతనే గ్రాహంబెల్. కానీ...దాని మీద పూర్తి పేటెంట్ హక్కులు అతని మామ గారికి వెళ్లాయి. (టెలిఫోన్ కథ)

మరొక ఉదాహరణ 'థామస్ ఆర్మాట్ నాలుగేళ్ల పరిశోధనా ఫలితాన్ని, సాదరంగా, సర్వ హక్కులతో నామమాత్రం మొత్తానికి ధారదత్తం చేసాడు ఎడిసన్ కు. ఆర్మాట్ వద్ద సృజన ఉంది. ఎడిసన్ కు మార్కెట్ శక్తి, పెట్టుబడి ఉన్నాయి. పెట్టుబడి ముందు సృజన తల వంచ వలసిందే నాడూ, నేడూ. కొత్తగా చేజిక్కిన ప్రొజెక్టర్‌కు 'విటా గ్రాఫ్'గా పేరు పెట్టి, 1896, ఏప్రిల్ 23న న్యూయార్క్ కోస్టల్ అండ్ బయాల్ మ్యూజిక్ హాలులో తొలి ప్రదర్శన ఇచ్చాడు ఎడిసన్. అమెరికా పేటెంట్ సంస్థలో నమోదయిన రెండు మూవీ కెమెరాలలో ఒకటి అతని స్వంతం....ఫిల్మ్ వెడల్పు 35మిల్లీ మీటర్లుగా ఖరారు చేసింది ఆయనే.'(సినిమా గా సినిమా, రచన; నందగోపాల్... పేజి,12)

పెట్టుబడిదారీ సమాజాల్లో శాస్త్రవేత్తల మేధా సంపత్తి అంతా, పెట్టుబడిదారులకు అనుకూలంగానే ఉంటుంది అనే విషయాన్నీ పై రెండు కొటేషన్లు రుజువు చేస్తున్నాయి. కార్మికుల శారీరక శ్రమా, మేధావుల మేధా శ్రమా, శాస్త్రవేత్తల నూతన ఆవిష్కరణలు అన్నీ కూడా పెట్టుబడిదారీ సమాజాల్లో, పెట్టుబడిదారులకు లాభాలు సమకూర్చి పెట్టడానికే ఉపయోగపడతాయి. కొత్త యంత్రాల ప్రవేశం గురించి నా అవగాహన మేరకు రాసాను. ఇతర కారణాలు కూడా ఉంటే ఉండవచ్చు.

*(రచయిత దర్జీ)* వీ

# 'తెలంగాణొస్తే ఏమొచ్చింది?' - ఆలోచించాల్సిన కొన్ని విషయాలు

**- ఎం. కృష్ణ ఆదిత్య**

'తెలంగాణొస్తే ఏమొచ్చింది?' అన్న శీర్షికతో సంపాదకుడు ఎన్.వేణుగోపాల్ వీక్షణం, ఆగస్టు 2018 సంచికలో ఒక ముఖ్యమైన వ్యాసం రాశారు. స్థల పరిమితులు దృష్ట్యా ప్రధానమైన అంశాలను స్థూలంగా మాత్రమే చర్చించారు. ఈ సందర్భంగా గమనించాల్సిన ఒకటి రెండు విషయాల ప్రస్తావన ఇది:

1. 'ఉమ్మడి రాష్ట్ర పాలనలో తెలంగాణ ప్రజానీకం తమ పౌరహక్కులను ఎన్నడూ సంపూర్ణంగా అనుభవించలేదు. 1968-69 నుంచి ఆ స్థితి మరింత దిగజారింది' - అని పౌరహక్కుల స్థితిని ప్రస్తావించారు. ఆనాటి కన్నా 'ఇంకా దిగజారిందని' రాసింది నిజమే. కానీ ఇక్కడొక లోపం ఉంది. దేశమంతటా ఉన్న పోలీసు - మిలటరీ రాజ్యంలో భాగంగానే అది అమలు జరిగింది. అదే నేటికీ కొనసాగుతున్నది. 'ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణ ప్రజానీకం' అనటంలో రచయిత ఒక అవాస్తవ కోణంలో రాశారు. నిజానికి 1968-69 ఆ నిర్బంధ కాండ కోస్తా ప్రాంతంలోనే మొదలైంది. అది భారీ స్థాయిలో, సుమారు 350 మందిని శ్రీకాకుళ గిరిజన పోరాట సందర్భంగా కాల్చి చంపారు. వందలాది మందిని చిత్రహింసల పాలు చేశారు. ఇంకా వందల మందిని ఏళ్ల తరబడి జైళ్లలో నిర్బంధించారు. (కొందరు 10 సంవత్సరాలకు పైగా జైళ్లలో ఉన్నారు) బాగా తెల్సిన విషయాలే ఇవి. అయినా పై రచనలో ఈ ముఖ్యమైన లోపం ఎందువల్ల, ఏ అవగాహనతో జరిగింది? ఆలోచించాల్సిన ప్రశ్న ఇది.

2. 'ఎన్‌కౌంటర్లు లేని తెలంగాణ' వగైరా కెసిఆర్ వాగ్దానం చేసిన మాట నిజం. 'మరింత బూటకమైన దుర్మార్గమైన హత్యలూ నిజమే', నిజానికి ఈ కాలంలో - 2014 తర్వాత - వందలాదిగా ఎన్‌కౌంటర్లు ఛత్తీస్‌గఢ్, జార్ఖండ్ మొదలగు రాష్ట్రాల్లో జరుగుతున్నాయి. తెలంగాణలో కన్నా పెద్ద ఎత్తున సాగుతున్నాయి. దీనర్థం తెలంగాణ నిర్బంధంలో వెనుకబడిందని కాదు. ఎన్‌కౌంటర్ల దాకా రాకుండానే ఉద్యమాలను మొగ్గలోనే, ఉక్కుపాదంతో, అణచివేయడం ఇక్కడ ఇప్పుడు అమల్లో ఉంది. ఏడో నిజాం రాజ్యపు 'గస్తీ నిషాన్ 53' నేడు ఎనిమిదో నిజాం పాలనలో కొనసాగుతున్నదన్న మాట నిజమే. ఉత్తరప్రదేశ్ మొదలగు చోట్ల మరొక రకం ఎన్‌కౌంటర్లు పెద్ద ఎత్తున సాగుతున్నాయి. ఇక కశ్మీర్లో సరేసరి. దేశంలోని పోలీసు - మిలటరీ రాజ్యంలో భాగమే ఇవన్నీ. ఆయా ఉద్యమాల స్థాయిల, దశలను బట్టి కూడా ఈ నిర్బంధ విధానాలు అమలవుతున్నాయి.

3. 'ప్రత్యేక రాష్ట్రం వస్తే ఇంకేమి వచ్చినా, రాకపోయినా పౌరహక్కులు నిలబడతాయనుకున్నారు. కానీ ఇంకా ఘోరమైన పోలీసు రాజ్యం వచ్చింది'- అని రాసిన విషయం వాస్తవమే. అలా ఎందుకనుకున్నారు? ఇంకా ఘోరంగా ఎందుకయ్యింది? దేశంలో అమల్లో ఉన్న రాజ్య స్వభావాన్ని, దాని ఆచరణను సరిగ్గా అర్థం చేసుకోకనే అని చెప్పాల్సి ఉంది. పౌరహక్కుల ఉద్యమంలో ఈ లోపం తీవ్ర రూపం దాల్చింది. ప్రాంతీయ వాదం, ప్రాంతీయ సంకుచితత్వం పైచేయి సాధించాయి. నిజానికి ఈ అణిచివేత ధోరణి, 'అసహనం' రూపంలో ముందే స్పష్టంగా వ్యక్తమైంది. (ఈ అసహనం, మతోన్మాద సంఘ్ పరివార్‌కే కాదు, ప్రాంతీయోన్మాద సెక్యులర్ శక్తులకు కూడా బాగానే వంటబట్టింది) హెచ్ఎంటివి ప్రత్యేక తెలంగాణ ఉద్యమ రోజుల్లో నిర్వహించిన దశ-దిశ కార్యక్రమాల్లో ఈ ప్రాంతీయ ఉన్మాదం స్పష్టంగానే బయటపడింది. ఉదాహరణకు వరంగల్‌లో జరిగిన దశ-దిశలో తీవ్రంగా వ్యక్తమై, కార్యక్రమాన్ని కొంతసేపు వాయిదా వేయాల్సి వచ్చింది. 'ఆ కాస్త విరామంలో నేనూ, వరవరరావుగారూ ఈ విషయం గురించి ఆలోచించాము. ఈ రోజే ఇలా ఉంటే, రేపటి తెలంగాణలో ఎలా ఉంటుందోనని మేం ఇద్దరం భయపడ్డాం' - అని అప్పుడే హరగోపాల్ గారూ బహిరంగంగానే వ్యాఖ్యానించారు. ఈ ప్రాంతీయోన్మాదపు అప్రజాస్వామిక లక్షణాన్నే, నిరంకుశత్వం రూపంలో కెసిఆర్ ప్రభుత్వం అమలు చేస్తున్నది.

4. నెహ్రూ, ఇందిరల కాలంలో 'అభ్యుదయ' శక్తుల్లో ఒక గణనీయ భాగం నిరంకుశ రాజ్యంతో షరీకైపోయారు. కొందరు కాంగ్రెసులో చేరిపోయారు. కొందరు కాంగ్రెసుతో చేతులు కలిపారు. రివిజనిస్టుల్లో ఇది ప్రబల ధోరణి అయ్యింది. కెసిఆర్ నేతృత్వపు తెలంగాణలో విప్లవ, ప్రజాతంత్ర శక్తులు, మేధావులు, రచయితల్లో అత్యధికభాగం అదే స్థాయిలో దిగజారిపోయారు. ఇలాంటి శక్తుల్లో అత్యధికుల 'నోరుపడి పోయింది'. మంత్రివర్గంలో, శాసనసభలలో, వివిధ ప్రభుత్వ రంగ కార్పొరేషన్లలో, కింది పంచాయితీరాజ్ దాకా అనేకానేక పదవులకు వందలాదిమంది 'అమ్ముడుపోయారు'. 'ప్రత్యేక తెలంగాణ' ఉద్యమపు విశిష్టత ఇది. ఇది యాదృచ్ఛికం కాదు. అనూహ్యమూ కాదు. తెలంగాణ విషయంలో అనేక ఎంఎల్ పార్టీలు అనుసరించిన తప్పుడు విధానాలు, అవకాశవాద పద్ధతుల ఫలితమే ఇది. అలా కేసీఆర్‌తో చేతులు కలిపిన వారిని వదిలి, చేతులు కలపని వారిని చూసినా, వారిలో చాలా మంది మెతకపడి, ఇతర రకాల అవకాశవాదాలు అనుసరిస్తున్నారు. పై అంశాలన్నీ ఒకదానితో ఒకటి ముడిపడినవే, 'తెలంగాణొస్తే ఏమొచ్చింది?' ఆ ప్రభుత్వం, ఆ రాజకీయాలు విప్లవ శక్తులను మరోసారి మింగేశాయి. 1969-72 కాలంలోనూ ఇలాగే జరిగింది. దాన్ని మించిన స్థాయిలో ఇప్పుడు జరిగింది.

5. విద్యారంగానికి సంబంధించి (కె.జి టు పి.జి, గురుకుల పాఠశాలలు, కార్పొరేటు విద్యాలయాలు) ఏం జరుగుతున్నదో సరిగ్గానే ప్రస్తావించారు. మరొక ముఖ్యాంశాన్ని గమనించాలి. కోస్తా ప్రాంతపు - ఇంకా చెప్పాలంటే 'రెండున్నర జిల్లాల' - తెలుగుని తెలంగాణపై రుద్దారని ఒక ప్రచారోద్యమం సాగింది. తెలంగాణ భాషని అమ్మ బాష కావాలన్నారు. పరిరక్షించాలన్నారు. అసలు భాషని, మాండలికాన్ని కలగాపులగం చేశారు. కానీ నేడు ఇంగ్లిష్ మీడియంకి ప్రభుత్వ ప్రోత్సాహం ప్రబలమై, తెలుగు మీడియం, బాషా స్థానం ఇంకా బాగా దిగజారింది. టీచర్లలో అత్యధికులకు వచ్చిన ఇంగ్లిష్ అంతంత మాత్రమే అన్నది అలావుంచి, ఈ విధానం వల్ల విద్యార్థులకు 'సబ్జెక్టు' సరిగ్గా అర్థం కాని శాపం అమల్లోకి వచ్చింది. ఏ భాషలోనైనా ఆయా మాండలికాలకు తగిన స్థానం, ప్రోత్సాహం ఇవ్వటం వేరు, మాతృ భాషనే దెబ్బతీసే విధానాలు వేరు. ఇంగ్లిష్ తెలుగు రెండూ సరిగ్గా రాని తరం ఒకటి తయారవుతున్నది. ప్రాంతీయ ఉన్మాదంలో భాగంగా అశాస్త్రీయ రూపాల్లో వాదనలతో భాషోన్మాదం కూడా చెలరేగింది. దాని విషఫలితాలను చూస్తున్నాం, ఇంకా చూడబోతున్నాం.

పై విషయాలను పాఠకులు లోతుగా ఆలోచించాలని మనవి. వీ

## రాపూరు దళితవాడపై పోలీసుల దాడి

నెల్లూరు జిల్లా రాపూరు పోలీస్ స్టేషన్‌కు ఆ ఊరి దళితులు కొద్ది మంది వెళ్లి జూలై 31న ఎస్.ఐని, ముగ్గురు కానిస్టేబుళ్లను కొట్టారు. ఒక కేసు విషయమై విచారణకు పిలిచిన వ్యక్తులను ఎస్.ఐ కొట్టాడని, దాన్ని ప్రశ్నించినందుకు మహిళను కూడా స్పృహ తప్పేలా కొట్టాడని తెలిసి వారికి సంబంధించిన వాళ్లు ఆవేశంతో దాడి చేశారు. ప్రతీకారంతో 150 కుటుంబాలున్న రాపూరు దళిత కాలనీలోకి 300 మంది పోలీసులు మొత్తం కాలనీని చుట్టుముట్టి కనిపించిన వారినందరినీ విపరీతంగా కొట్టారు. యాభై మందిపై కేసులు నమోదు చేశారు.

## మధ్యాహ్న భోజన కార్మికుల బైటాయింపు

పాఠశాలల్లో మధ్యాహ్న భోజన పథకానికి క్లస్టర్ విధానం ప్రవేశపెట్టి ప్రభుత్వం ప్రయివేటు సంస్థలకు అప్పగించడాన్ని వ్యతిరేకిస్తూ కార్మికులు సిఐటియు ఆధ్వర్యంలో విశాఖపట్నంలోని ఆంధ్రప్రదేశ్ విద్యామంత్రి గంటా శ్రీనివాసరావు ఇంటిని జూలై 30న ముట్టడించారు. రోడ్డుపై బైఠాయించి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు వ్యతిరేకంగా నినాదాలు చేశారు. మిషన్ల ద్వారా వండితే ఇప్పటికే పనిచేస్తున్న మధ్యాహ్న భోజన కార్మికులు ఉపాధి కోల్పోతారని ఆందోళన వ్యక్తంచేశారు. దీంతో అప్పటికే సిద్ధంగా ఉన్న పోలీసులు కార్మికులను బలవంతంగా 150 మందిని అరెస్ట్ చేశారు.

## క్వారీలో పేలుడు వల్ల 11 మంది కూలీల మృతి

కర్నూలు జిల్లాలో ఆగస్టు 2న క్వారీలో ఘోర ప్రమాదం చోటు చేసుకుంది. ఆలూరు మండలం హత్తిబెళగల్‌లో క్వారీలో భారీ పేలుడు సంభవించింది. ప్రమాద సమయంలో అక్కడే షెడ్డులో ఉన్న 11మంది కూలీలు మృతిచెందగా.. మరో నలుగురు గాయపడ్డారు. క్షతగాత్రులను ఆలూరు ప్రభుత్వాస్పత్రికి తరలించారు. ప్రమాద సమయంలో సుమారు 20 మంది కూలీలు ఉన్నట్లు సమాచారం. క్వారీలో చెలరేగిన మంటల కారణంగా పక్కనే ఉన్న లారీ, మూడు ట్రాక్టర్లు, రెండు షెడ్డులు దగ్ధమయ్యాయి. ఆగస్టు 2న జరిగిన గ్రామ దర్శినిలో హత్తిబెళగల్ గ్రామస్తులు క్వారీలో పేలుడును ఆపివేయాలని నిరసన తెలిపారు. క్వారీ యజమాని తెలుగుదేశం నాయకుడు కావడంతో అధికారుల నుండి ఎలాంటి స్పందన లేదంటున్నారు స్థానికులు.

## ప్రజాపోరాట యాత్ర

పశ్చిమగోదావరి జిల్లా తణుకులో జనసేన పార్టీ నేత పవన్‌కల్యాణ్ ఆగస్టు 13న ప్రజాపోరాట యాత్ర సభ నిర్వహించారు. ఈ సభలో పవన్‌కళ్యాణ్ 'వైకాపా అధినేత జగన్ లక్ష కోట్ల రూపాయలు దోచారని, తెలుగుదేశం పార్టీ ఆరోపిస్తుంటే, వైకాపా వాళ్లు చంద్రబాబు లక్షన్నర కోట్లు దోచారని విమర్శిస్తున్నారు తప్ప ఏమీ దోచుకోలేదని ఎవరూ చెప్పడం లే'దన్నారు. పోలవరాన్ని అద్భుతంగా నిర్మిస్తున్నామంటూ జనాలను బస్సుల్లో తీసుకెళ్లి, క్యాంటీన్‌లో భోజనాలు పెట్టేందుకు నెలకు రు.2 కోట్లు వెచ్చిస్తున్నారని.. ఈ కాంట్రాక్టునంతా కృష్ణా జిల్లాకు చెందిన తెదేపా నాయకుడికి ఇచ్చి అవినీతికి పాల్పడుతున్నారని ఆరోపించారు. గోదావరి కాలువలను మురికిమయంగా మార్చారన్నారు. వైకాపా నాయకుడు అడ్డగోలుగా దోచేస్తే, తెదేపా నాయకుడు చట్టబద్ధంగా దోచేస్తున్నారని ఆరోపించారు. గోదావరి జిల్లాల కాపులను తొమ్మిదో షెడ్యూలులో చేర్చి రిజర్వేషన్లు కల్పించి న్యాయం చేస్తామని హామీచ్చారు.

## గ్రామ పంచాయితీ కార్మికుల సమ్మె

గ్రామ పంచాయితీ కార్మికులు తమ వేతనాలను పెంచాలని, ఉద్యోగాలని క్రమబద్ధీకరించాలని, గ్రామ కార్యదర్శులుగా తమకే అవకాశం ఇవ్వాలని కోరుతూ గత 33 రోజులుగా సమ్మెచేస్తున్నారు. ప్రభుత్వం ఆగస్టు 22న జారీ చేసిన నోటీసు అప్రజాస్వామికమని, వెంటనే నోటీసును వెనక్కు తీసుకోవాలని పలు కార్మిక సంఘాల నేతలు డిమాండ్ చేశారు. కార్మిక సంఘాల ఆధ్వర్యంలో ఆగస్టు 23న లోయర్ ట్యాంక్‌బండ్‌లో ఉన్న అంబేద్కర్ విగ్రహం వద్ద నల్ల రిబ్బన్ ధరించి ధర్నా చేశారు. సమ్మెచేస్తున్న కార్మికుల సంఘాలతో కనీసం చర్చలు జరపకుండా ప్రభుత్వం సమ్మెను విచ్ఛిన్నం చేస్తూ కార్మిక చట్టాలను ఉల్లంఘిస్తుందని విమర్శించారు. గ్రామ పంచాయితీ ఉద్యోగుల, కార్మికుల సమస్యలు పరిష్కరించాలని కోరుతూ జెఏసి తరపున ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఎస్.కె. జోషిని కలిసి ఆగస్టు 25న వినతి పత్రం ఇచ్చారు.

## వాకపల్లి కేసు విచారణ

వాకపల్లి మహిళలకు సంబంధించిన కేసు విచారణ ఆగస్టు 22న తిరిగి ప్రారంభమైంది. మావోయిస్టు నేత తలదాచుకున్నాడంటూ 2007 ఆగస్టు 20న కూంబింగ్ నిర్వహించిన పోలీసులు తమ గ్రామాన్ని చుట్టుముట్టి తమపై అత్యాచారానికి పాల్పడ్డారని నుర్మతి పంచాయితీ, వాకపల్లి గ్రామానికి చెందిన 11 మంది మహిళలు (వీరిలో ఇద్దరు మృతిచెందారు) అప్పట్లో పాడేరు పోలీసులకు ఫిర్యాదు చేశారు. ఈ ఘటన దేశవ్యాప్తంగా సంచలనం రేపడంతో కేసు హైకోర్టు పరిధిలోకి వెళ్లింది. కాని గిరిజన మహిళలపై అత్యాచారం జరిగిందని నిర్ధారణ చేసేందుకు ఎలాంటి ఆధారాలు లేవంటూ హైకోర్టు కేసును తోసిపుచ్చింది. దీంతో బాధిత మహిళలు ఆదివాసి ఐక్య పోరాట సమితి, మానవ హక్కుల వేదిక సహాయంతో సుప్రీం కోర్టులో కేసు వేశారు. దీనికి ప్రతిగా పోలీసులు సైతం సుప్రీం కోర్టును ఆశ్రయించి, తమపై తప్పుడు ఆరోపణలతో కేసు పెట్టారని, దాన్ని రద్దుచేయాలని కోరుతూ క్వాష్ పిటిషన్ వేశారు.

## లక్ష్మినరసింహారావు మృతి

ప్రముఖ నవలా రచయిత, సీనియర్ జర్నలిస్టు కొనకంచి లక్ష్మీనరసింహారావు (55) కన్నుమూశారు. సూర్యపేట జిల్లా మోత్కూరులో ఆగస్టు 8న గుండెపోటుకు గురై ఆస్పత్రికి తరలించే లోపే మృతిచెందారు. ఆయన భౌతిక కాయాన్ని స్వస్థలమయిన భూపాలపల్లి జిల్లా మంగపేటలోని గంపోని గూడానికి తరలించారు. ఆయన పలు దినపత్రికలలో పాత్రికేయుడిగా పనిచేశారు. ఆయన రచించిన మంత్రిలిపి, నేనేమి మాట్లాడను నవలలు ప్రాచుర్యం పొందాయి.

## వాస్తవ సాగుదారుల హక్కుల సదస్సు

తెలంగాణ ప్రభుత్వం రైతుబంధు పథకాన్ని పంటలు పండించే రైతులకే వర్తింపజేయాలని కోరుతూ అఖిల భారత రైతాంగ పోరాట సమన్వయ సమితి ఆధ్వర్యంలో 'వాస్తవ సాగుదారుల హక్కుల సదస్సు'ను ఆగస్టు 27న హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో నిర్వహించారు. ఈ సదస్సులో వక్తలు సాగుదారులకే రైతుబంధు పథకాన్ని అమలుచేయాలని, 2011 చట్టం ప్రకారం రుణ అర్హత కార్డులు పంపిణీ చేయాలన్నారు. తెలంగాణ ప్రభుత్వం అసలు కౌలు రైతులే లేరంటూ పూర్తిగా విస్మరించిందని, ఐక్యతతో పోరాటాలు నిర్వహించాలని వక్తలు పిలుపునిచ్చారు. ఈ సదస్సుకు తెలంగాణ నలుమూలల నుండి కౌలు, పోడు రైతులు, మహిళలు హాజరయ్యారు. వీ

### కేరళను ముంచెత్తిన వరదలు

కేరళలో నైరుతి రుతుపవనాలు జూలై చివరి వారంలో 20 రోజులు కొనసాగాయి. దీంతో విపరీతమైన వరదలొచ్చి రాష్ట్ర రాజధాని తిరువనంతపురం, సహో, కొల్లాం, పఠాన్‌మిట్టా, ఎర్నాకుళం, కొట్టాయి, ఇడుక్కి, పాలక్కడ్ జిల్లాలు తడిసి ముద్దయ్యాయి. అంతటా వరదనీరు వచ్చి చేరడంతో రోడ్డు రవాణా స్థంబించిపోయింది. రైల్వే ట్రాక్‌లపై వరదనీరు చేరడంతో రైల్లు రద్దుచేస్తున్నట్లు రైల్వే శాఖ ప్రకటించింది. ఎయిర్ పోర్టుల్లో కూడా నీరు నిలవడంతో విమాన సర్వీసులు కూడా తాత్కాలికంగా రద్దుచేశారు. ఈ వరదల కారణంగా ఆగస్టు 25 నాటికి 445 మంది చనిపోయారని, ఇళ్లలోకి నీరు చేరడంతో 3.5 లక్షల మందిని సురక్షిత ప్రాంతాలకు తరలించినట్లు అధికారులు తెలిపారు. వేలకోట్ల రూపాయల ఆస్తినష్టం జరిగి మొత్తం జలమయమయింది.

### రాజకీయ ఖైదీల విడుదల కోసం ఢిల్లీలో ధర్నా

రాజకీయ ఖైదీలను విడుదుల చేయాలని డిమాండ్ చేస్తూ సామాజిక కార్యకర్తలు ఢిల్లీలోని జంతర్‌మంతర్ వద్ద ఆగస్టు 3న ధర్నా నిర్వహించారు. దళితులు, మైనారిటీలు, సామాజిక కార్యకర్తలపై బిజెపి ప్రభుత్వం అణచివేతలకు పాల్పడుతోందని వారు ఆగ్రహాన్ని వ్యక్తంచేశారు. చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం (యుఏపిఏ), సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం(ఏఎఫ్ఎస్‌పిఏ)ను రద్దు చేయాలని వారు డిమాండ్ చేశారు. భీమా కోరేగావ్ సంఘటనలో అరెస్టయిన భీమ్ ఆర్మీ వ్యవస్థాపకుడు చంద్రశేఖర్ ఆజాద్‌ను విడుదల చేయాలని డిమాండ్ చేశారు. ఈ ధర్నాలో ప్రముఖ రచయిత్రి అరుంధతీరాయ్, బాంబే హైకోర్టు మాజీ న్యాయమూర్తి జిబి కోల్సే పాటిల్, హక్కుల కార్యకర్త సుజాతాభద్రో, పియుసిఎల్ సభ్యురాలు కవిత శ్రీవాత్సవ పాల్గొన్నారు.

### రవాణా బంద్

కేంద్ర ప్రభుత్వం పార్లమెంట్‌లో ప్రవేశపెట్టిన మోటారు వాహన చట్ట సవరణ బిల్లు-2017ను ఉపసంహరించుకోవాలని, పెట్రోల్, డీజిల్‌ను జి.ఎస్.టి. పరిధిలోకి తేవాలని డిమాండ్ చేస్తూ అఖిల భారత కార్మిక సంఘాల సమన్వయ కమిటీ ఆగస్టు 6న బంద్‌కు పిలుపునిచ్చింది. ఈ బందులో దేశవ్యాప్తంగా ప్రభుత్వ రవాణాతో పాటు ప్రైవేట్ రవాణా రంగం కూడా పాల్గొంది. ఈ బిల్లు ఆమోదం పొందితే ఆర్.టి.సి మనుగడే ప్రశ్నార్థకం అవుతుందని ఆల్ ఇండియా మోటారు కాంగ్రెస్ కమిటీ పేర్కొంది. ఈ సమ్మెలో బస్‌లు, ఆటో, లారీ, ట్రాలీ, క్యాబ్ డ్రైవర్లు, కార్మిక సంఘాలు సంయుక్తంగా భారీ ప్రదర్శనలో పాల్గొనడంతో సమ్మె విజయవంతమైంది.

### ఎన్‌కౌంటర్‌లో ఆదివాసుల మృతి

సుకుమా జిల్లా కుంటా బ్లాక్ కన్నాయి గూడెం వద్ద కూంబింగ్ జరుపుతున్న పోలీసులకు మావోయిస్టులు తారసపడడంతో ఇరు వర్గాల మధ్య కాల్పులు జరిగాయని, ఈ కాల్పుల్లో 16 మంది మావోయిస్టులు మృతిచెందినట్లు సుక్మా ఎస్.పి. అభిషేక్ మీనా ఆగస్టు 6న ప్రకటించారు. వందలాది మంది పోలీసులు కూంబింగ్ వెళ్లగా భయంతో పరుగులు తీస్తున్న అమాయక ప్రజలను ఎలాంటి హెచ్చరిక లేకుండా ఏకపక్ష కాల్పులు జరిపి, దొరికిన వారిని చిత్రహింసలకు గురిచేసి క్రూరంగా చంపారని ఘటనా స్థలానికి వెళ్లి ప్రత్యక్ష సాక్షులను అడిగి తెలుసుకున్న పత్రికా విలేకరులు, హక్కుల సంఘాలు తెలిపారు.

### ముత్తివేల్ కరుణానిధి మృతి

డిఎంకె అధినేత, తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి ముత్తివేల్ కరుణానిధి(94) కన్నుమూశారు. గత కొన్ని రోజులుగా ఆయన అనారోగ్యంతో చెన్నైలోని కావేరీ ఆస్పత్రిలో చికిత్సపొందుతూ ఆగస్టు 6న మృతిచెందారు. ఆయన ద్రవిడ ఉద్యమానికి అనుబంధంగా తమిళనాడు తమిళ్ మనవర్ మంగ్రం పేరిట విద్యార్థి విభాగాన్ని స్థాపించారు. హిందీ వ్యతిరేకోద్యమంలో చురుగ్గా పాల్గొన్నారు. కరుణానిధి, ఎంజిఆర్ కలిసి అన్నాదురై నాయకత్వంలో ద్రవిడ మున్నేట్ర కళగం (డిఎంకె) స్థాపించారు. 1967లో డిఎంకె అధికారంలోకి వచ్చింది. 1969లో అన్నాదురై మరణించగా, కరుణానిధి సిఎం అయ్యారు.

### అటల్ బిహారీ వాజపేయి మృతి

మాజీ ప్రధాన మంత్రి అటల్ బిహారీ వాజపేయి(93) ఢిల్లీలోని ఎయిమ్స్ ఆసుపత్రిలో గత కొంతకాలంగా అనారోగ్యంతో చికిత్సపొందుతూ ఆగస్టు 17న చనిపోయారు. వాజపేయి 1924, డిసెంబర్ 25న మధ్యప్రదేశ్‌లోని గ్వాలియర్‌లో జన్మించారు. గ్వాలియర్‌లో ప్రాథమిక, కాన్పూర్‌లో ఉన్నత విద్యను అభ్యసించారు. ఆయన విద్యార్థి దశనుంచే ఆర్యసమాజ విద్యార్థి విభాగంలో పనిచేసి 1944లో ఆర్యసమాజ్ ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయ్యారు. అదే సమయంలో ఆర్.ఎస్.ఎస్.లో చేరి పూర్తిస్థాయి ప్రచారక్‌గా మారారు. 1951లో భారతీయ జనసంగ్‌లో చేరారు. 1957లో తొలిసారిగా లోక్‌సభకు ఎన్నికయ్యారు. 1968లో బిజెఎస్‌కు అధ్యక్షులయ్యారు. 1977లో జనతాపార్టీ ప్రభుత్వంలో విదేశాంగ శాఖా మంత్రిగా పనిచేశారు. 1996, 1998లో ప్రధానిగా పనిచేశారు.

### స్వామి అగ్నివేశ్‌పై దాడి

సామాజిక కార్యకర్త స్వామి అగ్నివేశ్‌పై మతోన్మాద మూకలు ఢిల్లీలో మళ్లీ దాడికి పాల్పడ్డారు. ఆగస్టు 17న వాజపేయి మృతదేహానికి శ్రద్ధాంజలి ఘటించడానికి స్వామి అగ్నివేశ్ బిజెపి కార్యాలయానికి వెళుతుండగా రోడ్డుపై దాడికి పాల్పడ్డట్లు స్థానికులు తెలిపారు. దీనికి సంబంధించిన వీడియో సోషల్ మీడియాలో తిరుగుతోంది.

### కశ్మీర్‌లో కొనసాగుతున్న ఎన్‌కౌంటర్‌ల పరంపర

జమ్మూకశ్మీర్‌లోని పోషియాన్ జిల్లా కిల్లోరాలో మిలిటెంట్లు ఉన్నారన్న సమాచారంతో ఆగస్టు 4న భద్రతా బలగాలు గాలింపు చర్యలు చేపట్టాయి. ఈ క్రమంలో బలగాలకు మిలిటెంట్లకు మధ్య జరిగిన కాల్పుల్లో ఐదుగురు మిలిటెంట్లు మృతిచెందినట్లు పోలీసులు తెలిపారు. ఎన్‌కౌంటర్‌కు నిరసనగా భద్రతా బలగాలపై స్థానిక ప్రజలు రాళ్లురువ్వడంతో బలగాలు జరిపిన కాల్పుల్లో ఒక పౌరుడు మరణించగా పన్నెండు మంది గాయపడ్డారన్నారు. కుప్వారా జిల్లా తంగ్ధార్ వద్ద ఆగస్టు 19న జరిగిన ఘటనలో ముగ్గురు మిలిటెంట్లు మృతి చెందారు. నౌగామ్‌లోని కస్తూరి నుల్లా వద్ద మరో మిలిటెంట్ సైనికుల కాల్పుల్లో మృతిచెందాడు. కుల్గాం జిల్లా జాగ్రిపోరాలో ఫయాస్ అహ్మద్‌షా అనే కానిస్టేబుల్ పై ఆగస్టు 22న మిలిటెంట్లు కాల్పులు జరపడంతో మృతిచెందారు. పుల్వామా జిల్లాలో ఎస్‌పిఓపై మిలిటెంట్లు కాల్పులు జరపడంతో ఆయన మృతిచెందారు. బిజెపి కార్యకర్త షాబిర్‌భట్ మిలిటెంట్లు జరిపిన కాల్పులో మృతిచెందాడు.

### కులదీప్ నయ్యర్ మృతి

సీనియర్ జర్నలిస్టు కులదీప్‌నయ్యర్(95) మృతిచెందారు. ఆయన గత కొద్ది కాలంగా న్యూమోనియాతో బాధపడుతూ న్యూ ఢిల్లీలోని ఎస్కార్ట్ ఆసుపత్రిలో చికిత్సపొందుతూ ఆగస్టు 23న మృతిచెందారు. ఆయన 1923లో ప్రస్తుత పాకిస్థాన్‌లో ఉన్న సియాల్‌కోట్‌లో పుట్టారు. 1960-64 మధ్య మాజీ ప్రధాని లాల్‌బహదూర్ శాస్త్రికి పత్రికా సలహాదారుగా పనిచేశారు. ఆయన దౌత్యవేత్తగా, రాయబారిగా, రచయితగా, మానవహక్కుల కార్యకర్తగా, పత్రికా స్వేచ్ఛ కోసం కృషిచేశారు. ఎమర్జెన్సీకి వ్యతిరేకంగా పోరాడిన మొట్టమొదటి జర్నలిస్టులలో ఆయన ఒకరు. భారతదేశం, పాకిస్థాన్ దేశాల మధ్య శాంతికోసం పనిచేశారు. వీ

## కాలిఫోర్నియా అడవుల్లో అగ్నిప్రమాదం

అమెరికాలోని కాలిఫోర్నియాలో జూలై ఆఖరులో ప్రారంభమైన అగ్ని ప్రమాదం దాదాపు రెండు వారాలపాటు సాగింది. కాలిఫోర్నియా చరిత్రలోనే అతిపెద్దదిగా ఉన్న ఈ అగ్ని ప్రమాదం వల్ల దాదాపు రెండు లక్షల ఎకరాల అడవి దగ్ధమైంది. మెండోసినో కాంప్లెక్స్ ఫైర్ వల్ల వేలాది ఇళ్లు దగ్ధమయ్యాయి. ఈ కార్చిచ్చు రాంచ్ ఫైర్, రివర్ ఫైర్‌గా రెండు చోట్ల నుంచి వ్యాపిస్తూ మంటలు తీవ్రరూపం దాల్చాయి. భారీ ఆస్తి నష్టం సంభవించింది. వేలాదిగా ప్రజలను సురక్షిత ప్రాంతాలకు తరలించారు.

## జింబాబ్వే అధ్యక్షుడిగా నంగాగ్వా

జింబాబ్వే పార్లమెంట్‌కు జూలై 30న ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికల్లో అధికారంలో ఉన్న జాను-పిఎఫ్ పార్టీ విజయం సాధించింది. ఆ పార్టీ అధ్యక్షుడు ఎమర్సన్ నంగాగ్వా రెండోసారి జింబాబ్వే అధ్యక్షుడి పదవీ బాధ్యతలు చేపట్టారు. మొత్తం 270 సీట్లకు గాను జరిగిన ఎన్నికల్లో జాను-పిఎఫ్ 145 స్థానాలు సాధించింది. ప్రతిపక్ష ఎండిసి కూటమికి 63 సీట్లు లభించాయి. నంగాగ్వాకు 50.8 శాతం ఓట్లు వచ్చాయి. ప్రతిపక్ష పార్టీ ఎండిసి నేత నెల్సన్ చామిషాకు 44.3 శాతం ఓట్లు వచ్చాయి. అయితే పాలకపార్టీ ఈ ఎన్నికల్లో రిగ్గింగ్‌కు పాల్పడిందని నెల్సన్ ఆరోపించారు.

## అఫ్ఘనిస్తాన్‌లో ఆత్మాహుతి దాడి

అఫ్ఘనిస్తాన్‌లో ఆత్మాహుతి దాడులు కొనసాగుతూనే ఉన్నాయి. ఆగస్ట్ 3న పాక్టియా ప్రావిన్స్‌లోని ఒక మసీదులో శుక్రవారం నమాజు జరుగుతున్న సమయంలో ఆత్మాహుతి దాడి జరిగింది. ఈ దాడిలో ఇరవై ఐదు మంది చనిపోయారు. నలభై మందికి పైగా తీవ్రంగా గాయపడ్డారు. ఆగస్ట్ 15న బగ్లాన్ ప్రావిన్స్‌లోని మిలిటరీ పోస్ట్‌పై తీవ్రవాదులు మెరుపు దాడి చేశారు. ఈ దాడిలో ముప్పై ఐదు మంది సైనికులతో సహా మొత్తం నలభై నాలుగు మంది మరణించారు. ఆగస్ట్ 16న రాజధాని కాబూల్‌లో ఆత్మాహుతి దాడి జరిగింది. ఓ ట్యూషన్ సెంటర్‌పై ఈ దాడి జరిగింది. ఈ దాడిలో ముప్పై నాలుగు మంది విద్యార్థులు మరణించారు. కొంతమంది విద్యార్థులు తీవ్రంగా గాయపడ్డారు. అఫ్ఘన్‌లో దాడులు బాగా పెరిగిపోవడం పట్ల ఐక్యరాజ్య సమితి తీవ్రంగా ఆందోళన వ్యక్తం చేసింది. ఈ ఏడాదిలో ఇప్పటి వరకు జరిగిన దాడుల్లో దాదాపు పదిహేడు వందల మంది చనిపోయారనీ, మూడు వేల మందికిపైగా తీవ్రంగా గాయపడ్డారనీ నివేదిక విడుదల చేసింది. మృతుల్లో సామాన్య పౌరులు, ముఖ్యంగా చిన్నారులు చనిపోతున్నారని తెలిపింది.

## వెనెజులా దేశాధ్యక్షుడిపై హత్యాయత్నం

వెనెజులా అధ్యక్షుడు నికోలస్ మదురోపై హత్యాయత్నం జరిగింది. ఆగస్టు 4న సాయంత్రం సైనిక కవాతులో పాల్గొన్న ఆయనపై డ్రోన్ల ద్వారా ఈ దాడి జరిగింది. పేలుడు పదార్థాలు నింపిన డ్రోన్లు ఆయనకు సమీపంలో పేలడంతో ఈ ఘటన సంభవించింది. అయితే, ఇందుకు కారణం లెఫ్ట్ పార్టీలేనని ఆ దేశ మంత్రి జార్జ్ రోడ్రిగోజ్ ఆరోపించగా, దేశాధినేత మాత్రం ఇది పొరుగు దేశమైన కొలంబియా పనేనని ఆరోపిస్తున్నారు. ఆగస్టు 4న నేషనల్ గార్డ్స్ 81వ వార్షికోత్సవంలో పాల్గొని దేశ ఎకానమీ మీద ప్రసంగిస్తుండగా సభా ప్రాంగణానికి సమీపంలో బాంబు దాడి జరిగింది. ఈ పేలుడులో తొమ్మిది మంది గాయపడ్డారు. ఈ కుట్రకు కారకులైనవారిని, సహకరించిన వారిని గుర్తించినట్లు ప్రాసిక్యూటర్ జనరల్ తారెక్ తెలిపారు. ఈ ఘటన అంతటికి సూత్రధారులు పొరుగు దేశం కొలంబియా, అమెరికాలోని కొందరు ఆర్థికవేత్తలే కారణమని మదురో ఆరోపించారు. అయితే కొందరు అధికారులు మాత్రం ప్రతిపక్ష పార్టీలు ఈ దారుణానికి తెగించి ఉంటారని తెలిపారు.

## అర్జెంటీనాలో మహిళల నిరసన

అర్జెంటీనాలో అబార్షన్‌కు చట్టబద్ధత కల్పించాలంటూ లక్షలాదిగా మహిళలు రాజధాని బ్యూనస్ ఎయిర్స్‌లో ఆగస్ట్ 8న భారీ ఆందోళన ప్రదర్శన చేపట్టారు. అబార్షన్‌కు చట్టబద్ధత కల్పించాలనే ఉద్దేశంతో కాంగ్రెస్ సభ్యులు రూపొందించిన బిల్లును అర్జెంటీనా అధ్యక్షుడు మారిసియో మాక్రీ వీటో చేయలేదు. ఈ చర్యకు నిరసనగా పది లక్షల మంది మహిళలు ఎర్రని వస్త్రాలు ధరించి ప్లకార్డులు, బ్యానర్లు ప్రదర్శిస్తూ, ప్రభుత్వ వ్యతిరేక నినాదాలు చేస్తూ ఆందోళన చేశారు. పలు సందర్భాల్లో శిశు, తల్లి ప్రాణాలు కాపాడేందుకు అబార్షన్ తప్పనిసరి అని, ఈ పరిస్థితుల దృష్ట్యా అబార్షన్ చేయించుకునే హక్కు మహిళలకు ఉండాలని వారు డిమాండ్ చేశారు. ఆగస్ట్ 9న ఈ అంశంపై పార్లమెంట్‌లో ప్రవేశపెట్టిన బిల్లుపై ఓటింగ్ జరిగింది. ఈ ఓటింగ్‌లో బిల్లుకు అనుకూలంగా 31 ఓట్లు రాగా, వ్యతిరేకంగా 38 ఓట్లు వచ్చాయి. డాక్టర్లు అబార్షన్‌కు అనుమతించక పోవడంతో ప్రతి ఏడాది ముప్పై వేల మంది మహిళలు మరణిస్తున్నారు.

## యెమెన్‌లో వైమానిక దాడి

యెమెన్‌లో వైమానిక దాడులు బీభత్సం సృష్టిస్తున్నాయి. సాద ప్రావిన్స్‌లోని ఓ స్కూల్ బస్సుపై వైమానిక దాడి జరిగింది. ఈ దాడిలో నలభై మంది చిన్నారులతో పాటు అరవై మంది మరణించారు. మరో ఎనభై మంది తీవ్రంగా గాయపడ్డారు. ఇందులో అత్యధికంగా 6 నుంచి 10 ఏళ్ల లోపు పిల్లలే ఉన్నారు. సౌదీ సంకీర్ణ దళాలు గత కొంతకాలంగా ఆస్పత్రులు, విద్యాసంస్థలు, మార్కెట్లను లక్ష్యంగా చేసుకొని దాడులకు పాల్పడుతున్నాయి. వందలాది మంది అమాయక ప్రజలు ప్రాణాలు కోల్పోతున్నారు.

## మోన్‌శాంటోకు భారీ జరిమానా

మోన్‌శాంటో కంపెనీకి భారీ జరిమానా విధిస్తూ అమెరికా న్యాయస్థానం తీర్పు ఇచ్చింది. ఆ కంపెనీ ఉత్పత్తి చేసిన గ్లైఫోసాట్ క్రిమిసంహారక మందుల వల్ల డెవెన్ జాన్సన్ అనే వ్యక్తికి కేన్సర్ సోకినట్లు నిర్ధారణ కావడంతో, న్యాయస్థానం ఆయనకు జరిగిన నష్టానికి 3.9 కోట్ల డాలర్లు, అలాగే కంపెనీకి జరిమానాగా 25 కోట్ల డాలర్లు చెల్లించాలని తీర్పు చెప్పింది. అవినీతి, దురుద్దేశంతోనే కంపెనీ ఈ రీతిన వ్యవహరించిందని న్యాయస్థానం పేర్కొంది.

## ట్రంప్‌పై అమెరికన్ మీడియా ఆగ్రహం

అమెరికా అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్‌పై అక్కడి మీడియా తీవ్ర నిరసనను వ్యక్తం చేస్తున్నది. మీడియా సంస్థలు ఫేక్ న్యూస్‌ను రాస్తున్నాయని, జర్నలిస్టులు ప్రజా శత్రువులు అని ఇటీవల ట్రంప్ అన్నాడు. మీడియాపై ట్రంప్ నీచ యుద్ధాన్ని కొనసాగిస్తున్నాడనీ, దీనివల్ల మీడియాపై, జర్నలిస్టులపై దాడులు పెరిగే అవకాశం ఉందనీ తెలిపాయి. దీన్ని వ్యతిరేకించాలని బోస్టన్ గ్లోబ్ పిలుపుకు ఆగస్ట్ 16న దాదాపు 350 పత్రికా సంస్థలు తమ సంపాదకీయాల్లో ట్రంప్ విధానాన్ని వ్యతిరేకిస్తూ తమ ఆగ్రహాన్ని వ్యక్తం చేశాయి.

## పాకిస్తాన్ ప్రధానిగా ఇమ్రాన్ ఖాన్

పాకిస్తాన్ ప్రధానిగా పాకిస్తాన్ తెహ్రీక్ ఈ-ఇన్సాఫ్ (పిటిఐ) అధినేత ఇమ్రాన్ ఖాన్ ఎన్నికయ్యారు. గత నెలలో జరిగిన ఎన్నికల్లో పిటిఐకు 176 సీట్లు, ప్రతిపక్ష పిఎంఎల్-ఎన్‌కు 96 సీట్లు వచ్చాయి. ఆగస్ట్ 18న ఇమ్రాన్ ఖాన్ ప్రధానిగా ప్రమాణ స్వీకారం చేశారు.

## ఆస్ట్రేలియా ప్రధానిగా స్కాట్ మారిసన్

ఆస్ట్రేలియా ప్రధానిగా స్కాట్ మారిసన్ ఎన్నికయ్యారు. లిబరల్ పార్టీలో నాయకుడి కోసం జరిగిన ఓటింగ్‌లో 45-40 ఓట్లతో మాల్కమ్ టర్న్‌బుల్‌ను మారిసన్ ఓడించారు. టర్న్‌బుల్‌పై ప్రభుత్వంలో వ్యతిరేకత కారణంగా ఆయన తప్పుకోవాల్సి వచ్చింది. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(జూలై 1 నుండి జూలై 31, 2018 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (965), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (921) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1886)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 6 | – | 21 | 26 | 10 | 12 | 6 | 4 | 3 | 2 | 3 | 1 | 6 | 24 | 38 | – | – | – | 6 | 7 |
| హైదరాబాద్ | – | – | – | 7 | 12 | 6 | 5 | – | 2 | 3 | 2 | 9 | 5 | 2 | 22 | 15 | – | – | – | – | – |
| కరీంనగర్ | – | 6 | – | 5 | 8 | 3 | 2 | 1 | – | 1 | 1 | 2 | 1 | 7 | 14 | 7 | – | – | – | – | – |
| ఖమ్మం | – | 3 | – | 8 | 13 | 2 | 5 | 1 | 2 | 2 | 2 | 2 | 1 | 5 | 28 | 8 | – | – | – | – | 32 |
| మహబూబ్‌నగర్ | – | 2 | – | 5 | 5 | 4 | 5 | 7 | 4 | 2 | 4 | 6 | 10 | 11 | 40 | 5 | – | – | – | – | 5 |
| మెదక్ | – | 10 | 4 | 2 | 2 | 3 | 2 | 2 | – | 1 | 4 | 5 | 2 | 11 | 15 | 22 | – | – | – | 2 | 1 |
| నల్గొండ | – | 2 | 1 | 5 | 9 | 4 | 3 | 3 | – | 2 | – | – | 1 | 9 | 31 | 8 | – | – | – | – | – |
| నిజామాబాద్ | – | – | – | 4 | 2 | 1 | 3 | – | – | 1 | – | 5 | 1 | 4 | 14 | 9 | – | – | – | – | – |
| వరంగల్ | – | 12 | 7 | 5 | 5 | 6 | 11 | 12 | 3 | 6 | 6 | 8 | 11 | 14 | 21 | 30 | – | – | – | 7 | 2 |
| వికారాబాద్ | – | 1 | – | 2 | – | 2 | 1 | – | – | 2 | 1 | 1 | 1 | 2 | 13 | 11 | – | – | – | – | – |
| **తెలంగాణ** | **-** | **42** | **12** | **64** | **82** | **41** | **49** | **32** | **15** | **23** | **22** | **41** | **34** | **71** | **222** | **153** | **-** | **-** | **-** | **15** | **47** |
| అనంతపురం | – | 10 | 1 | 25 | 25 | 3 | 4 | 3 | – | 9 | 2 | 3 | 22 | 7 | 35 | – | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 9 | 8 | 12 | 8 | – | 1 | 3 | 4 | 4 | 10 | 6 | 32 | 10 | – | – | – | – | – |
| కడప | – | 1 | – | 6 | 4 | – | – | – | 1 | 3 | 1 | – | – | 4 | 17 | 4 | – | – | – | – | – |
| గుంటూరు | – | 1 | – | 4 | 2 | 2 | 3 | 2 | 1 | 1 | 2 | 7 | – | 3 | 19 | 8 | – | – | – | – | – |
| కృష్ణా | – | – | – | 1 | 2 | 1 | 2 | 2 | – | – | 2 | 3 | – | 4 | 13 | 8 | – | – | – | – | – |
| కర్నూలు | – | 2 | – | 7 | 15 | 1 | 4 | – | – | 2 | 3 | 1 | 3 | 6 | 15 | 8 | – | – | – | – | – |
| తూర్పు గోదావరి | – | – | – | 2 | 4 | – | 4 | 1 | – | 9 | 3 | 3 | 4 | 9 | 32 | 16 | – | – | – | – | 6 |
| ప్రకాశం | – | – | – | 8 | 7 | 1 | 4 | – | – | 2 | 2 | 4 | 3 | 2 | 20 | 12 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | – | 2 | 8 | 4 | 8 | 2 | – | – | 1 | 1 | 6 | 2 | 31 | 10 | – | – | – | – | 1 |
| పశ్చిమ గోదావరి | – | – | – | 6 | 5 | – | 2 | – | 1 | 1 | 1 | 1 | – | 3 | 14 | 9 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 3 | 5 | – | 2 | 1 | – | 5 | 4 | 1 | – | 6 | 17 | 9 | – | – | – | – | – |
| విజయనగరం | – | 1 | – | 3 | 4 | 3 | 4 | 6 | – | 1 | – | 1 | – | 4 | 22 | 8 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | – | 7 | 14 | – | 4 | 3 | – | 5 | – | 1 | 1 | 1 | 16 | 15 | – | – | – | 10 | – |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **15** | **1** | **83** | **103** | **27** | **49** | **20** | **4** | **41** | **25** | **30** | **49** | **57** | **283** | **117** | **-** | **-** | **-** | **10** | **7** |



# సర్వజనుల ఆరోగ్య పరిరక్షణే ధ్యేయం !
# అన్నదాతల ఆనందమే అంతిమ లక్ష్యం !!

స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా...

తెలంగాణ ప్రభుత్వం అందిస్తున్న రెండు చారిత్రాత్మక పథకాలు



తెలంగాణ ముఖ్యమంత్రివర్యులు
శ్రీ కె. చంద్రశేఖర్ రావు గారు




**3.7 కోట్ల మందికి**
ఉచితంగా
కంటి పరీక్షలు

**40 లక్షల కండ్ల అద్దాలు,**
**4 లక్షల శస్త్రచికిత్సలు,**
**మందులు**
ఉచితంగా అందించటం.

రాష్ట్రవ్యాప్తంగా
**828 వైద్యబృందాల**
ఏర్పాటు

**114 దవాఖానల్లో**
శస్త్రచికిత్సలకు
ఏర్పాట్లు పూర్తి

గ్రామాల వారీగా మరియు
పట్టణ ప్రాంతాల్లో వార్డుల వారీగా
కంటి శిబిరాల నిర్వహణ
**ఆగష్టు15 నుండి ప్రారంభం**




ఒక్కో రైతుకు
**రూ. 2271.50**
చొప్పున ప్రీమియం
చెల్లించిన ప్రభుత్వం.

18 నుండి 59 ఏండ్ల
వయసున్న
రైతులకు వర్తింపు

ఏ కారణంతో చనిపోయినా,
నామినీకి **రూ.5 లక్షల**
బీమా మొత్తం చెల్లింపు

**రూ.636 కోట్లు**
ఎల్ఐసీకి జమ,
గ్రామాలకు చేరుతున్న
బీమా పత్రాలు

ఆగష్టు 15 నుండి
అమల్లోకి రానున్న
**రైతు బీమా**



జారీచేసినవారు
సమాచార పౌర సంబంధాల శాఖ, తెలంగాణ ప్రభుత్వము

Advt.

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 206 - September 2018 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/8/2018 ● Postal Regn. No. HD/1100/2017-19



Date of Posting : 29th, 30th

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao